# అవే అయితే బోర్!

## -సుప్రియ ఐసోలా



**'బాబు బాగా బిజీ' సినిమా తరువాత అందులో నటించిన వారందరూ ఎంత బిజీ అయ్యారో తెలియదు కానీ చంద్రిక పాత్ర పోషించిన సుప్రియ ఐసోలా మాత్రం బిజీ అయిపోయింది. ఒకేసారి ఏడెనిమిది సినిమా అవకాశాలు ఆమె తలుపు తట్టాయి. కాకపోతే అన్నీ ఒకే రకమైన పాత్రలు వస్తున్నాయనీ, ఎప్పుడూ అవే చేయాలంటే బోర్ అనీ అంటున్న సుప్రియతో...**

### మీ గురించి...

మాది హైదరాబాద్. మాస్ కమ్యూనికేషన్‌లో డిగ్రీ చేశాను. చిన్నతనం నుంచీ నాటకాలంటే ఇష్టం. చదువుకుంటూనే ఎన్నో స్టేజి ప్రదర్శనలు ఇచ్చాను.

### మొదటి సినిమాలోనే బోల్డ్‌గా నటించడం ఇబ్బందిగా అనిపించలేదా?

దీని మాతృక 'హంటర్'లో నా పాత్ర బోల్డ్‌గా అనిపించవచ్చు కానీ, తెలుగులోకి వచ్చేసరికి ఆ పాత్రను ఇక్కడి నేటివిటీకి అనుగుణంగా మార్చారు. మొదట్లో నేనూ అలాగే అనుకున్నాను. కానీ, దర్శకులు నాకు కథ చెప్పేటప్పుడే ఇక్కడికి అనుగుణంగా మార్చి చెప్పడంతో ధైర్యంగా చేశాను. నా పాత్రకి మంచి పేరే వచ్చింది. ఈ సినిమాలో నాది వాంప్ క్యారెక్టర్ కాదు. అందుకే చేశాను. ఈ సినిమా మొత్తం చీరలోనే కనిపిస్తా. క్యారెక్టర్‌లో సెక్సీదనం ఉన్నా అసభ్యంగా ఎక్కడా కనిపించను. తెలుగులో ఇలాంటి సినిమా రాలేదని విన్నాను. నేనెంత బోల్డ్‌గా చేశానో, అవసరాల శ్రీనివాస్ గారు కూడా అంతే బోల్డ్‌గా చేశారు.

### ఈ పాత్ర ఛాలెంజ్‌గా తీసుకున్నారా?

ఈ పాత్రలో రకరకాల షేడ్స్ ఉన్నాయి. ఒక సమయంలో పాత్ర అదుపు తప్పుతుందేమో అనిపిస్తుంది. కానీ ఎక్కడా అదుపు తప్పదు. సున్నితమైన శృంగారానికి హాస్యం జోడించి చూపించారు తప్ప అశ్లీలత ఎక్కడా మచ్చుకు కూడా కనిపించదు.

### అవసరాల శ్రీనివాస్ గురించి...?

ఆయన చాలా మంచి వ్యక్తి. మంచి సెన్సాఫ్ హ్యూమర్ ఉన్న వ్యక్తి. తన మేనరిజంతో పాత్రకి ప్రాణం పోశారు.



### ఈ సినిమా కన్నా ముందు తెలుగు సినిమాలో నటించినట్టున్నారు?

'సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు' సినిమాలో చాలా చిన్న పాత్ర అది. కొన్ని సెకన్ల పాటు కనిపిస్తాను, అంతే! 'బాబు బాగా బిజీ'నే నా మొదటి సినిమా!

### ఈ సినిమా తరువాత మీరు బాగా బిజీ అయినట్టున్నారు?

దాదాపు ఏడెనిమిది అవకాశాలు వచ్చాయి. అన్నీ. బోల్డ్ క్యారెక్టర్లే! అందుకే ఓకే చెప్పలేదు. ఎప్పుడూ అలాంటి పాత్రలే చేస్తుంటే చూసేవారికి బోర్ కొట్టే అవకాశం ఉంది.

### నాటకాలకీ, సినిమాలకీ తేడా?

చాలా ఉంది. దేని కష్టాలు దానికుంటాయి. కాకపోతే నాటకాలతో పోల్చుకుంటే సినిమాల్లో టెక్నాలజీ ప్రభావం ఎక్కువగా ఉంటుంది. నాటకాల్లో ఇప్పుడిప్పుడు టెక్నాలజీ చోటుచేసుకుంటున్నా, సినిమాల స్థాయిలో టెక్నాలజీని వాడుకునే అవకాశం ఇక్కడ ఉండదు. ఇదే పెద్ద తేడా. నటించడం ఎక్కడైనా ఒకటే! నాటకాలలో స్టేజీ మీద ప్రేక్షకులకు నేరుగా కనిపిస్తే, సినిమాల్లో తెర మీద కనిపిస్తాం.

### ఎలాంటి పాత్రలంటే ఇష్టం?

ఒకే చట్రంలో ఇరుక్కుపోవడం నాకు నచ్చదు. సుప్రియ అన్ని క్యారెక్టర్లు చేయగలదు అని అనిపించుకోగలగాలి. భవిష్యత్తులో నా పాత్రల ఎంపిక కూడా అలాగే ఉంటుంది. ప్రేక్షకులకు దగ్గర చేసే ఏ పాత్ర అయినా నాకు ఇష్టమే! ఇప్పుడే ఇక్కడ సినిమాలు చేయడం మొదలెట్టాను. అప్పుడే ఇష్టమైన పాత్రలు అంటే కష్టం. రకరకాల పాత్రలు చేయాలని ఉంది. నటన అనేది ఓ సముద్రం లాంటిది. ఎంత నటించినా నటించాల్సింది ఇంకా మిగిలే ఉంటుంది. ఆరంభమేతప్ప దానికి ముగింపు ఉండదు అని నా అభిప్రాయం. కెరీర్‌లో ఇన్ని పాత్రలు చేయాలి, ఇన్ని సినిమాలు చేయాలన్న నిబంధనలు ఉండవు. ఎన్ని సినిమాలు చేసినా, ఎప్పటికప్పుడు కొత్తగా ఫీలవ్వాలి. అప్పుడే నటి నుంచి మంచి నటన రావడానికి అవకాశం ఉంటుంది. క్లాసికల్ డ్యాన్స్ నేర్చుకుంటున్నాను.

### తెలుగులో చేస్తున్న సినిమాలు?

చెప్పానుగా. అన్నీ ఒకేరకమైన అవకాశాలు వస్తున్నాయి వెరైటీ కథతో వస్తారేమో అని చూస్తున్నాను. ఏదైనా సినిమా ఒప్పుకుంటే వెంటనే దాని వివరాలు చెబుతాను.

–బి.కె.

## నవ్యవీక్లి-తురగా ఫౌండేషన్ సంయుక్త నిర్వహణలో



### తురగా జానకీరాణి కథల పోటీ

| | |
|---|---|
| ప్రథమ బహుమతి | : రూ. 10,000 |
| ద్వితీయ బహుమతి | : రూ. 8,000 |
| తృతీయ బహుమతి | : రూ. 7,000 |
| 5 విశేష బహుమతులు | |
| కథ ఒక్కింటికి | : రూ. 5,000 |

### తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీ



| | |
|---|---|
| ప్రథమ బహుమతి | : రూ. 10,000 |
| ద్వితీయ బహుమతి | : రూ. 8,000 |
| తృతీయ బహుమతి | : రూ. 7,000 |
| 5 విశేష బహుమతులు | |
| కథ ఒక్కింటికి | : రూ. 5,000 |

### కథ/హాస్యకథ: నిబంధనలు

- కథ తెలుగు వారి జీవితాన్ని ప్రతిబింబించేలా ఉండాలి.
- ప్రపంచంలోని ఏ ప్రాంతమైనా కథకు నేపథ్యం కావచ్చు. అయితే అది తెలుగువారి జీవితానికి సంబంధించినదై ఉండాలి.
- కథలు అరటావు సైజులో 10 పేజీలకు మించకుండా ఒకవైపునే రాసి పంపాలి. దస్తూరి చక్కగా అర్థమయ్యేలా ఉండాలి. డి.టి.పి. చేసిన పక్షంలో అది 6 పేజీలకు మించరాదు.
- కథను పంపేటప్పుడు రచయిత/రచయిత్రి పేరు అందులో ఉండరాదు. పేరు, పూర్తి చిరునామా వేరే కాగితం మీద రాసి జతపరచాలి. అనుకరణ, అనుసరణ కాదని, బ్లాగుల్లోనూ, వెబ్ మాగజైన్స్‌లోనూ రాలేదని హామీ పత్రం విధిగా జత చేయాలి. కవరు మీద 'తురగా జానకీరాణి కథల పోటీకి' అని స్పష్టంగా పేర్కొనాలి. పోటీకి హాస్యకథ పంపుతున్నట్టయితే కవర్ మీద 'తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీకి' అని పేర్కొనాలి.
- విదేశాల నుంచి కథలు పంపించే రచయితలు/రచయిత్రులు మాత్రమే ఈ-మెయిల్ (navyaweekly@andhrajyothy)కి పంపగలరు.
- బహుమతి పొందిన కథలు 'నవ్య' వీక్లీలో ప్రచురితమవుతాయి.
- పోటీ గడువు తేదీ పొడిగించేందుకు కానీ, అర్హమైన రచనలు రాకపోతే బహుమతుల్లో మార్పులు చేసేందుకు కానీ 'నవ్య వీక్లి' యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి.
- కథల ఎంపిక విషయంలో తుది నిర్ణయం నవ్య సంపాదక వర్గానిదే! ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు కాని, వాద ప్రతివాదాలకు కాని తావు లేదు. ప్రచురణకు అనర్హమైన కథలు తిప్పి పంపడం సాధ్యం కాదు.

### కథలు పంపవలసిన చిరునామా

నవ్య వీక్లి
ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్
ప్లాట్ నెం. 76
రోడ్ నెం 70
అశ్వనీ లే అవుట్
హుడా హైట్స్
జూబ్లీహిల్స్
హైదరాబాద్-500033

## కథలు, హాస్యకథలు చేరవలసిన ఆఖరు తేది

# 30 జూన్ 2017

*నిబంధనలు వర్తిస్తాయి



8

## వింత వింత వివాహాలు

పెళ్ళి ఓ గొప్ప వేడుక. దేశ కాలమానాలకనుగుణంగా పెళ్ళి సంప్రదాయాలుంటాయి. పెళ్ళినాడు చెట్లునాటే వధూవరులు కొందరైతే, చీపురుకట్టపైనుంచి దూకేవారు మరికొందరు. కొందరు అద్దం పగలగొడితే మరికొందరు ఏకంగా శ్మశానంలో పెళ్ళి చేసుకుంటారు! ఆ వింతలు చదవండి

**44**

### వెండితెర మీద హాజీమస్తాన్

'తలైవర్ 161' టైటిల్‌తో హాజీమస్తాన్ కథ తెరకెక్కనున్న నేపథ్యంలో ఆ అండర్‌వరల్డ్ డాన్ జీవిత ప్రయాణం, అతడి గుణగణాలపై ఓ లుక్

**72**

### ఇంటర్వ్యూ

తెలుగు ప్రేక్షకులను ఉర్రూతలూగించిన హిట్ చిత్రాల గ్లామర్ నటి రాధ. హీరోయిన్‌ను ఈ మధ్య మరీ సెక్స్ సింబల్‌గా చూపించడం ఎక్కువైందంటున్న ఆమె ఇంటర్వ్యూ...

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: రకుల్‌ప్రీత్‌సింగ్
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### పాపం! ముసలితనం

ఆ భార్యాభర్తలిద్దరూ తొంభయ్యవడిలో పడ్డారు. ఇద్దరికీ ఏదీ జ్ఞాపకం ఉండడం లేదు. వెళ్ళి డాక్టర్‌ని కలిశారు. ప్రొబ్లం చెప్పారు. శారీరకంగా ఇద్దరూ బాగానే ఉన్నారు. జ్ఞాపకశక్తి ఒక్కటే కదా సమస్య. ఆ సమస్య తీరాలంటే ప్రతిదీ కాగితం మీద రాసి పెట్టుకోండి. కొన్నాళ్ళకు అదే సర్దుకుంటుంది అన్నాడు డాక్టర్. సరేనని ఇంటికి చేరుకున్నారిద్దరూ. ఇంటికి వస్తూనే టిఫిన్ తయారుచేసేందుకు వంటింట్లోకి పరుగుదీసింది భార్య. ఆమెను పిలిచాడు భర్త.

"టిఫినేంటి చేస్తున్నావు?" అడిగాడు.

"మీకు ఇష్టం కదా, పెసరట్లు వేస్తున్నాను." చెప్పింది భార్య.

"శభాష్! అయితే ఓ పని చెయ్యి. అట్టు మీద బాగా ఉల్లిచెక్కు వెయ్యి."

"సరే"

"సరే కాదు, కాగితమ్మీద రాసుకో."

"అక్కర్లేదు చెప్పండి."

"అలాగే సన్నగా కట్ చేసి పచ్చిమిర్చి కూడా వెయ్యి."

"సరే"

"సరేకాదు, కాగితమ్మీద రాసుకో, డాక్టర్ చెప్పాడుగా."

"పర్వాలేదు, చెప్పండి."

"అల్లం కూడా దట్టించి వెయ్యాలి."

"ఓకే" అంది భార్య. వంటింట్లోకి వెళ్ళి కాసేపటికి ఉప్మాతో తిరిగి వచ్చింది. ఉప్మాని చూస్తూ కస్సుమన్నాడు భర్త.

"నేనేం చెప్పాను, నువ్వేం తెచ్చావు? పూరీ కదా నేను చెప్పింది."

### మత్తు

హాల్లో కూర్చుని ఆ భార్యాభర్తలిద్దరూ వైన్ తాగుతున్నారు.

"ఐ లవ్ యూ" అంది భార్య.

"వైన్ మత్తులో మాట్లాడుతున్నావు?" నవ్వాడు భర్త.

"లేదు, నేను వైన్‌తోనే మాట్లాడుతున్నాను." అన్నది భార్య.

### ఇప్పుడా?

పన్నెండేళ్ళుగా జైల్లో ఉండి, ఎలాగోలా ఆ రోజే తప్పించుకున్నాడతను. పోలీసుల కంటబడకుండా రహస్యంగా ఇంటికి చేరుకున్నాడు. ఇంటికి చేరిన భర్తను నిలదీస్తూ భార్య అరిచిందిలా.

"పొద్దున ఎనిమిదింటికి తప్పించుకుని, ఇప్పుడా ఇంటికి రావడం? ఇంతసేపూ ఎక్కడ చచ్చావు?"

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

# నవ్య

సంపుటి: 14 సంచిక: 13

31-5-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



## మొదటి పేజి

# అమ్మా! రాములమ్మా!

రైలు ప్రయాణం అంటే అగ్రహారంలో హడావుడి అంతా ఇంతా కాదు. ఫలానా టైంకి రైలంటే గంట ముందుగానే స్టేషన్‌కి చేరుకోవాలి. పిల్లల్నీ, సామానునీ జాగ్రత్తగా చూసుకున్నట్టుగానే ప్లాట్‌ఫారం చివర, తురాయిచెట్టు నీడన ఉన్న రాములమ్మనీ దర్శించుకోవాలి. రాములమ్మ అగ్రహారం ఆడబడుచు. ఆ ఊరి వేలుపు. అక్కడ ఆమె కొలువై ఉంది. వేలుపుకాక ముందు రాములమ్మ మామూలు మనిషే! ప్లాట్‌ఫారం మీద వేరుసెనగకాయలు అమ్ముకునేది. ఎవరో, ఎక్కణ్ణుంచి వచ్చిందో ఎవరికీ తెలియదు కాని, తురాయిచెట్టునీడన రాములమ్మ అంటే అందరికీ అభిమానమే! ప్రతి ప్రయాణికుణ్ణీ రాములమ్మ పలకరించేది. కష్టం సుఖం అడిగి తెలుసుకునేది. డబ్బులిచ్చినా ఇవ్వకపోయినా గుప్పెడు వేరుసెనగకాయలు దోసిట్లో పోసి, తింటూ మాట్లాడమని, ఆ మాటల్లో అవతలివ్యక్తి మనసు కనుగొనేది. మంచికోసం పయనిస్తున్నాడంటే క్షేమంగా వెళ్ళి లాభంగా రా అనేది. చెడుకోసం ప్రయాణిస్తున్నాడంటే చెయ్యెత్తి దండించేది. వెనక్కి పో అని హెచ్చరించేది. వినకుండా రైలెక్కితే శిక్షతప్పదు. ఇబ్బందులు పడాల్సిందే!

ఒకసారి అగ్రహారం అగ్రహారం అంతా యాత్రాస్పెషల్ రైల్లో తీర్థాలన్నీ చుట్టి వచ్చేందుకు ప్రయాణిస్తోంటే వద్దని వేడుకున్నది రాములమ్మ. ఎందుకు వద్దు? ఏమౌతుందని అడిగితే చెప్పలేదు. ఏడ్చింది. పిచ్చిది అని కొట్టి పారేసి, అంతా రైలెక్కి వెళ్తోంటే వద్దు వద్దని వెంటపడింది. ఆపేందుకు ఎంతగానో ప్రయత్నించింది. మరోదారిలేక ఆఖరికి రైలుకిందపడి ఆత్మహత్య చేసుకుంది. అయినా ఆగలేదెవరూ. బయల్దేరారు. అంతే! పెనుతుపాను రేగింది. పెద్దగా గాలీవానా. రైళ్ళు పడిపోయాయి. పరుగుదీస్తున్న యాత్రాస్పెషల్ కూడా పడిపోవాల్సిందే! కాని ఎవరో పట్టి నిలిపినట్టుగా నిలిచిపోయింది. దాంతో అగ్రహారీకులంతా రైలు దిగి, ఊపిరి పీల్చుకున్నారు. ప్రాణాలు దక్కాయన్నారు. రాములమ్మను గుర్తించారు. వెనక్కి పరుగెత్తుకొచ్చి, ఆమెను దేవతను చేశారు. తురాయిచెట్టునీడన అమ్మకు గుడికట్టారు.



అప్పటి నుంచి అందరికీ ఇది అలవాటైంది. తల్లీ! ప్రయాణానికి ఇదీ కారణం. వెళ్ళమంటావా? వద్దంటావా? అంటే... ఆ వ్యక్తి రైలు ఎక్కుతున్నప్పుడు ఎలాంటి ఆటంకం కలగలేదంటే సరే, ఆటంకం కలిగిందంటే మాత్రం ప్రయాణం విరమించుకోమని చెప్పినట్టే! ప్రేమయాత్రలు, తీర్థయాత్రలు, పెళ్ళి, చావు, చదువు... ఏ ప్రయాణానికైనా రాములమ్మ అంగీకారం, ఆశీస్సులూ ఉండాల్సిందే! లేదంటే ప్రమాదాన్ని కొని తెచ్చుకున్నట్టే! అందుకే ప్రయాణికులు రాములమ్మ గుడిదగ్గర క్యూలు కట్టి ఉంటారు. ఆమె దర్శనం కోసం వేచి ఉంటారు. రైలొచ్చేవేళకి దర్శనం అయిపోవాలి. ఆ దర్శనం కోసమే గంట ముందుగా స్టేషన్‌కి చేరుకోవాలి. మంచిపనికైతే రాములమ్మ అండా ఆశీస్సూ ఉంటాయి. రైలెక్కించి పంపుతుంది. చెడుపనికైతే చెంపదెబ్బలుంటాయి. రైలెక్కనివ్వదు సరికదా, తగిన శిక్ష వేస్తుంది. అవన్నీ కథలు కథలుగా ప్రచారంలో ఉన్నాయి.

పట్నంలో ఉన్న అత్తగారిని చంపి, ఆమె ఆస్తి కాజేద్దామని అల్లుడు సుబ్బారాయుడు, నలుగురు గూండాలతో, కత్తులతో అగ్రహారం నుంచి బయల్దేరుతూ పని సజావుగా సాగేట్టుగా చూడమని రాములమ్మని మొక్కుకున్నాట్ట! ఇష్టమైన వేరుసెనగపప్పుతో ఆమెను అభిషేకించాట్ట కూడా. తీరా అయిదుగురూ రైలెక్కుతోంటే దాచుకున్న కత్తులు బయటపడి, పోలీసులకి పట్టుబడ్డారు. ఈ కత్తులేమిటి? ఎక్కడికి మీరంతా? అంటూ పోలీసులు తగిన మర్యాదలు చేసి, కూపీలాగేసరికి సుబ్బారాయుడికి పైప్రాణాలు పైనే పోయాయి. దాంతో అంతో ఇంతో ఇంట్లో దాచుకున్న డబ్బు కూడా పోయింది. ఆచారిగారమ్మాయిని పట్నం కుర్రాడొకడు, ప్రేమ పేరుతో లేవదీసుకుపోయేందుకు ప్రయత్నించాడు. పట్నంలో ఆమెను వేశ్యను చేద్దామనుకున్నాడు. అమ్మాయి సహా స్టేషన్‌కొచ్చాడు. రైలెక్కాడతను. అమ్మాయిని ఎక్కమన్నాడు. ఆమె ఎక్కలేకపోతోంది. ఎవరో పట్టి ఆపినట్టుగా కదలలేక పోతోంది. ఇంతలో రైలు కదిలిపోయింది. వెళ్ళిపోయింది. అప్పుడు అర్థమైంది అమ్మాయికి. కుర్రాడు మంచివాడు కాదని, అతని బారి నుండి రాములమ్మే తనని రక్షించిందని.

ఈ కథలన్నీ నిజాలా? ప్రచారాలా? అన్నది పక్కనపెడితే మనసున్న మనుషుల్ని దేవతల్ని చేసే అగ్రహారం, అక్కడి రైల్వేప్లాట్‌ఫారం చాలా గొప్పవి. అందుకే అక్కడ వేళపట్టున వర్షాలు కురుస్తున్నాయి. ఎండలు కాస్తున్నాయి. చల్లచల్లగా గాలులు వీస్తున్నాయి.




## పుస్తకాల పల్లె

పచ్చని కొండల నడుమ, జలజల జాలువారే జలపాతాలతో ప్రకృతి రమణీయతకు ఆలవాలమైన గ్రామం భిలార్! మహారాష్ట్రలో ఉందీ వేసవి విడిది. అయితే ఇది కేవలం వేసవి విడిది, పర్యాటక స్థలం మాత్రమే కాదు, ఈ గ్రామానికి మరో ప్రత్యేకత కూడా ఉంది. దేశంలోనే మొట్టమొదటి పుస్తకాల పల్లెగా రికార్డులకెక్కింది.

సోషల్‌మీడియా ప్రభంజనంతో, స్మార్ట్‌ఫోన్ల హవాతో ఎవరి చేతిలో చూసినా మోడరన్ గాడ్జెట్లే కనబడుతున్నాయి. ఫేస్‌బుక్, వాట్సప్ అంటూ తలకాయలు ఫోన్లకు అంటిపెట్టుకునే ఉంటున్నాయి. అందువల్లనే బుక్ రీడింగ్ అటకెక్కిందంటున్నారు. అందుకే మహారాష్ట్ర ప్రభుత్వం పుస్తకాల పల్లె అనే కార్యక్రమానికి శ్రీకారం చుట్టింది. పుస్తకం తన ఉనికి కోల్పోకూడదనే



సదుద్దేశంతో మొదటగా భిలార్ అనే టూరిస్టు స్పాట్‌ని ఎంచుకుంది. ఊరంతా పుస్తకాల విశిష్టతను తెలిపేలా అందంగా పెయింటింగ్ వేయించారు. ఎక్కడ అడుగు పెట్టినా పుస్తకం అనే రూపం వెంటాడుతుంది. అంత అందంగా ముస్తాబు చేశారు.

పదివేలు జనాభా గల ఈ గ్రామంలో పుస్తకాలు కూడా పదివేలకు పైగా ఉన్నాయి. అంటే మనిషికో పుస్తకం ఉందన్నమాట. సుమారు 25 సెంటర్లను ఏర్పాటు చేశారు. అన్నిచోట్లా కథలు, సాహిత్యం, చరిత్ర, సామాజిక అంశాలు, జీవిత గాథలు, చిన్న పిల్లల పుస్తకాలు ఉంటాయి. చదువుకోడానికి కుర్చీలు టేబుల్స్ ఇచ్చారు. అయితే పుస్తకాలన్నీ స్థానిక భాష మరాఠీలో మాత్రమే కనిపిస్తాయి. మొదటగా మాతృభాష పటిష్టం చేసుకోవాలనే ఉద్దేశంతో అక్కడి భాషకు సాంస్కృతిక శాఖ ముందుగా మాతృభాషకి ప్రాధాన్యం ఇచ్చింది. బ్రిటన్‌లో హేయ్ ఆన్ వేయ్ అనే పట్టణానికి ఒక విశేషం ఉంది. 1962లో అక్కడ ఓ చిన్న పుస్తకాల షాపు వెలసింది. దాని స్ఫూర్తితో చుట్టుపక్కల లెక్కలేనన్ని బుక్ షాపులు అవతరించాయి. దాంతో ఆ ఊరు టౌన్ ఆఫ్ బుక్స్‌గా ప్రసిద్ధి చెందింది. ఆ స్ఫూర్తితోనే భిలార్ గ్రామాన్ని పుస్తకాల పల్లెగా తీర్చిదిద్దారు. ఇది కనుక విజయవంతం అయితే దేశవ్యాప్తంగా టూరిజం కేంద్రాలన్నీ పుస్తక పఠనా కేంద్రాలుగా రూపాంతరం చెందుతాయనడంలో సందేహం లేదు.

# మెయిల్ బాక్స్

### మనింటిని చక్కబెట్టుకుందాం

ప్రపంచ కుటుంబ దినోత్సవం సందర్భంగా పుష్పలతగారు రాసిన వ్యాసం ద్వారా ఎన్నో విషయాలు తెలుసుకున్నాం.. విదేశాల సంగతి పక్కనపెడితే మన దేశంలో కూడా కుటుంబాల ఐక్యత విచ్ఛిన్నమైపోతోంది. ప్రేమలు, ఆప్యాయతలు తగ్గిపోయి ద్వేషాలు పెరిగిపోయి ఎవరికివారే అన్నట్టు అయిపోతోంది. ముఖ్యంగా కొడుకులు ఇందుకు కారణం అనిపిస్తోంది. ప్రపంచం సంగతి తర్వాత. ముందు మన దేశంలో కుటుంబ వ్యవస్థను పటిష్టపరుచుకోవాలి. ఈ విషయం యునిసెఫ్ దాకా వెళ్ళిందంటే బాధాకరమైన విషయమే.

—శ్రీవల్లి, హైదరాబాద్

### శృంగారం వ్యామోహం కాదు

శృంగారం కేవలం ఒక వ్యామోహం కాదనీ, భార్యభర్తల అనుబంధాన్ని పటిష్టంగా కాపాడే సాధనమని చెప్పారు విజేత. శృంగారాన్ని సరిగ్గా అర్థం చేసుకోవడానికి ఉపయోగపడే ఎన్నో వ్యాసాలు ఈ మధ్యకాలంలో నవ్య వీక్లీలో ప్రచురించడం, అవన్నీ దాంపత్య జీవితాన్ని అర్థం చేసుకోవడానికి ఉపయోగపడేవిగా ఉండటం సంతోషకరం. శృంగారాన్ని అశ్లీలంగా కాకుండా ప్రయోజనాత్మకమైన పద్ధతిలో రాస్తూ ఎడ్యుకేట్ చేయడం నవ్యకే చెల్లింది. సంపాదకులకు అభినందనలు.

—టి.ప్రకాష్, విశాఖపట్నం

### కళాకృతులు అదుర్స్

కాగితాలతో కళాకృతులు (మే 17వతేదీ) వ్యాసం అదుర్స్. వ్యాసం ఎంతో వైవిధ్యంగా, క్రియేటివిటీని ప్రోత్సహించేదిగా ఉంది. హర్ష ఋతువు కథ తల్లిదండ్రుల్లో గూడుకట్టుకున్న అసంతృప్తికి అద్దంపట్టింది. పిల్లలు రెక్కలు వచ్చి ఎగిరిపోయి కన్నవారిని కనీసం పలకరించకుండా ఉన్న రోజులు దాపురించినప్పుడు తల్లిదండ్రులు అద్దెకు బంధువుల్ని బుక్ చేసుకోవడం తప్పుకాదని చక్కగా చెప్పారు రచయిత సింహప్రసాద్. కథలన్నీ బాగున్నాయి.

—కె.నారాయణ, కాకినాడ

### సీరియల్స్, కథలు బాగున్నాయి

ఈ వారం కథలన్నీ బాగున్నాయి. హర్షఋతువు, మరో అమ్మకథ, కొత్త బంగారులోకం వేటికవే సాటి. ఇక సరదాకథలు సరికొత్త సరదాతో నవ్విస్తున్నాయి. కన్నతండ్రి కాలక్షేపం కోసం ఒక కొత్త బంగారులోకాన్ని సృష్టించిన కొడుకు కథ రక్తికట్టింది. మార్నింగ్ కాఫీ, కార్టూన్లు బాగున్నాయి.

ఇవన్నీ నిజాలే విజ్ఞానదాయకంగా ఉంటున్నాయి.

—ఎ.రామకృష్ణ ప్రసాద్, హైదరాబాద్

### అలరించిన వీక్లీ

తమన్నా ముఖచిత్రంతో నవ్య వీక్లీ అలరించింది. మార్నింగ్ కాఫీలో మూడో మరాఠీ గదమాయింపు బాగా నవ్వించింది. జానకమ్మ వంటి పెద్దల సుద్దులు వినే అదృష్టం లేని యువతలు వైవాహిక జీవితాన్ని సుఖంగా గడపలేక అవివేకంతో పంతాలు పట్టుదలతో పచ్చని సంసారాలలో చిచ్చుపెట్టుకుంటున్నారని మొదటిపేజీ 'మనుషులింతే' ఉద్ఘాటించింది.

వినూత్నమైన వీఆర్ సైకిల్ ఉపయోగాలు ఆశ్చర్యపరిచాయి. ఓరిగామి కళాకృతులు అబ్బురపరిచాయి. ఎవరి పిచ్చి వారికి ఆనందం అన్నట్టు 'అందం అంటే' ఫీచర్ 8 దేశాల్లో ఆచరించే సౌందర్యక్రియలు పద్ధతులు వివరించి ఆశ్చర్యపరిచాయి. తమిళ రాజకీయాల్లో బిజెపి ఎత్తుకు పైఎత్తులను రివ్యూ వివరించింది. సి.వి.ఆర్ పుస్తక సమీక్ష ఆకట్టుకుంది. రాక్షసుల నామధేయాలు, వంశాలు, విధ్వంసాలు అరికట్టే విష్ణువుకి మార్గం చూపించిన బ్రహ్మ కంసుడికి నారదుని హెచ్చరిక వంటి అంశాలతో హరివంశం ఆసక్తిదాయకంగా ఉంది.

సురభి వింతల్లో వేలాది బొమ్మలు సేకరించిన హాబీ మరువరానిది. సరదాగా, తీన్మార్ నవ్వించాయి. ఇవన్నీ నిజాలే విజ్ఞానదాయకమైన శీర్షిక. మానవ సంబంధాలు అడుగంటి ఆర్థిక సంబంధాలు బలపడుతున్న ఇతివృత్తంతో హర్షఋతువు కథ చక్కని సామాజిక సందేశాన్నిచ్చింది. మరో అమ్మ కథ ఆసాంతం బాగుంది. కొత్త బంగారులోకం కథ మంచి కథాంశం. సరదాకథ రంజింపజేసింది.

—మాధవరపు కృష్ణ, కాకినాడ

### అలరిస్తున్న తారల ఇంటర్వ్యూలు

సినిమా తారల ఇంటర్వ్యూలు నవ్య వీక్లీకి ప్రత్యేకం. వారం వారం మమ్మల్ని ఎంతో ఆకట్టుకుంటున్నాయి. ఈ వారం రకుల్‌ప్రీత్‌సింగ్, లావణ్య త్రిపాఠి, మిస్టీ చక్రవర్తి ఇంటర్వ్యూలు అదిరాయి. ఇప్పుడు నటులందరూ కోట్లు కోట్లు తీసుకుంటున్నారు. తక్కువ సమయంలో పెద్ద హీరోలతో చేస్తూ మంచి పేరు తెచ్చుకున్న రకుల్ ప్రమోషన్ కోరుకోవడం తప్పుకాదు. రామ్‌గోపాల్ వర్మ తన ట్వీట్లతో ఇటీవల వివాదాస్పదమవుతున్నారు. ఇది ఆయన విశ్వసనీయతకు నష్టం కలుగుతుంది.

—పోసి ప్రభాకర్, హైదరాబాద్

### జానపదానికి మంచిరోజులు

సినిమా సంగతులు బాగుంటున్నాయి. భవిష్యత్తు తెలుగు చిత్ర పరిశ్రమదే అని రాజీవ్ కనకాల చెప్పడం అక్షరాలా నిజమనిపిస్తోంది. ఇప్పుడు బాహుబలి 1500 కోట్లతో దేశంలో రికార్డు కొట్టింది. ఇక అన్నీ ఇలాంటి జానపద చిత్రాలే వచ్చే అవకాశాలుంటాయి. ఇక పిల్లలకు, మన జానపద సాహిత్యానికి మంచిరోజులు వచ్చినట్టే.

—కె.వి.రమణ, విజయవాడ

## సైనసైటిస్, ఆస్తమా శాశ్వతంగా పోతాయి

**సైనసైటిస్, ఆస్తమా** దీర్ఘకాలం వేధించే జబ్బులని చాలా మంది అనుకుంటారు. కానీ హోమియోలో శాశ్వతంగా తగ్గించే వీలుంది. సైనస్‌లో ఉండే డిఫెన్స్ మెకానిజం చాలా వరకు సూక్ష్మక్రిములు శరీరంలోకి రాకుండా అడ్డుకుంటుంది. కానీ 5 మైక్రాన్ల కన్నా తక్కువ ఉండే పార్టికల్స్ సైనస్‌లో ఆగకుండా నేరుగా ఊపిరితిత్తుల్లోకి వెళ్లిపోతాయి. వీటిని బయటకు పంపించడానికి శరీరం ప్రయత్నిస్తుంది. ఫలితంగానే తుమ్ములు వస్తుంటాయి. అంతేకాకుండా పెస్టిసైడ్స్ ఉపయోగించిన పదార్థాలు తీసుకోవడం, ప్రిజర్వేటివ్స్ వాడిన ఆహారపదార్థాలు తినడం, వాతావరణ కాలుష్యం, ఇంట్లో పరిసరాలు శుభ్రంగా లేకపోవడం, దుమ్ము, ధూళి ఎక్కువగా ఉండే ప్రదేశాల్లో ఉండటం వంటివి సైనస్ సమస్యకు, ఆస్తమాకు కారణమవుతాయి.

**లక్షణాలు :** సైనసైటిస్‌లో ముక్కు దిబ్బడ, తలనొప్పి, ముక్కులో నుంచి దుర్వాసన వంటి లక్షణాలుంటాయి. ఆస్తమాలో కనిపించే ప్రధాన లక్షణాలు దగ్గు, ఆయాసం. పిల్లికూతలు కూడా ఉంటాయి. కొంత మందిలో దగ్గు మాత్రమే ఉంటుంది. దీంతోపాటు ఛాతీ పట్టేసినట్టుగా ఉంటుంది.

**హోమియోతో దూరం**

వేటివల్ల సైనసైటిస్, ఆస్తమా లక్షణాలు ఎక్కువవుతున్నాయో గుర్తించి వాటికి దూరంగా ఉండాలి. జీవనవిధానం మార్చుకోవడంతో పాటు హోమియో చికిత్స తీసుకుంటే సైనస్, ఆస్తమా శాశ్వతంగా పోతాయి. మూల కారణాన్ని తొలగించే విధంగా హోమియో వైద్యం ఉంటుంది.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
**మాస్టర్స్ హోమియోపతి**
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.

## హెర్పిస్ బాధకు ఇక సెలవు

**అతి** సూక్ష్మమైన వైరస్ హెర్పిస్. జీవితాంతం బాధించే ఈ వైరస్‌ను హెర్పిస్ సింప్లెక్స్ వైరస్ అంటారు. ఇది రెండు రకాలు.

హెచ్‌ఎస్‌వి 1 : ఇది నోటి దగ్గర పొక్కుల రూపంలో బయటపడుతుంది. పెదవుల చుట్టూ తెల్లని నీటిపొక్కులలాగా కనిపిస్తుంది. ఎక్కువగా పిల్లల్లో కనిపిస్తుంది. సాధారణంగా ఇవి వచ్చిపోతూ ఉంటాయి.

హెచ్‌ఎస్‌వి 2 : జననావయవాల దగ్గర పొక్కులతో బయటపడుతుంది. దీనినే జెనిటల్ హెర్పిస్ అంటారు. చిన్న చిన్న నీటి పొక్కులలాగా వచ్చి పగిలిపోతుంటాయి. తగ్గినట్టే తగ్గి తిరిగి రావడం జరుగుతుంది.

హెర్పిస్ వైరస్ శృంగారం జరిపే సమయంలో వ్యాప్తి చెందుతుంది. కలయిక సమయంలో చర్మం చిట్లినప్పుడు పుండ్లు, గాయాల ద్వారా ఈ వైరస్ వ్యాపిస్తుంది. శరీరంలోకి ప్రవేశించిన ఈ వైరస్ కొద్దిరోజుల్లోనే ప్రభావం చూపిస్తుంది. రోగిలోని రోగనిరోధకవ్యవస్థ బలహీనపడినపుడు మానసిక ఆందోళన, శారీరక ఆందోళన ఉన్నప్పుడు వాతావరణ పరిస్థితులు మారినపుడు ఏదైనా తీవ్రమైన అనారోగ్య సమస్యలు వచ్చినపుడు సునామిలాగా విజృంభిస్తుంది.

**హోమియో చికిత్స :** హెర్పిస్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. ఈచికిత్స మూల కారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. సాధారణంగా హెర్పిస్ తగ్గినట్టే తగ్గి మళ్లీ వస్తుంది. అయితే హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టదు. అనుభవజ్ఞుడైన హోమియో వైద్యుని దగ్గర చికిత్స తీసుకుంటే హెర్పిస్ శాశ్వతంగా తరిమేయవచ్చు.

## హెచ్ఐవి ఉన్నా హోమియోతో జీవితం

**హెచ్ఐవి** పేరు వింటనే తెలియని భయం. ఎందుకంటే చికిత్స లేని వ్యాధి అది. నిజమే. కానీ ఇప్పుడు అద్భుతమైన మందులు అందుబాటులోకి వచ్చాయి. వైరస్ పూర్తిగా శరీరంలో నుంచి తొలగిపోకపోయినా ఆ వైరస్ ఎటువంటి ప్రభావం చూపకుండా చేసే హోమియో మందులు అందుబాటులో ఉన్నాయి. హెచ్ఐవి అంటే ఒక వ్యాధి అని చెప్పడం కన్నా వ్యాధులు రావడానికి కారణమయ్యే వాతావరణాన్ని శరీరంలో కలగజేస్తుందని చెప్పవచ్చు. అంటే చిన్న వాతావరణ మార్పులకే జలుబు చేయడం, జ్వరం రావడం, టీబీ సోకడం, విరేచనాలు కావడం జరుగుతుంది. ఫలితంగా మృత్యువు చేరువవుతుంది. అంటే రోగనిరోధక వ్యవస్థ బలహీనపడితే వ్యాధులు వచ్చిపడతాయి. బలంగా ఉంటే హెచ్ఐవి ఏమీ చేయలేదు. సరిగ్గా హోమియో చికిత్స రోగనిరోధక వ్యవస్థను శక్తివంతం చేయడం పైనే దృష్టి పెడుతుంది.

**లక్షణాలు :** హెచ్ఐవి శరీరంలోకి ప్రవేశించగానే ఎటువంటి మార్పులు కనిపించవు. కొన్ని సంవత్సరాల తరువాత అంటే సీడీ 4 కణాల సంఖ్య తగ్గిపోయిన తరువాత వ్యాధి లక్షణాలు కనిపిస్తాయి. కొందరిలో ఐదారేళ్లకే సీడీ 4 కణాలు బాగా తగ్గిపోయి ఇన్‌ఫెక్షన్లు మొదలవుతాయి. మరికొందరిలో పదేళ్లు పడుతుంది.

**హోమియో చికిత్స :** హోమియో మందుల వల్ల రోగనిరోధకవ్యవస్థ తిరిగి బలపడుతుంది. సీడీ 4 కణాల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది. అవకాశవాద ఇన్‌ఫెక్షన్లకు చోటు లేకుండా పోతుంది. ఆకలి బాగా పెరగడంతో బరువు పెరగడం ప్రారంభిస్తారు. హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా అందరిలాగే సాధారణ జీవితం గడిపే అవకాశం లభిస్తుంది. హోమియో మందులు సక్రమంగా తీసుకుంటే

## హెపటైటిస్ పీడ ఇలా వదిలింది

**నా పేరు భాను.** నా వయస్సు 35 సంవత్సరాలు. ప్రభుత్వ ఉద్యోగం. మంచి జీతం, లైఫ్ హ్యాపీగా ఉంది అనుకుంటున్న సమయంలో అకస్మాత్తుగా ఒక సమస్య మొదలయ్యింది. మరికొన్ని రోజులు అలస్యమైతే ప్రాణాలు కూడా పోయేవి. ఇంతకీ నా అనారోగ్య లక్షణాలు ఎలా మొదలయ్యాయంటే... ప్రారంభంలో నీరసంగా ఉండటం, ఆకలి లేకపోవడం, ఆకలిగా అనిపించినా తినాలని అనిపించకపోయేది. తింటే వాంతులు అయ్యేవి. కొన్ని రోజులకు కడుపు నొప్పి కూడా మొదలయింది. డాక్టర్‌కు చూపిస్తే పరీక్షలన్నీ చేసి హెపటైటిస్ వైరస్ సోకిందని చెప్పారు. ఫ్యాటీలివర్ సమస్య కూడా ఉందన్నారు. దాంతో నాకు ఒక్కసారిగా పాతాళంలో కూరుకుపోయినట్టిగా అనిపించింది. కాలేయ వ్యాధులతో చనిపోతున్న వారి వార్తలు రోజు వింటూనే ఉన్నాను. ఆ సమయంలోనే తెలిసిన మిత్రుడు ఒకడు హోమియో చికిత్స గురించి చెప్పాడు. దాంతో ఆగమేఘాల పరిగెత్తుకుంటూ డాక్టర్ రవికిరణ్ గారి దగ్గరకు వెళ్లాను.

**చికిత్స తరువాత**

హోమియో మందులతో త్వరగా కోలుకుంటావని, ఏమాత్రం భయపడాల్సిన అవసరం లేదని డాక్టర్ గారు ధైర్యం చెప్పారు. హోమియో చికిత్స మొదలు పెట్టాక వారం రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. వికారం తగ్గింది. ఆకలి పెరిగింది. నెల రోజుల తరువాత చాలా మార్పు కనిపించింది. వైరల్ లోడ్ పరీక్ష చేయిస్తే అతి తక్కువ స్థాయిలో ఉన్నట్లుగా తేలింది. ఫ్యాటీలివర్ పూర్తిగా తగ్గిపోయింది. జీవితం ముగిసిందన్న దశలో హోమియో చికిత్స ప్రాణాలు నిలిపింది. ప్రస్తుతం యథావిధిగా జాబ్‌కు వెళుతున్నాను. నాకు కొత్త జీవితం ప్రసాదించినందుకు డాక్టర్‌గారికి మనస్పూర్తిగా కృతజ్ఞతలు.

ADVT



# వింతవింత వివాహాలు

**ప్రతి ఒక్కరి జీవితంలో వివాహం ఒక మధురమైన ఘట్టం. కుటుంబ సభ్యులు, బంధుమిత్రులు అంతా ఒకచోటచేరి ఆనందోత్సాహాల మధ్య జరుపుకునే ఓ వేడుక. వారందరి నడుమ కలకాలం కలిసి ఉంటామనీ, నిన్ను ఎప్పటికీ వీడననీ వధువు చేతిలో చేయి వేసి వరుడు చేసే ప్రమాణమే పెళ్ళి. ఈ వేడుకతో ఆ ఇరువురి జీవితంలో కొత్తమలుపు ప్రారంభమవుతుంది. ఇలా జరిగే పెళ్ళి వేడుకలో ఎన్నో సంప్రదాయాలు, పద్ధతులు ఉన్నాయి. ఈ పెళ్ళి పద్ధతులు ప్రాంతాన్నిబట్టి, ఆచారాన్నిబట్టి, మతాన్నిబట్టి మారుతూ ఉంటాయి. ఈ పద్ధతుల్లో కొన్ని ఎంతో ఆలోచన, నిగూఢార్థం కలిగించేలా ఉంటే మరికొన్ని నవ్వు రప్పించేలా ఉంటాయి. పద్ధతులేవైతేనేం వధూవరులిద్దరినీ ఒక్కటి చేసేలా ఉంటాయి కాబట్టి వాటిని ఆస్వాదించడంలో తప్పులేదు. మరి ప్రపంచ వ్యాప్తంగా పెళ్ళి వేడుకల్లో కనిపించే కొన్ని ప్రత్యేకమైన వివాహ పద్ధతులేంటో మీరూ తెలుసుకోండి!**

## పావురాల్ని ఎగరేస్తారు

శాంతికి చిహ్నం పావురం. ఫిలిప్పీన్స్‌లో జరిగే పెళ్ళి వేడుకల్లో పావురాలను వదలడం అక్కడ ముఖ్యమైన ఘట్టం. పెళ్ళితంతు పూర్తయిన తర్వాత వధూవరులిద్దరూ కలిసి రెండు తెల్లపావురాలను గాల్లోకి వదులుతారు. బంధువులంతా అవి ఎగిరిపోవడం చూస్తుంటారు. కొత్తజంట ఆనందంగా ప్రారంభించే స్వేచ్ఛా జీవితానికి ప్రతీకగా భావిస్తారీ తంతును. శాంతంగా ఉంటూ కాపురం చక్కదిద్దుకోవాలనేది అందులోని నిగూఢార్థం.

## చీపురుకట్టపై నుంచి దూకుతారు!

ఇల్లు ఊడవడానికి చీపురు ఉపయోగిస్తాం. చీపురును లక్ష్మీదేవికి సంకేతంగా భావిస్తారు కొందరు. వివాహ వేడుకల్లో కొన్ని అందంగా ఉంటే మరికొన్ని నవ్వు తెప్పించే విధంగా వింతగా అనిపిస్తాయి. అమెరికాలో ఉండే ఆఫ్రికన్ అమెరికన్స్ పాటించే ఓ పద్ధతి కూడా ఇలాగే నవ్వు రప్పిస్తుంది. పెళ్ళితంతు పూర్తవగానే అక్కడి అమ్మాయి, అబ్బాయి కలిసి చీపురుకట్టమీద నుంచి ముందుకు దూకుతారట. ఇలా చేయడంవల్ల వారు కొత్తింట్లోకి వెళ్ళినట్లు, అధికారికంగా తమ జీవితాన్ని ప్రారంభించినట్లు భావిస్తారు పెద్దలు. అంటే వారి కొత్త జీవితం ప్రారంభమైందనడానికి అదొక సూచనన్నమాట. చాలా ఫన్నీగా ఉంది కదూ ఈ సంప్రదాయం.

## ఉగాది పచ్చడి

మనం కొత్త సంవత్సరాది ఉగాదిరోజున షడ్రుచులు కలిసిన ఉగాది పచ్చడి తప్పనిసరిగా తింటాం. ఉగాదిపచ్చడిలోని రుచులవలె మన జీవితంలో కూడా అలాంటి అనుభవాలు ఉంటాయన్నది అందులోని భావన. సరిగ్గా అలాంటి పద్ధతే నైజీరియాలో ఉంది. అయితే ఇది మనలా సంవత్సరానికోసారి కాదు. కేవలం పెళ్ళి సమయంలో పెళ్ళి కొడుకు పెళ్ళి కూతురికి షడ్రుచులతో తయారుచేసిన పానీయం అందిస్తారు. అయితే ఆరు రుచులకు బదులుగా అందులో నాలుగు రుచులైన తీపి, పులుపు, చేదు, కారం మాత్రమే చేరుస్తారు. మనం భావించినట్లుగానే జీవితంలో ఎదురయ్యే వివిధ రకాల అనుభవాలకు సంఘటనలకు వీటిని సింబాలిక్‌గా భావిస్తారు వారు. తీపి సంతోషానికి, చేదు దుఃఖానికి, కారం కోపానికి, పులుపు ఆశ్చర్యానికి చిహ్నాలు. జీవితంలో ఎలాంటి పరిస్థితి ఎదురైనా అన్నిటినీ ఒకేలా తీసుకోవాలన్న అర్థంతో పెళ్ళికాగానే వీటిని వధూవరులకు అందిస్తారు.

## మూడుగ్లాసుల్లో

పెళ్ళయిన తర్వాత పార్టీ పేరుతో వైన్ పుచ్చుకోవడం తెలిసిందే. అయితే అది ఆహ్వానితులు మాత్రమే తాగుతారు. కానీ జపాన్‌లో పెళ్ళయ్యాక వధూవరులిద్దరూ కలిసి మూడు గ్లాసుల్లో పోసిన వైన్ కొద్దికొద్దిగా తాగుతారు. ఇందులో ఒకటి అమ్మాయి తరపు కుటుంబం, ఇంకొకటి అబ్బాయి తరపు కుటుంబం తాగితే, మూడోది కొత్త పెళ్ళి కొడుకు, పెళ్ళి కూతురు సగం సగం తాగుతారన్న మాట. రెండు కుటుంబాలు ఒక్కటయ్యాయని చెప్పడానికి అక్కడ ఈ పద్ధతి అమల్లోకి వచ్చింది.

## సెల్‌ఫోన్‌తో పెళ్ళి

సెల్‌ఫోన్ లేనిది క్షణమైనా గడవని కాలం ఇది. స్మార్ట్‌ఫోన్ యుగంలో అంతా స్మార్ట్‌గానే ఆలోచిస్తున్నట్లున్నారు. అన్ని పనులూ నిమిషాల్లో జరిపించడానికి అరచేతిలో ఇమిడిపోయే సెల్‌ఫోన్ ఉండగా భార్యతో అవసరం ఏముందనుకున్నాడో ఏమో అతగాడు. ఏకంగా సెల్‌ఫోన్‌నే వివాహమాడాడు. పోయి, పోయి స్మార్ట్‌ఫోన్‌ను పెళ్ళి చేసుకోవడం ఏమిటని విస్తుపోతున్నారా? అవునండీ అమెరికాలోని లాస్‌ఏంజిల్స్‌కు చెందిన ఆరన్ చెర్వెనార్ ఏరికోరి మరీ తన మొబైల్ ఫోన్‌ను పెళ్ళి చేసుకున్నాడు. ఈ పెళ్ళితంతు మధురానుభూతిగా మిగిలిపోవాలని అతడు లాస్‌ఏంజిల్స్ నుంచి లాస్ వెగాస్ వచ్చి అక్కడ సంప్రదాయబద్ధంగా స్మార్ట్‌ఫోన్‌ను జీవిత భాగస్వామిగా చేసుకున్నాడు.



వరుడు ఆరన్ చక్కగా బ్లాక్‌సూటు, కోటు వేసుకుని పెళ్ళికొడుకులా ముస్తాబయ్యాడు. వధువు కూడా చక్కని కవర్‌లో ఒదిగి ఉంది. ఇద్దరు ఎదురెదురుగా ఉండగా పెళ్ళి పెద్ద మైఖేల్ కెల్లీ.. ఇద్దరితో ప్రమాణాలు చేయించాడు. ఆరన్ అనబడే నువ్వు ఈ స్మార్ట్‌ఫోన్‌ను చట్టబద్ధంగా వివాహం చేసుకునేందుకు సమ్మతిస్తున్నావా? ఈ స్మార్ట్‌ఫోన్‌ను ప్రేమిస్తూ.. గౌరవిస్తూ.. విశ్వసనీయంగా ఉంటూ.. సుఖంగా చూసుకుంటానని దైవసాక్షిగా వాగ్దానం చేస్తున్నావా? అని ఆరన్‌ని అడిగాడు. అందుకు ఆరన్ సమ్మతించడంతో అంగరంగ వైభవంగా స్మార్ట్‌ఫోన్‌తో అతని పెళ్ళి జరిగింది.

### చెట్టుతోపాటే

చెట్టు ప్రగతికి మెట్టు అనే నినాదంతో పర్యావరణ ప్రేమికులు ఈమధ్య మొక్కలు నాటే కార్యక్రమం మొదలుపెడుతున్నారు. మన దగ్గర రాజస్థాన్, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రాల్లో కొన్నిచోట్ల అమ్మాయి పుట్టినా, రజస్వల అయినా చెట్లు నాటే పద్ధతి ఉంది. అయితే పెళ్ళి రోజు మొక్కలు నాటే పద్ధతి మాత్రం చెక్‌రిపబ్లిక్‌లోనే కనిపిస్తుంది. వధువు ఇంట్లో వధూవరులిద్దరూ కలిసి ఒక మొక్క నాటుతారు. ఆ మొక్క ఆమె ఆనందకరమైన జీవనానికి ప్రతీక అన్నమాట. ఆ చెట్టు ఎంతకాలం ఆరోగ్యంగా పెరుగుతుందో ఆమె వివాహబంధం అంతకాలం దృఢంగా ఉంటుందని అక్కడివారు నమ్ముతారు. పర్యావరణ క్షేమంకోరి పెట్టిన ఈపద్ధతేదో బాగుంది కదూ!

### అద్దం పగలగొడతారు

అద్దం పగిలితే అపశకునం అని మనదేశంలో చాలాచోట్ల భావిస్తుంటారు. కానీ అదో శుభశకునంలా భావిస్తారు కొందరు. అజాగ్రత్తగా పగిలినా అయ్యో అంటూ వాపోతుంటారు మనవారు. కానీ ఇటలీ వాసులు కేవలం అజాగ్రత్తవల్ల కాదు. కావాలనే అద్దం పగలగొడతారు. పెళ్ళిలో ప్రత్యేకంగా నిర్వహించే కార్యక్రమంలో భాగంగా వధూవరులు ఉద్దేశపూర్వకంగానే అద్దం పగలగొడతారు. ఆపై బంధువులు ఆ అద్దం ఎన్ని ముక్కలైందో లెక్కబెడుతూ తమ ఆనందం పంచుకుంటారు. ఎందుకంటే ఆ అద్దం ఎన్ని ముక్కలవుతుందో అన్ని సంవత్సరాలపాటు ఈ జంట ఆనందంగా తమ జీవనం కొనసాగిస్తుందని వారి నమ్మకం, అందుకే అద్దం పగిలిన ముక్కల్ని లెక్కబెడుతూ సంఖ్య పెరిగినకొద్దీ ఆనందోత్సాహాలతో నృత్యం చేస్తుంటారు. మనకు చెడు అయితే అక్కడివాళ్ళకు అది మంచి అన్నమాట.

### వెడ్డింగ్ బెల్స్

వెడ్డింగ్ బెల్స్ మనదగ్గర కూడా ఇప్పుడు కొన్ని వివాహాల్లో ఇస్తున్నారు. ఐర్లాండ్ దేశంలో ఎవరికైనా పెళ్ళైతే తప్పకుండా వచ్చే బహుమతుల్లో వెడ్డింగ్ బెల్స్ ఒకటి. వధూవరులు తాము ఉండబోయే ఇంట్లో ఈ వెడ్డింగ్‌బెల్స్‌ను ఓచోట వేలాడదీస్తారు. వారిద్దరి మధ్య గొడవైన ప్రతీసారి ఈ బెల్స్ మోగించాల్సి ఉంటుంది. ఈ బెల్స్ శాంతికి చిహ్నంగా భావిస్తారు అక్కడి వారు. అందుకే ఈపద్ధతివల్ల గొడవలు తగ్గుతాయని అక్కడి వారి నమ్మకం. అయితే మాటిమాటికీ బెల్స్ మోగించడంకంటే కాస్త సర్దుకుపోయి గొడవలు తగ్గించుకోవడం మంచిదని జంటలు భావించాలనేది దీని వెనుకున్న అసలు అంతరార్థం కాబోలు. ఏదైనా ఈ పద్ధతేదో బాగుంది కదండీ. ఎప్పుడూ గొడవపడే దంపతులు ఈ వెడ్డింగ్‌బెల్స్ తెచ్చుకుంటే సరి!

### కర్రలు కోయాలి

ఆలుమగలు కలిసి చేసుకుంటేనే ఏదైనా సరే చక్కగా పొందికగా ఉంటుంది. ఈ విషయాన్ని అక్కడివారు తెలుసుకున్నారేమో ఓ వెరైటీ ఆచారాన్ని పెళ్ళిలో ప్రవేశపెట్టారు. జర్మనీలో ఓతెగలో జరిగే పెళ్ళివేడుకల్లో భార్యాభర్తలిద్దరూ కలిసి పెళ్ళికి వచ్చిన అతిథులందరి ముందూ ఓ పెద్ద కర్రను రంపంతో కోయాలి. ఈ పద్ధతి వల్ల వారిరువురి జీవితంలో ఏవైనా సమస్యలు వస్తే కలిసి పరిష్కరించుకోవాలన్న అర్థం దాగి ఉంది.

**– విజేత దహగాం**

## శ్మశానంలో అంగరంగ వైభవంగా

ప్రపంచంలో ఎంతోమంది వివాహమహోత్సవాన్ని విభిన్నంగా నిర్వహించి ఎన్నో రకాలుగా వార్తల్లో నిలిచారు కానీ, మరీ ఇంతలా వింతైన పద్ధతిలో వివాహం చేసుకున్నది ఈ జంటేనని చెప్పొచ్చు. మహారాష్ట్రలోని జాల్నా జిల్లా పరతూర్‌లో ఈ విచిత్ర వివాహ వేడుక జరిగింది. అంత్యక్రియలకు వేదికైన శ్మశానంలో ఒక జంట నూతన జీవితం ప్రారంభించింది. విషాద ఘట్టానికి వేదిక అయిన శ్మశానంలో ఈ శుభకార్యం జరగడానికి ప్రత్యేకమైన కారణం కూడా ఉంది. ఈ వివాహంలో పెళ్ళికూతురు తండ్రి సుభాష్ గైక్వాడ్ కాటి కాపరి. సమాధుల సాక్షిగా తన కూతురి వివాహం ఆ శ్మశానంలోనే చేయించాలనుకున్నాడు గైక్వాడ్. ఈ ఆలోచనకు ఆయన కూతురు మంజుశ్రీ కూడా సమ్మతం తెలిపింది. వరుడు, అతడి కుటుంబం కూడా అంగీకరించడంతో శ్మశానంలో భజంత్రీలు మోగాయి. శవాలుండే ప్రదేశంలోనే పెళ్ళివేదిక ఏర్పాటు చేశారు. ఈ పెళ్ళికి ఊరందరినీ ఆహ్వానించారు. మొదట ఆశ్చర్యపోయారంతా.. అయితే చివరకు అంతా వచ్చారు. విషాద వాతావరణానికి మాత్రమే వేదిక అయిన శ్మశానానికి ఈ విధంగా పెళ్ళికళ వచ్చింది. వధూవరులను ఆశీర్వదించి, శుభాకాంక్షలు తెలిపి వెళ్ళారంతా.









# ఎవరు దేవుడు

జి యెస్ లక్ష్మణ్



ఇంటిపన్నులు కట్టించుకునే శివన్నారాయణ సైకిలుమీద వచ్చేవాడు. సన్నగా పొడుగ్గా రివటలాగా ఉండేవాడు. నొక్కుకుపోయిన రబ్బరుబొమ్మ ముఖం, జుత్తుకి ఒత్తుగా నూనె రాసుకుని పైకి దువ్వుకునేవాడు. ఎందుకో నాకు అతన్ని చూడాలనిపించేది. నిజాయితీగా, గట్టిగా మాట్లాడేవాడు. కుండబద్దలు కొట్టేవాడు. అందరిదగ్గరా అతడికి ఆ పేరుంది.

మా ఇల్లు నాలుగురోడ్ల కూడలిలో ఉంది. మా ఇంటిదగ్గర సైకిలు ఆపి ఇంటిపన్నులు వసూలు చేసుకుని వెళ్ళేవాడు.

“టైము దాటకుండా, నెలలకు నెలలు గడపకుండా కచ్చితంగా ఇంటిపన్ను కట్టేది నారాయణమ్మ ఒక్కత్తే” అని మా అమ్మకి కితాబు ఇచ్చేవాడు. ప్రతిగా మా అమ్మ ఓ నవ్వు నవ్వి, ‘కట్టుకుంటే మాకే భారం తగ్గిపోతుంది కదా” అనేది.

“అందరూ అలా ఆలోచించరమ్మా” అంటూ రశీదు రాసేవాడు శివన్నారాయణ. ఏభై సంవత్సరాలకింద పన్నులు కదా. ఐదు, పదుల్లోనే ఉండేవి. అవి కట్టడమే గగనమైపోయేది. నవ్వుతూ మాట్లాడేవాడు శివన్నారాయణ. నన్నుచూసి పలకరించేవాడు.

“ఏరా ఏం చదువుతున్నావు?” అని.

“రెండో క్లాసు” టక్కున సమాధానం చెప్పాను.

“మీ నాన్న, నేను స్నేహితులం. నీకు తెలుసా?” కళ్ళెగరేస్తూ చెప్పాడు శివన్నారాయణ.

‘వాడికేం తెలుసు నారాయణా” అమ్మ అంది.

“అవును. వాడికేం తెలుసు. ఏదో మాటల్లో అన్నాను. అయితే మీ నాన్నగురించి నీకు ముఖ్యమైన విషయం చెప్పాలిరా” అన్నాడు శివన్నారాయణ.

నేను “చెప్పు, చెప్పొద్దు” అనలేదు. ఏం చెబుతాడో వింటున్నాను. కళ్ళద్దాలు తీసి మడిచి జేబులో పెట్టుకుని, దీర్ఘంగా నిట్టూర్చి “మీ నాన్న గురించి మీ అమ్మకి కూడా తెలియదురా. చాలా కష్టపడి ఈ రోజు గవర్నమెంటు ఉద్యోగంలోకి వచ్చాడు. తోటలో మొక్కలకి రోజూ రెండుపూట్ల నీళ్ళు పోసేవాడు. కర్రలు కొట్టేవాడు. పొద్దున్న ఐదుగంటలనుంచి రాత్రి పది గంటలదాకా పనిచేసేవాడు. ఆ పని ఈ పని అని లేదు. అన్ని పనులూ చేసేవాడు. వకీలు శంకరం పంతులుగారింట్లో పదిసంవత్సరాలు పనిచేశాడు. కోర్టుకి ఫైళ్లు పట్టుకుని గుర్రబ్బండి వెనక పరుగు తీసేవాడు. వకీలు కూడా ధర్మాత్ముడు. బాగా చూసుకునేవాడు. మీ నాన్నది పెద్ద కుటుంబం. ఇప్పుడంటే ఎవరూలేరు. మీ అత్తలకి పెళ్ళిళ్ళు చేశాడు. మీ చిన్నాన్నకి ఉద్యోగం వేయించాడు. అమ్మలేదు. నాన్న రోగిష్టి... చాలా కష్టపడ్డాడు” ఇంకా ఏదో చెప్పబోతుంటే మా పక్కింటి డబ్బాడ

## నవ్యవీక్లి-ఉపాధ్యాయుల భాస్కరరావు స్మృతి సాహితి కథల పోటీలో విశేష బహుమతి రూ.5,000 పొందిన కథ

సుబ్బన్న డబ్బులు పట్టుకుని వచ్చాడు. ఇంటిపన్ను కట్టడానికి. “రావోయి ప్రవీ! రా రా. ఇన్నాళ్ళకి తీరికయిందా? నీదెంత బకాయి ఉందో తెలుసా” అంటూ సుబ్బన్న చేతిలో నోట్లు లాక్కున్నాడు శివన్నారాయణ.

“ఎలా కట్టమంటారండీ? జూట్‌మిల్లు లాకౌట్‌లో పెట్టేశారు. ఉద్యోగంలేదు. జీతంలేదు. పైసా రాబడిలేదు. ఇల్లు గడవడంలేదు. ఆ ఇల్లు మాత్రం ఉంది. మా తాతలనాటిది. మున్సిపాలిటీ వాళ్ళు మాదని తేల్చేరు కాబట్టి ఇప్పుడు దానికి పన్నుకట్టకపోతే మాదికాదని మీరు గొడవెడతారు” అన్నాడు విసురుగా డబ్బాడ సుబ్బన్న.

“అంటే ఇల్లు నీదనిపించుకోడానికి పన్ను కడతన్నావన్నమాట” అన్నాడు శివన్నారాయణ రశీదు రాస్తూ.

“అంతేగదా” అన్నాడు డబ్బాడ సుబ్బన్న. ఆ మాటల్లో పడి మా నాన్నగురించి చెప్పడం మర్చిపోయాడు శివన్నారాయణ. అయినా వచ్చినప్పుడల్లా మా నాన్నగురించి ఏదో ఒక విషయం చెబుతూనే ఉండేవాడు. ఒకసారి మా నాన్నని నిజాయితీపరుడు అని చెప్పాడు. ఎందుకు నిజాయితీపరుడో, ఎలా నిజాయితీపరుడయ్యాడో నాకు తెలుసుకోవాలని ఉంది. ఇంతలో మళ్ళీ సుబ్బన్న వచ్చాడు.

“ఈ ఇల్లు తీసేత్తారటండీ. మేం ఎక్కడుండాలి” అని బాంబుపేల్చాడు.

“అలాగ నీకెవరు చెప్పారు?” బుర్ర గోక్కుంటూ అన్నాడు శివన్నారాయణ.

“ఎవరో అంటున్నారు”.

“పోయి వాళ్ళనే అడుగు”.

“అలాక్కాదు. నిజం చెప్పండి?” అన్నాడు సుబ్బన్న.

“ఓయి పులేషం. ను వ్వ వేషాలు వేస్తావుగానీ పులికి ఉన్న బుర్ర నీకు లేదు. పక్కాగా ఇంటి పన్ను కడతన్నావు. నీ ఇల్లు ఎవడు పీకేస్తాడు? నీది పీకితే అందరివీ పీకెయ్యాలి. నారాయణమూర్తిది కూడా పీకెయ్యాలి” అన్నాడు శివన్నారాయణ.

నారాయణమూర్తి అంటే మా నాన్న.

“నారాయణమూర్తికి శంకరం వకీలు దన్నుంది. నన్నెవడు పట్టించుకుంటాడు” అన్నాడు సుబ్బన్న.

“నారాయణమూర్తి అలాంటోడు కాదు. అందరి గురించి ఆలోచిస్తాడు. నువ్వేం చింతపడకు. నారాయణమూర్తి ఇక్కడున్నంతవరకు, నువ్వు ఇంటిపన్ను సరిగ్గా కడుతున్నంతవరకు నీ ఇంటిమీద ఎవరూ చెయ్యి వెయ్యడానికి వీల్లేదు. నాది భరోసా. వెళ్ళు” అని శివన్నారాయణ ధైర్యం చెప్పాడు. సుబ్బన్న వెళ్ళిపోయాడు.

వకీలు శంకరంపంతులు సాయంతో కోర్టులో కేసువేసి, దావాలు మీద దావాలు నడిపించి చివరికి గెలిచి అందరి ఇళ్ళూ నిలబెట్టాడు మా నాన్న. అందుకే నారాయణమూర్తి అందరికీ దేవుడయ్యాడు. ఆ సంతోషంలో అమ్మవారి పండక్కి డబ్బాడ సుబ్బన్న పులివేషం వేశాడు. ఒకటే గంతులు! సుక్క ఏశాడేమో పులిలాగ రెచ్చిపోయాడు. ఆ మరుసటిరోజు సుబ్బన్న పెళ్ళాం చెవిటి సత్తమ్మ ఒకటే తిట్లు. అక్కడనుంచి సుబ్బన్న పండగొస్తే పులి లేదంటే పిల్లి. ఈ సంగతి ఇలా ఉంచితే మా నాన్నని నిజాయితీపరుడని చాలాసార్లు శివన్నారాయణ అంటుంటాడు కదా. ఎలా మా నాన్న నిజాయితీపరుడు అని నాకో సందేహం. శివన్నారాయణ కొన్నాళ్ళ తర్వాత ఆ సందేహం తీర్చాడు.

“ఒకరోజు మీ నాన్న పద్మశ్రీటాకీసు నుంచి నడుచుకుంటూ వస్తున్నాడు. కుసుమహరనాథ్ సెంటర్‌కి ఎదురుగా కళింబిల్లోలు నుయ్యి పక్కన ఒక పర్సు కనిపించింది రోడ్డుమీద. ఇటూ అటూ చూశాడు. ఎవరూలేరు. పర్సులోచూస్తే కొత్త రూపాయలనోట్లు. లోపల ఏవో కాగితాలున్నాయి.

‘అయ్యో ఎవరో పర్సు పోగొట్టుకున్నారు’ అనుకున్నాడు. చేత్తో పట్టుకుని కోర్టువైపు నడుస్తున్నాడు. మంగరాజు చెప్పులకొట్టు దాటిన తరువాత ఒక వ్యక్తి ‘అయ్యో నా పర్సు పోయింది. ఈనెల నా జీతం పోయింది. ఎలా నా కుటుంబానికి ఎలా? అంటూ బాధపడుతూ కళ్ళనీళ్ళు తిప్పుకుంటున్నాడు. చుట్టూ జనం మూగారు. మీ నాన్న పర్సు పట్టుకుని అక్కడకు వెళ్ళి “ఈ పర్సు మీదేనా?” అనడిగి అతడికి ఇచ్చాడు. గబగబా అతడు ఆ పర్సు చూసి ఆశ్చర్యపోతూ, కళ్ళు తుడుచుకుంటూ “నాదే నాదే” అంటూ లోపల డబ్బు చూసుకున్నాడు. సరిగ్గా ఉంది. కాగితాలూ ఉన్నాయి. అప్పుడు మీ నాన్నని చూశాడు. ‘థాంక్స్ బాబు. నా కుటుంబాన్ని కాపాడావు. ఎవరు బాబు నువ్వు” అని వివరాలడిగాడు. అప్పటికి మీ నాన్న పరిస్థితి ఏమిటంటే తినడానికి రూపాయి లేదు. ఉద్యోగంలేదు. ఎక్కడో ఏదో ఒక పనిచేసి వస్తేగానీ ఇల్లు గడవదు. అటువంటిస్థితిలో పర్సు ఆయనకి ఇచ్చేశాడు. ఆ వ్యక్తి కోర్టులో పెద్ద గుమస్తాగా పని చేస్తున్నాడు.

“ఇదిగో ఈ ఐదు ఉంచు” అని మీ నాన్నకి ఆ గుమస్తా ఇవ్వబోతే, “వద్దు సార్” అని ఇంటికి వచ్చేశాడు. అటువంటి నిజాయితీపరుడు మీనాన్న అని అప్పటికి ముగించాడు శివన్నారాయణ.

దీపావళికి ఎవరో సిసింద్రీ విసిరేస్తే అదివెళ్ళి ఓ పూరిగుడిసెమీద పడింది. దాంతో చెరువు వీధిలో ఇళ్లన్నీ కాలిపోయాయి. కంచి చిన్నాన్నా, మాలక్ష్మి పిన్ని, పెడమ్మత్త, నాగన్న మామయ్య అందరూ గోడు గోడు పెట్టుకుని మా ఇంటివైపు వచ్చారు. అందరూ మా ఇంటి దగ్గర గుమిగూడారు. ఆ విషయం తెలిసి పరుగున సైకిలుమీద వచ్చాడు శివన్నారాయణ. మంటలార్పడానికి గంటల్లారీ వచ్చింది. ఆ రోజంతా శివన్నారాయణ మా ఇంటిదగ్గరే ఉన్నాడు. సాయంత్రానికి మా ప్రాంతమంతా ఓ విషాదం అలుముకుంది. శివన్నారాయణ ఇంటికి బయల్దేరాడు. వెళ్తూ వెళ్తూ “ఏరా మీ నాన్న చెక్ పోస్టు డ్యూటీనుంచి ఎన్నాళ్ళకి వస్తాడురా” అనడిగాడు.



‘నెలకొకసారి నారాయణా’ అని అమ్మ చెప్పింది.

‘అంతేలే. రోడ్డుమీద డ్యూటీ కదా. ఎప్పుడూ మీ నాన్నకి కష్టం తప్పలే. అయితే గవర్నమెంటు ఉద్యోగం. తలమ్మెకున్నాక తప్పదు గదా” అని ఎక్కువ మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

***

ఆ రాత్రి అమ్మని అడిగాను.

‘మనం పెంకుటిల్లు కట్టుకుంటే బాగుంటుంది కదమ్మా” అని

‘అంత డబ్బు మనకెక్కడిదిరా” అంది అమ్మ మంచంమీద దుప్పటి పరుస్తూ.

“దీపావళివస్తే ఇళ్లు కాలిపోతాయి. వేసవికాలంలో ఇళ్లు కాలిపోతాయి. ఎప్పుడూ భయం భయంగా గడ పాలి”.

“తప్పదు నాయినా. ఏదో ఇప్పటికి మీ నాన్న మంచితనం వలన మనం ఇలా బతుకుతున్నాం. ఆరోజు మీ నాన్న శంకరం వకీలుగారి ఇంట్లో గొలుసు దొరికితే ఇచ్చేశారు. దానికి మీ నాన్నని మెచ్చుకుని ఉద్యోగం వేయించారు. గవర్నమెంటు ఉద్యోగం. దేవుడు మనకి సాయం చేశాడు. మీ నాన్న నిజా యితీ మనల్ని రక్షిస్తోంది” అంది అమ్మ మంచం మీద పడుకుంటూ.

“శంకరం గారి గొలుసా?” నాకర్థం కాలేదు. అందుకే అడిగాను.

“అదేరా మీ నాన్న శంకరంవకీలుగారింట్లో పని చేసినప్పుడు వాళ్ళమ్మాయి చిన్నప్పుడు తోటలో గొలుసు పారేసుకుంది. ఐదు సంవత్సరాల తరువాత ఆ గొలుసు మీ నాన్నకి దొరికింది తోటపని చేస్తుంటే. వెంటనే పట్టుకెళ్ళి ఐదేళ్ళ క్రితం వాళ్ళమ్మాయి గొలుసు పారేసుకున్న విషయం గుర్తు చేసి, గొలుసు ఇచ్చేశారు. మూడుతులాల గొలుసు. శంకరం పంతులు గారు మీ నాన్నని మెచ్చుకుని పది వెండిరూపాయ లిచ్చి, ఆయన చనిపోయేముందు నాన్నకి ఉద్యోగం ఇప్పించారు. అదీ మీ నాన్న నిజాయితీ. శివన్నారా యణ మీ నాన్నకు బాగా స్నేహితుడు. అందుకే మీ నాన్నగురించి నారాయణకే బాగా తెలుసు” అని ఇంకా అమ్మ ఏదో చెబుతుండగానే నాన్నరూపం మనసులోకి తెచ్చుకుని “నాన్న ఎప్పుడొస్తారమ్మా” అనడిగాను.

“వచ్చే ఆదివారం” అంది అమ్మ సంతోషంగా.

“వచ్చినప్పుడు నాకు బాల్ పెన్ను తెమ్మన్నాను. తెస్తారుకదా” అంటూ రంగురంగుల పెన్నులు ఊహించుకుంటూ నిద్రలోకి జారిపోయాను.

***

బాల్యస్మృతులు... జీవితంలో ఎన్నో మార్పులు.

ఒకరోజు అర్థరాత్రి. మొబైల్‌ఫోను మోగుతుంటే ఆన్ చేసి విన్నాను. అవతలనుంచి అమ్మ గొంతు. ఏడు స్తోంది... చెప్పలేకపోతోంది.. మా బావగారు క్రిష్ణ చెప్పాడు. “మావయ్య ఇప్పుడే చనిపోయారు. వెంటనే రండి” అని బాధపడుతూ. నేను గడ్డకట్టుకుపోయాను. నాకు కొన్ని క్షణాలు మాట రాలేదు. తరువాత ఎలా మాట్లాడానో, ఏం మాట్లాడానో కూడా నాకు తెలి యదు. వెంటనే కార్లో బయల్దేరాను.

నాన్నగారి జ్ఞాపకాలు.. రాత్రి చీకట్లో ప్రయాణం.... ఒంటరితనం. అమ్మ ఎలా ఉందో... మనసులోబాధ.. ఆ మరుసటిరోజు సాయంత్రం మూడుగంటలకు పార్వతీపురం చేరుకున్నాను. హైదరాబాద్ నుంచి నేను వెళ్ళేసరికి, అందరూ నా కోసం ఎదురుచూస్తు న్నారు.

నాన్నగారి అంత్యక్రియలు దగ్గరుండి పెద్దకొడు కుగా పూర్తి చేశాను.

ఎవరూ దగ్గరగాలేని ఒక మూల కూర్చుని నాన్న గారి గురించి ఆలోచిస్తుంటే మా సెక్రటరీ అనంతం ఫోను చేశాడు.

“గురువుగారూ మీకు ‘అనంతశక్తిమూర్తి’ అని బిరుదు ఇద్దామని ఛానల్ త్రీ వాళ్ళు ఫోను చేశారు. ఏం చెప్పమంటారు?” అడిగాడు.

“ఏం చెప్తావు? వస్తున్న బిరుదుని ఎవడైనా కాదం టాడా? గురువుగారు ఓ.కె. అన్నారని చెప్పు” అన్నాను.

“కార్యక్రమం మన పీఠంలో పెట్టించమంటారా? వాళ్ళ ఛానల్‌లో పెట్టించమంటారా?” అడిగాడు అనంతం. ప్రతీది క్లారిటీ ఉండాలని నేను చెబుతుం టాను. అందుకే అలా అడుగుతూ ఉంటాడు.

“మన పీఠంలో పెట్టి వాళ్ళనొచ్చి నిర్వహించుకో మను. మన భక్తులందరికీ తెలిసేటట్లు విపరీతమైన ప్రచారం చేయించు. అందరూ పాల్గొనాలి. పాదపూ జకు పాతిక, దర్శనానికి ఐదుకి తక్కువ కాకుండా ఫిక్స్ చేయించు”.

“అలాగే గురువుగారు. వైజాగ్‌లో సీతమ్మధారలో జరిగే నూటఎనిమిదో యజ్ఞానికి లక్ష రూపాయల చెక్కు ఇమ్మంటారా? క్యాష్ ఇమ్మంటారా? అని మిడ తలసుబ్బారావుగారు అడుగుతున్నారు. ఏం చెప్ప మంటారు?”.

“బుర్ర లేదా? చెక్కు ఎందుకు? ఇన్‌కమ్‌టాక్స్ గొడ వలు. క్యాషే ఇవ్వమని చెప్పు” కోపంగా చెప్పాను.

నాకు వేలల్లో భక్తులున్నారు. స్త్రీలు, పురుషులు కుప్పలుతెప్పలుగా నా యజ్ఞాలకి, హోమాలకి హాజ రవుతారు. నేను పీఠాధిపతిని. నన్ను దేవుడిగా భావి స్తారు. నన్ను నమ్ముకుంటే సమస్యలు పరిష్కారం అవుతాయని వాళ్ళ విశ్వాసం. ఆ విధంగా వాళ్ళు

**కూటికి పేద గానీ గుణంలో దేవుడంత గొప్ప వాడతను. అన్ని రకాలుగానూ కష్టపడేవాడు. చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు చేశాడు. వకీలు వెనక ఫైళ్ళు మోస్తూ తిరిగేవాడు. నిజాయితీయే ఆయనకు శ్రీరామరక్ష. అందుకే ఓ చిన్న ప్రభుత్వ ఉద్యోగం దొరికిందాయనకి. మానవసేవే మాధవసేవగా జీవించాడు. అందరిచేతా దేవుడు అనిపించు కున్నాడు. అతని కొడుకు మాత్రం ఆ బాపతు కాదు. అతని దారి అడ్డదారి...! అడ్డగోలుదారి!**

నన్ను దేవుణ్ణి చేసేశారు. భోగభాగ్యాలు అనుభవిస్తు న్నాను. వారానికి ఓ ఊరు. రోజుకో కార్యక్రమం. నెలలో ఒక ఆలయ ప్రతిష్ఠ. ప్రసంగం. ప్రవచనం. భక్తుల సందోహం. కానుకల వర్షం. అంతా అంగ రంగ వైభోగమే. నా జీవితం నాకు తెలియకుండా ఇలా మారిపోయింది. దేవుడు గురించి తెలుసుకోవా లనే ఆసక్తికంటే జనంలో సమస్యల పరిష్కారం, మాయలు, మంత్రాలు, వీటిపైనే ఉంది. భగవంతుడి మీద నాకున్న శ్రద్ధో, ఈ మార్గమే బాగుందనుకున్న నా ఆలోచనో గానీ నన్ను ఇందులోనే సెటిలయ్యేట్టు చేసింది. అందుకే గురుస్వామి పీఠాధిపతిని అయినా నేను, కన్నతల్లిదండ్రులను, పుట్టిన ఊరును మరచిపోలేను కదా. నా స్వస్థలంలో ఎక్కువగా ఈ విషయాలు తెలియకుండా జాగ్రత్తపడ్డాను. అందరూ నన్ను దేవుడు దేవుడు అనడం, ఆ మాటలు వినడం నాకు బాగుంది. అనంతం మళ్ళీ ఫోన్ చేశాడు.

“గురువుగారూ ఎప్పుడు వైజాగ్ వస్తారు? మన పీఠంలో కలిదోష నివారణ సప్తాహ మహాయజ్ఞం ఎప్పుడు మొదలెడతారని రామయ్యదొరగారు అడుగు తున్నారు” ఆత్రుతగా చెప్పాడు.

“రెండ్రోజుల్లో వస్తానని చెప్పాను కదా. మా తండ్రిగారు కాలం చేశారని చెప్పు. నీకు బుర్ర లేదు. ఈసారి ఆ బ్రహ్మో అడిగినా నాకు ఫోను చెయ్యకు” అంటూ ఫోన్ స్విచాఫ్ చేశాను. అనంతం మరి ఫోను చెయ్యలేదు. చెయ్యలేడు.

నాన్నగారి ఆఫీసువాళ్ళు ఒక సంతాప కార్యక్రమం ఏర్పాటు చేశారు. నేను స్వామిననిగానీ, పీఠాధి పతిననిగానీ తెలియకుండా జాగ్రత్తపడుతూ ఒక సాదాసీదా వ్యక్తిలాగా కార్యక్రమానికి హాజరయ్యాను.

నాన్నగారు ఒక గుమస్తా. ‘ఉద్యోగం స్వచ్ఛంద విరమణ చేసుకుని నా దగ్గరకు వచ్చెయ్యండి’ అని నేను చాలాసార్లు చెప్పాను. ఆయన వినలేదు. చివరి రోజు వరకు పనిచేశారు. వాళ్ళ ఆఫీసు దగ్గర్లోనే ఈ ఫంక్షను ఏర్పాటుచేశారు. సిబ్బంది మొత్తం హాజర య్యారు. కమర్షియల్ టాక్సు ఆఫీసర్‌గారు, ఇతర అధికార్లు, గుమాస్తాలు...అందరూ వచ్చారు. మా కుటుంబం మొత్తాన్ని ఆహ్వానించారు. అందరం వెళ్ళాం.

మొట్టమొదటి ఆఫీసరు రామచంద్రమూర్తిగారు మాట్లాడారు.

“నా జీవితంలో నేను ఇటువంటి ఉద్యోగిని చూడ లేదు. అందులో ఈ కాలంలో. ఒక్క బ్లాకు మార్కు కూడా లేకుండా అందరి మన్ననలుపొంది తనపని తాను చేసుకుని పదవీ విరమణ అయిన మంచి మనిషి. ఇలాంటివారి వల్లే ప్రభుత్వానికి మంచిపేరు వస్తుంది. ఈ బాధాకర సందర్భంలో కీ.శే. నారాయణ మూర్తిగారికి అశ్రునయనాలతో సంతాపం ప్రకటిస్తు న్నాను” అంటూ నాన్నగారి ఫొటోకి పూలదండ



వేశాడు. అందరూ కరతాళధ్వనులు చేశారు. అమ్మకి దుఃఖం పొంగుకొచ్చింది. నా తమ్ముడు, చెల్లెలు, బావలు, మరదలు, వాళ్ళ పిల్లలు అందరూ బాధా తప్త హృదయులయ్యారు.

ఇంకొక ఆఫీసరు చాలా ఉద్వేగంగా మాట్లాడాడు. దాదాపుగా ఏడ్చినంత పనిచేశాడు.

"నారాయణమూర్తి లేకపోతే నా జీవితమే లేదు. ఈరోజు నేను అధికారిగా ఈ స్థానంలో ఉన్నానంటే ఆయన ఇచ్చిన సలహాలు, మార్గదర్శకత్వమే కారణం. నన్ను ఎన్నో ఇరకాట పరిస్థితుల్లోంచి నారాయణ మూర్తి అనుభవంతో నన్ను రక్షించాడు. నా దేవుడు, మిత్రుడు, గురువు నారాయణమూర్తే. ఆయన ఇప్పుడు లేడనే మాట జీర్ణించుకోలేకపోతున్నాను" అంటూ కళ్ళనీళ్ళు తిప్పుకుంటూ నాన్నగారి ఫొటోకి పూల దండవేసి నమస్కరించాడు.

"నారాయణమూర్తి మాకు విష్ణుమూర్తే" అని మరో అధికారి చాలా నిజాయితీగాచెప్పి నాన్నగారి ఫొటోకి నమస్కరించాడు.

అలా ప్రతీఒక్క ఉద్యోగీ చనిపోయిన నాన్నగారిని రకరకాల ప్రశంసలతో ముంచెత్తారు.

మనిషి పోయినా మంచి మిగలడం అంటే ఇదేనేమో. చిట్టచివరికి బాల్యంలో నేను నాన్నగారి గురించి విన్నమాట నిజాయితీపరుడు, దేవుడు! దానిని మరణం వరకు నిలబెట్టుకునే వచ్చారు. మరణం తరువాత కూడా బ్రతుకుతున్నారు.

ఆయన చేసినవన్నీ లౌకికమైన పనులే. లోక హితం, పరహితం కోరుకున్నారు. తోటివారికి, సమా జానికి ఉపయోగపడ్డారు.

రకరకాలుగా నాన్నగారి మంచితనం, ఔదార్యం గురించి అందరూ చెప్తుంటే నా కళ్ళు చెమ్మగిల్లాయి. నాన్నగారి గురించి నాకు తెలుసు. కాని నేను ఏనాడు ఈ విధంగా ఊహించలేదు. ఆయన ఇలా ఇటుక ఇటుక పేర్చుకుంటూ నిజాయితీ అనే ఆలయం కట్టుకుని అందులో దేవుడిగా ఉంటాడని ఊహించలేదు.

దేవుడికి నేనిచ్చే నిర్వచనం వేరు. నా పూజలు, యజ్ఞాలు, హోమాలు, మహిమలు, భక్తులు, పీఠం.... అవే దేవుడనుకునే ఒక భ్రాంతిలో నేను బ్రతుకు తున్నాను. మానవసంబంధాలు, సంఘ శ్రేయస్సు గురించి నేనెప్పుడూ ఆలోచించలేదు. నాన్నగారికి అది సహజం. నాకెక్కడో ములుగు కర్రతో పొడిచినట్ల యింది. అయితే ఆయన చేసినట్లు నేను చెయ్యాలని లేదు కదా. నా మార్గం నాది. ఏది ఏమైనా నాన్న గారి జీవితం నన్ను కదిలించింది.

***

మొబైల్ ఫోను ఆన్ చేస్తే అనంతం చేసిన మిస్సుడు కాల్స్ చాలా ఉన్నాయి. వెంటనే ఫోను చేశాను. నా మాట 'అనంతం' అని వినగానే, "గురువు గారూ ఎప్పుడొస్తున్నారు? ఇక్కడ బోలెడన్ని కార్యక్ర మాలు ఆగిపోయాయి. గుంటూరుశర్మగారు వాళ్ళ ఆధ్యాత్మిక సమితి ద్వారా మీకు స్వర్ణకంకణం తొడుగు తారట. వెంటనే తేదీ చెప్పమన్నారు" టకటక చెప్పాడు. ఏం చెప్పాలో నాకు అర్థం కాలేదు. "నేను అక్కడకు వస్తాను కదా. చెప్తాను. అంతవరకు వేచి ఉండమను" అన్నాను. అలా చెప్పాలనిపించింది.

"సరే. చిన్నపిల్లల గుండె ఆపరేషనుకు సంబం ధించి మన పీఠం తరఫున ఏవైనా చేస్తామని ఓ కార్యక్రమంలో మీరు చెప్పారట. వాళ్ళు ఫోన్ చేశారు" అని చెప్పాడు.

"ఎవరు వాళ్ళు?" అడిగాను గుర్తు తెచ్చుకుంటూ.

"హార్ట్ కేర్ ఫౌండేషన్, కూకట్‌పల్లి హైదరాబాదు వాళ్ళు".

"వాళ్ళా. వాళ్ళకోసం పూజలు చేశాం. అంతకంటే మనమేం చేస్తాం. మీ దగ్గర డబ్బు తీసుకోకుండా గురువు గారు పూజలు చేశారని చెప్పు".

"సరే మీరెప్పుడొస్తున్నారు?"

"వచ్చే ముందు ఫోను చేస్తాను" అని చెప్పి ఫోను కట్ చేశాను.

అలవాటుపడిన నా సంభాషణలు, నేను పనిచేసే విధానం...అందరూ నన్ను దేవుడనుకోవాలనే! మరి నేను దేవుడినా?"

గోదావరిలో నాన్నగారి చితాభస్మం నిమజ్జనం చేసిన తరువాత ఇంటికి వచ్చాం. నేను హైదరాబాద్ బయల్దేరడానికి సిద్ధమవుతుండగా "మీ నాన్నగారు పదవీ విరమణ తరువాత వచ్చిన డబ్బులో కొంత ఖర్చు చేసేశారు" అంది అమ్మ పాస్‌బుక్ నాకు చూపిస్తూ.

"ఖర్చు చేసేశారా?" ఆశ్చర్యంగా అడిగాన్నేను.

"దాని గురించి పిల్లలకు చెప్పొద్దన్నారు" అంది అమ్మ బాధపడుతూ.

"అయితే చెప్పకు" అన్నాను.

"చెప్పకపోతే ఆయన ఎందుకు ఖర్చు చేశారోనని మీరు సందేహపడతారు. చెప్పవలసిన బాధ్యత నా మీద ఉంది".

"ఫర్వాలేదులే అమ్మా! నాన్నగారి గురించి మాకు తెలుసు కదా"

"అయినా చెప్పాలి. చెప్తే మీరు మీ తండ్రి గొప్ప తనం తెలుసుకుంటారు"

"నీ ఇష్టం"

"ఆయన ముందుగానే చెప్పారు తాను మరణించ బోయే విషయం. రాత్రికి ఎవరినైనా తోడు తెచ్చుకో మన్నారు. నేను ఇకముందు తోడు లేకుండా జీవిం చాలి కదా. వెంటనే మీ చెల్లిని, బావని పిలిచాను. వాళ్ళొచ్చారు. కొద్దిసేపట్లో ప్రాణాలు విడిచారు. మంచి మనిషిగా బ్రతకడమే మానవ జీవన పర మార్థం, అలాంటి మంచి మనిషినే అందరూ 'దేవుడు' అని పిలుస్తారని చెప్పారు" అని కళ్ళల్లో నీరు తిప్పు కుని ఏడుస్తూ చెప్పింది అమ్మ. ఆ తరువాత కన్నీటి పర్యంతమైంది. అక్కడితో మరి నేను ఆ విషయం పొడిగించలేదు.

ఇంట్లో లాండ్‌లైన్ ఫోను మోగుతుంటే ఎత్తాను.

"హలో" అన్నాను.

"హలో. నేను రామారావునండీ. నారాయణమూర్తి గారు చనిపోయారట కదా. ఆలస్యంగా తెలిసింది. మీరెవరండీ?" అన్నాడు అవతల నుంచి.

"నేను నారాయణమూర్తి పెద్ద కొడుకుని" చెప్పాను.

"చాలా బాధగా ఉందండి. నా కొడుక్కి గుండె ఆపరేషన్‌కి సాయం చేసిన మహానుభావుడాయన. మాకు దేవుడండి. రేపు వస్తున్నాను. అమ్మగారికి చెప్పండి" బాధను దిగమింగుతూ అన్నాడాయన.

అమ్మ చెప్పాలనుకున్నదేమిటో అర్థమైంది. నాన్న చేసిన ఖర్చులో ఉన్న గొప్పదనం తెలిసింది. నా కళ్ళు అప్రయత్నంగా కన్నీళ్ళు వర్షించాయి. అక్కడ నుంచి నా పంథా మార్చుకున్నాను. కాదు. నా జీవితమే మార్చుకోదలిచాను. వెంటనే అనంతానికి ఫోను చేశాను.

"ఇక నుంచి మనం పనిచేసే పద్ధతి మార్చుకుం టున్నాం. పూజలు, హోమాలు, యజ్ఞాలు, భజనలు, మంత్ర తంత్రాలు, మహిమలు బాగా తగ్గించి లోక క్షేమం కోసం అనాథ శరణాలయాలు, గోశాలలు, పేదలకు అన్నదానం, నిరుపేద రోగులకు వైద్యసహాయం, ప్రకృతి విపత్తులలో చిక్కుకున్న మనుషులకు సహా యంలాంటివి చేద్దాం. ఇవి అంకితభావంతో చేద్దాం. చిత్తశుద్ధితో చేద్దాం. ఏ సేవలకీ డబ్బు తీసుకోవద్దు. పీఠం అందరికోసం నడుస్తుంది. అందరికీ నా మాటగా చెప్పు" ఫోను పెట్టేశాను.

నేను చెప్పింది అనంతానికి వెంటనే అర్థం కాదు. వాడు జీర్ణించుకోలేడు. క్రమేపి అర్థం అవుతుంది... ఇక నుంచి నన్నెవరూ 'దేవుడు' అనుకోకూడదు. దైవ సేవకుడు అంటే చాలు. మానవ సేవే మాధవసేవ. అదే నా నిర్ణయం.

అమ్మ పాదాలకు నమస్కరించి ఆశీర్వచనం తీసు కున్నాను. నాన్నగారు నాలో నింపిన స్ఫూర్తి నాకు నిజమైన దైవాన్ని చూపించింది.

సెల్: 93964 30043

## తగ్గి తప్పు చేసిందా?



**లా**వణ్య త్రిపాఠిని అందరూ ఇదే మాట అంటు న్నారు. మొదటి నుంచి గ్లామర్ పాత్రలు చేయని లావణ్య తన జోనర్ నుంచి బయటకు వచ్చి మొదటిసారి 'రాధ'లో అందాల ప్రదర్శన చేసింది. అయితే లావణ్య ఇక్కడే పప్పులో కాలేసింది అంటున్నారు సినీ జనాలు. ఇప్పటి వరకూ లావణ్య కొద్దిగా బొద్దుగా ఉండేది. పక్కింటి అమ్మాయి పాత్రలకు ఆమె సరిగ్గా సరిపోయింది. ఇప్పుడు ఈ సినిమా కోసం బరువు తగ్గి బాగా వర్కవుట్లు చేసి స్లిమ్‌గా మారింది. ఇప్పటి వరకూ లావణ్యను నిండుగా చూడడానికి అలవాటు పడిన ప్రేక్షకులు బక్కచిక్కి కనిపించిన లావణ్యను పెద్దగా ఇష్టపడలేదు. దాంతో ఈ సినిమాలో చేసిన అందాల ప్రదర్శన అంతా వృథా అయిపోయింది అంటున్నారు సినీ జనాలు.



# టమోటాలతో కేన్సర్ దూరం?

స్థానికంగా లభించే టమోటాలతో కేన్సర్ దూరం అవుతుందో లేదో తెలియదు కానీ, ఇటలీలో లభించే టమోటాలతో కేన్సర్‌ని దూరం చేయవచ్చు అన్న విషయం ఇటీవల నిర్వహించిన పరిశోధనల్లో తేలింది. ఇటలీలో కొందరు జీర్ణాశయ రోగులకు అక్కడి టమోటాలతో చేసిన రసాన్ని క్రమం తప్పకుండా కొన్ని నెలల పాటు ఇచ్చారు. అనంతరం వారిని పరీక్షించి చూడగా వారిలో కేన్సర్ చాలా వరకూ తగ్గిన విషయాన్ని గుర్తించారు. ముఖ్యంగా జీర్ణాశయ కేన్సర్‌తో బాధపడేవారికి టమోటా చాలా ఉపయోగంగా ఉంటుందని పరిశోధనల్లో వెల్లడైంది. అయితే కేవలం ఇటలీలో లభించే టమోటాలతోనే కేన్సర్ కణాలు చనిపోయాయా? లేక అన్ని ప్రాంతాలలో లభించే టమోటాలకు కూడా ఈ శక్తి ఉంటుందా? అన్న విషయం మీద వీరు ఇంకా పరిశోధనలు నిర్వహిస్తున్నారు.






# ఇయర్ బడ్స్‌తో ఇబ్బందులు?

ఇయర్‌బడ్స్ ఉపయోగించి చెవిలోని గుబిలిని తీసుకునే అలవాటు చాలా మందికి ఉంటుంది. వీటిని చిన్న పిల్లల నుంచి పెద్దవారి వరకూ అందరూ ఉపయోగిస్తుంటారు. ఇవి ఉపయోగించడం అంత మంచిది కాదు అంటున్నారు నిపుణులు. వీటి ద్వారా చెవిలోని గుబిలి (ఇయర్ వాక్స్)ను తొలగించడం వలన కొన్నిసార్లు చెవిలోని సున్నితభాగాలు దెబ్బతింటాయని వారు చెబుతున్నారు. ఇయర్ వాక్స్ అనేది కొన్ని రోజుల తరువాత దానంతట అదే బయటకు వచ్చేస్తుందనీ, ప్రత్యేకించి దానిని తీయవలసిన అవసరం లేదనీ అంటున్నారు. ఇలా తీసివేసే క్రమంలో కొన్నిసార్లు కర్ణభేరి దెబ్బతింటుందని వారు హెచ్చరిస్తున్నారు. ఇయర్‌బడ్స్ ఉపయోగించడం వలన అమెరికాలో ప్రతిరోజు సుమారు 34 మంది గాయపడి ఆసుపత్రుల్లో చేరుతున్నారట! వీరందరూ నాలుగునుంచి ఎనిమిది సంవత్సరాల లోపు పిల్లలు కావడం విశేషం. అందువలన చిన్నపిల్లల చేతికి ఇయర్‌బడ్స్ ఇవ్వకూడదని సూచిస్తున్నారు.

# శబ్దాలతో ఒత్తిడి!

చుట్టూ రణగొణ ధ్వనులు, పెద్ద పెద్ద శబ్దాలు ఉంటే మెదడు తీవ్రమైన ఒత్తిడికి లోనవుతుంది అంటున్నారు పరిశోధకులు. ముఖ్యంగా పిల్లల ఎదుగుదల మీద ఈ శబ్దాలు తీవ్రమైన ప్రభావాన్ని చూపుతాయి అంటున్నారు. అదే పనిగా శబ్దాలు వింటూంటే మెదడులో ఒత్తిడిని కలిగించే హార్మోన్లు విడుదల అవుతాయి. నిత్యం రణగొణ ధ్వనుల మధ్య గడిపే పిల్లలు ఎదుటివారు ఏం చెబుతున్నారో కూడా గ్రహించే శక్తిని కోల్పోతారట! వీరిలో నిద్రలేమి ఎక్కువగా ఉంటుంది అంటున్నారు. ఈ విషయాలన్నీ ఇటీవల నిర్వహించిన పరిశోధనలో వెల్లడయ్యాయి. కొంతమంది చిన్న పిల్లలను ఎక్కువ శబ్దాలు వినిపించే ప్రదేశంలో ఎక్కువ కాలం



ఉంచారు. మరికొంత మందిని ప్రశాంత వాతావరణంలో ఉంచారు. కొన్ని నెలల అనంతరం వీరి మెదడు పనితీరు పరిశీలించారు. ప్రశాంత వాతావరణంలో ఉన్న పిల్లల మెదడులో హిప్పొకేంపస్ అనే కణాల వృద్ధిని కనుగొన్నారు. ఈ కణాలు పిల్లల్లో చురుకుదనాన్ని, జ్ఞాపకశక్తిని కలిగిస్తాయి. అదే శబ్దాల వాతావరణంలో ఉన్న పిల్లల్లో ఒత్తిడి హార్మోన్లు ఎక్కువ విడుదల కావడం గమనించారు. ఈ హార్మోన్లు కారణంగా పిల్లల మెదడులో ఎదుగుదల లోపించడాన్ని గుర్తించారు.

# అతిగా నీరు తాగితే కోమాలోకి?



అతి ఏదైనా అనర్థమే అన్నది నూటికి నూరుపాళ్ళు నిజమే అంటున్నారు పరిశోధకులు. ప్రాణాధారంగా భావించే నీరే కొన్నిసార్లు ప్రాణాలు తీస్తుందని వారు స్పష్టం చేస్తున్నారు. శరీర అవసరానికి మించి నీరు తాగితే వాంతులు, కళ్ళు తిరగడం వంటివి సంభవించి కొన్నిసార్లు కోమాలోకి వెళ్ళే ప్రమాదం ఉందని వారు హెచ్చరిస్తున్నారు. దీనిమీద ఆస్ట్రేలియాకు చెందిన మోనాష్ యూనివర్సిటీ పరిశోధకులు ఓ అధ్యయనాన్ని నిర్వహించారు. కొంతమందిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు చేత అవసరం లేకున్నా నీరు తాగించారు. మరొక గ్రూపు చేత అవసరం ఉన్నంత మేరకే నీరు తాగించారు. అనంతరం రెండు గ్రూపుల వారి ఆరోగ్యాన్ని పరీక్షించారు. అవసరానికి మించి నీరు తాగిన వారిలో వాంతులు, వికారం, కళ్ళు తిరగడం వంటి లక్షణాలు కనిపించాయి. రెండో గ్రూపులో అలాంటివి కనిపించలేదు. మొదటి గ్రూపు వారిలో కనిపించిన లక్షణాలను ఏ మాత్రం ఆలస్యం చేసినా కోమాలోకి వెళ్ళే ప్రమాదం ఉందని వారు హెచ్చరిస్తున్నారు.

—అవినాష్

## సరదాగా....

### నానా కష్టాలు

హనుమంతు ఒకరోజు డాక్టర్ దగ్గరకు వెళ్ళి, తన సమస్యని ఇలా చెప్పాడు.

డాక్టర్‌గారూ... మా పక్కింట్లో చాలా కుక్కలు ఉన్నాయి. అవన్నీ ఒకటే గోలగోలగా అరుస్తున్నాయి.

**డాక్టర్:** ఇంత చిన్న విషయానికి ఎందుకంత టెన్షన్ పడతావు. నీకు మాంచి టాబ్లెట్లు రాసిస్తాను. అవి వేసుకుంటే కుక్కల అరుపులు కాదుకదా... ఎటువంటి చప్పుళ్ళూ నీ చెవుల్లో దూరవు అని ప్రిస్క్రిప్షన్ రాసిచ్చాడు.

ఆ మందులు తీసుకెళ్ళి వాడాడు హనుమంతు.

కొద్దిరోజుల తర్వాత మళ్ళీ డాక్టర్ దగ్గరకు వెళ్లాడు. "డాక్టర్... మీరు రాసిచ్చిన మందులు పని చేయలేదు. ఇంతకుముందుకంటే ఎక్కువగా అలసిపోతున్నాను" అని చెప్పాడు.

**డాక్టర్:** "అరె.. నేను నీకు ఇచ్చిన మందులు చాలా మంచివి. సరేలే... ఈసారి వాటికంటే ఇంకా మంచి మందులిస్తాను."

**హనుమంతు:** "ఇవి నిజంగానే పనిచేస్తాయా డాక్టర్! రాత్రంతా కుక్కల్ని పట్టుకోవడానికే నా సమయం సరిపోతుంది. ఒకవేళ వాటిని పట్టుకున్నా, వాటికి ఈ మాత్రలు తినిపించడానికి నానా కష్టాలూ పడాల్సి వ స్తోంది"

### ఒక ప్రశ్న?

రఘునాథపల్లె... పేరులో పల్లె ఉన్నా అది ఓ మోస్తరు పట్టణం. ఆ చుట్టుపక్కల ఉన్న పది పది హేను గ్రామాల విద్యార్థినులకు కూడా ఆ పట్టణంలో ప్రభుత్వ బాలికల ఉన్నత పాఠశాలే దిక్కు. ఆడపిల్లలు సైకిళ్ళపై, బస్సుల్లో వచ్చి ఆ పాఠశాలలోనే చదువుకునే వారు. జిల్లాలోనే ముందంజలో ఉందా స్కూలు. విశాల మైన ఆటస్థలం కూడా ఉంది. టీచర్స్‌డే, స్పోర్ట్స్‌డే, రిప బ్లిక్‌డే... ఇలా అన్నీ ఎంతో గొప్పగా సెలబ్రేట్ చేస్తారు. ఆ రోజు శనివారం. స్పోర్ట్స్ డే మీట్ జరుగుతోంది. రక రకాల ఆటలపోటీలు నిర్వహిస్తున్నారు. విద్యార్థినులు కూడా ఎంతో ఉత్సాహంగా పాల్గొంటున్నారు. కోకో, కబడ్డీ, బ్యాడ్మింటన్, టెన్నీకాయిట్ ఇలా రకరకాల ఆట లతో ఆటస్థలం ఆడేవాళ్ళతో, చూసేవాళ్ళతో గోల గోలగా ఉంది. ఇంతలో రన్నింగ్ రేస్ మొదలుపెట్టబో తున్నట్టుగా అనౌన్స్ చేశారు పీఈటీ. రేస్‌లో పాల్గొన దలిచిన వారు తమతమ పేర్లు నమోదు చేయించుకు న్నారు. ఎక్కువమంది ఉండటంతో గ్రూపులుగా విభ జించారు. మొత్తం నాలుగు గ్రూపులు. రేస్ మొదల యింది. నాలుగు గ్రూపులనుంచి ఒక్కొక్కరు సంధ్య, రాధిక, శిరీష, స్వప్న ముందంజలో నిలిచారు. వారికి తిరిగి ఫైనల్ రేస్ కండక్ట్ చేశారు. ఫైనల్ రేసులో సంధ్య రాధికను దాటి ముందుకు పరుగులుదీసింది. శిరీష స్వప్నను దాటుకుని ముందుకెళ్ళిపోయింది. స్వప్న సంధ్యను ఓవర్‌టేక్ చేసింది. ఈ క్లూలను ఆధా రంగా చేసుకుని రేసులో ఎవరు వేగంగా పరిగెత్తారో, ఎవరు ముందంజలో ఉన్నారో చెప్పగలరా?

**సమాధానం**

శిరీష

# తీన్ మార్

నేను చదువుకుంటానే మార్కులు వేయిస్తే.. మా బామ్మ చేత రోజు ఇంకో గంట ఎక్కువగా నీకు పూజ చేయిస్తా సామీ!!

సార్!! నాకు రెండ్రోజులు లీవు కావాలి.. నా ఫోన్‌లో వాట్సాప్ మెసేజ్‌లు పేరుకుపోయాయి. డిలీట్ చేసుకోవాలి!!

ఆఫీస్

డాక్టరు గారు తినమన్నది వంటల్లో పీచు పదార్థాలండీ... కొబ్బరి పీచు కాదు!!




**'పదండి... అందరూ లోపలికి పదండి. విషయం ఏమిటో శివారెడ్డి నోటి వెంటే విందాం' బిగ్గరగా అరిచాడు ఆ జనంలో ఒక మనిషి.**

**బాజిరెడ్డి మనుషులు గాని, గ్రానైట్‌మైన్స్ నుంచి వచ్చిన వీరాధివీరులుగాని, ఎవరూ ఒక్క మాట కూడా మాట్లాడకముందే, పాలోమంటూ ముందుకు కదిలారు గుడి వ్యవహారాలు చూసే ధర్మకర్తలు.**

హైమారెడ్డిని, అతని తమ్ముడిని అవతలకు నెట్టేశారు. బందులదొడ్డి తలుపులు తెరిచినప్పుడు లోపల బంధించి ఉన్న పశువులన్నీ ఎలా బయటికి పరుగెత్తుకు వస్తాయో, అలాగే ఒకరి కాళ్ళకు ఒకరు అడ్డం పడుతూ గేటు దాటి లోపలికి పరిగెత్తారు.

తూలి పక్కకు పడిపోబోయిన హైమారెడ్డిని గట్టిగా పట్టుకున్నాడు విఠల్‌రెడ్డి తండ్రిగా పరిచయం చేసుకున్న పెద్దమనిషి.

'అనుకున్నది ఒకటైతే ఇప్పుడు జరిగింది మరొకటి. మీ అబ్బాయ్యికి ఇచ్చినమాటను నిలబెట్టుకోలేకపోయాము సారూ' బాధ నిండిన కంఠంతో వాపోయాడు హైమారెడ్డి.

'మరేం ఫరవాలేదు. ఏదైనా పని మొదలుపెడితే ఆ పని పూర్తయ్యే లోపల ఎదురయ్యే సాధక బాధకాలన్నిటినీ అంచనా వెయ్యటంలో మహా గొప్పవాడు మా విఠల్‌గాడు. అందరూ నడిచేదారిలో తను నడవటం వాడికి చేతకాదు. మాతోపాటు అమెరికా తీసుకుపోకుండా ఇక్కడే వదిలిపెట్టి పోవటానికి కారణం అదే! కాస్తంత వయసు పెరిగితే ఇంగిత జ్ఞానం కూడా పెరుగుతుందని అనుకున్నాం. పెరగలేదు కానీ తగ్గిపోతోంది' విసుగునిండిన కంఠంతో అన్నాడు ఆ పెద్దమనిషి.

'ఇప్పుడు ఆ మాటలెందుకు డాడీ... జరగాల్సింది ఏమిటో చూద్దాం' అన్నాడు పక్కనే ఉన్న కొడుకు.

'చూడటానికి ఏముంది? మనం కూడా లోపలికి పోవటమే' అన్నాడు పెద్దాయన.

'అదే కరెక్టు. పద అన్నయ్య. లోపలికి పోదాం' వెంటనే తాను కూడా అన్నాడు హైమారెడ్డి తమ్ముడు.

వాళ్ళు కదిలారు. వాళ్ళ మనుషులు కదిలారు. సబ్బిరెడ్డి వచ్చి స్వయంగా చెప్పకపోయినా, తాము కూడా వాళ్ళని అనుసరించారు ఫారెస్టు గార్డులు.

***

తమలో తాము మాట్లాడుకుంటున్నప్పటికీ, తమ చుట్టూ ఉన్న పరిసరాల్ని అతి జాగ్రత్తగా గమనిస్తూ చందనం చెట్టు దగ్గరికి వచ్చారు బండోడు చెప్పిన కొత్త మనుషులు.

డబడబమని శబ్దం చేస్తున్న బుల్లెట్ బండిని, దాని పక్కనే ఉన్న యువకుల్ని చూసి చటుక్కున ఆగిపోయారు.

'జాగ్రత్త తమ్ముడూ... వాళ్ళ జేబుల్లో ఏవో ఆయుధాలున్నాయి. బహుశా రివాల్వర్లో, పిస్తళ్ళో, కత్తులో అయి ఉండవచ్చు' వెంటనే బండోడిని హెచ్చరించాడు వెట్టి.

'ఎవరు మీరు? ఏం చేస్తున్నారు ఇక్కడ?' సూటిగా అడిగాడు వారిలో ఒకతను అదో రకమైన యాసతో.

'మేము ఎవరిమో తర్వాత చెపుతాము. ముందు మీరు ఎవరో చెప్పండి' బింకంగా అన్నాడు వెట్టి.

'మీరు బాజిరెడ్డి మనుషులేనా?' అడిగాడు ఆ మనిషి.

తల అడ్డం తిప్పబోతున్న బండోడి చేతిని ఎవరూ చూడకుండా గట్టిగా గిల్లి, అతన్ని నోరు తెరవనీయకుండా ఆపేశాడు వెట్టి.

'మమ్మల్ని బాజిరెడ్డి సారు కొడుకు పఠాన్ బాబు ఇక్కడ నిలబెట్టాడు. చందనం చెట్లు నరుకుతుంటే ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్ వాళ్ళు వచ్చి మా జనాన్ని పట్టుకుపోయారు. నరికిన దుంగలన్నీ వాళ్ళు తీసుకుపోయారు' అన్నాడు వెట్టి, అప్పటికప్పుడు నోటికి వచ్చిన మాటల్ని ఉపయోగించి.

సగం నరకబడిన చెట్టువైపు చూస్తూ తల ఊపాడు అతను.

'ఫారెస్ట్ డిపార్ట్‌మెంటు వాళ్ళు అందర్నీ పట్టుకుపోతే, మరి మీరు మాత్రం ఇక్కడ ఎలా ఉండగలిగారు? మీరు దొరికిపోలేదా?' పది క్షణాలపాటు తన సహచరులతో ఏదో విషయాన్ని మాట్లాడి, వెట్టి

### జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. రాయుడిపల్లిలో చౌడేశ్వరికి జరిగిన అపచారమేమిటో తెలుసుకుంటాడు వెట్టి. అడవిదారిలో అతనికి చౌడేశ్వరి ఆత్మశిల కనిపిస్తుంది. సమస్యలన్నీ తాను సాల్వ్ చేస్తానని శివారెడ్డికి మాటిస్తాడు వెట్టి. హైమారెడ్డి కొడుకు రాకేష్, తాను ప్రణవిని పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నట్టు చెబుతాడు వెట్టికి. ఇంతలో పఠాన్‌కి, ప్రణవికి తెల్లారితే పెళ్ళని అనౌన్స్ చేస్తాడు బాజిరెడ్డి. జరగబోయే పరిణామాలు ఆగాలంటే ఆత్మశిలను యథాస్థానంలో ఉంచాలని భావించి, బాబీతోపాటు రాయుడిపల్లి బయలుదేరతాడు వెట్టి. ఈలోపు నాగమ్మతల్లి సూచనతో బుల్లెట్ బండి తీసుకుని వెట్టికి ఎదురొస్తారు రవీంద్ర బావమరిది, బండోడు. అడవిలోకి వెళ్ళి ఆత్మశిలను బయటకు తీస్తాడు. ఎవరో వస్తున్నట్టుగా సంకేతాలు రావడంతో ఆత్మశిలను బాబీకిచ్చి చౌడేశ్వరి గుడి దగ్గరికి పంపిస్తాడు. ఈలోపు శివారెడ్డి ఎస్టేటు దగ్గరికి చౌడేశ్వరి గుడి ధర్మకర్తలు వస్తారు. శివారెడ్డిని కలవాలనుకుంటున్నట్టు చెబుతారు.

ఆ తర్వాత...



వైపు తిరుగుతూ అడిగాడు అతను.

'మీరు చింతలపల్లి నించే వస్తున్నారు కదా' అన్నాడు వెట్టి.

తల ఊపాడు ఆ మనిషి.

'అక్కడ మీకు జరిగింది ఏమిటో తెలియలేదా?' అతను అడిగిన ప్రశ్నకు తాను అడుగుతున్న మాటకు ఎటువంటి సంబంధం లేదని తెలిసికూడా అడిగాడు వెట్టి.

సీరియస్‌గా చూసి, కోపంగా మాట్లాడవలసిన ఆ మనిషి ముఖంలో వెంటనే ప్రత్యక్షం అయిందొక నవ్వు.

'బాజిరెడ్డి సారు చాలా తెలివైనవాడు. తను చేయదలుచుకున్న పనులను సరిగ్గా పూర్తి చేయగల మనుషుల్ని ఎంపిక చేసుకుంటాడు. మేము చందనం దుంగల పేరు మీద ఇంకో పని చేయటం కోసం వస్తామని అతనికి తెలుసు' అన్నాడు.

అయోమయం అధికం అయిపోయింది వెట్టికి. తలాతోకా లేని సమాధానాల్ని ఇచ్చి వాళ్ళని కన్ఫ్యూజ్ చేయాలని అనుకున్న తననే ఆ పరిస్థితిలోకి నెట్టేశాడు ఆ మనిషి.

శ్రీలంక నుంచి వచ్చే బయ్యర్స్‌కి దుంగల్ని అప్పగించేస్తే తమ పని పూర్తి అయిపోతుందని పఠాన్ తన మనుషులతో చెప్పటం తాను స్వయంగా వినటం జరిగింది.

తికమకగా ఉండే యాసతో మాట్లాడుతున్న ఈ మనిషి, మట్టిబొమ్మల మాదిరి మౌనంగా నిలబడి ఉన్న అతని సహచరులు చందనం దుంగల కోసమే వచ్చి ఉండాలి తన అంచనా ప్రకారం.

వేరే విధంగా ఉన్నాయి వారి మాటలు. అవి ఏమిటో తెలుసుకోలేకపోతే, తన బాధలు, బరువులు మరింత అధికం అయిపోయే లక్షణాలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి.

'ఏమిటి బ్రదరూ.... ఏమీ మాట్లాడకుండా నిలబడి పోయావేమిటి?' ఉన్నట్టుండి ఆ మనిషి హెచ్చరించడంతో, ఉలికిపాటును నేర్పుగా కప్పిపెట్టుకుంటూ, తల ఎత్తి చూశాడు.

'ఏం మాట్లాడమంటారు? జరిగింది ఏమిటో చింతలపల్లిలో మీకు తెలిసిపోయింది కదా! వచ్చిన దారినే వెనక్కి వెళ్ళిపోకుండా ఇక్కడికి ఎందుకు వచ్చినట్టు?' అడిగాడు.

అతను ఏదో పెద్ద జోక్ వేసినట్టు పకపకా నవ్వాడు ఆ మనిషి. పక్కకు తిరిగి తన సహచరులకు ఏదో చెప్పాడు. వెంటనే నవ్వడం స్టార్ట్ చేశారు వాళ్ళు కూడా.

'ఏంటన్నయ్యా ఈ వీధి భాగోతం? ఏంటి వాళ్ళ గోల?' చిరాకుగా వెట్టిని అడిగాడు బండోడు.

'సమ్‌థింగ్ ఈజ్ గోయింగ్ టు హేపెన్! నువ్వు నేను ఊహించనిమాట ఏదో మనకు వినబడబోతున్నది. సిద్ధంగా ఉండు' పెదవుల కదలిక కనిపించ కుండా అన్నాడు వెట్టి.

'సిద్ధంగా ఉండాలా? దేనికి? వాళ్ళ మీద ఎగబడటానికా?' అడిగాడు అతను.

'పారిపోవటానికి... వాళ్ళ దగ్గర ఉన్న ఆయుధాలు ఎటువంటివో మనకి తెలియదు' అన్నాడు వెట్టి.



నవ్వటం పూర్తి అయింది కాబోలు... సీరియస్‌గా తల ఊపి, తన సహచరుల్లో ఒకడికి సైగ చేశాడు వెట్టితో మాట్లాడుతున్న మనిషి.

సూట్‌కేసులు గాని, బ్రీఫ్‌కేసులు గాని, కనీసం ప్లాస్టిక్‌తో చేయబడిన బుట్టలుగాని ఏమీ లేవు వారి దగ్గిర. ఒకే ఒక గోనె సంచీ... సిమెంట్ బస్తా సైజులో ఉన్నది బయటికి వచ్చింది ఆ సహచరుడి దుస్తుల్లోనుంచి.

అందులోనుంచి పెద్దపెద్ద కరెన్సీ నోట్ల కట్టలు గలగలలాడుతూ కింద పడ్డాయి.

'మీరు చూపించే రాయి నిజంగా శక్తి కలిగినదే అయివుంటే, ఈ డబ్బు మీకు ఇవ్వబడుతుంది. దాన్ని మాకు చూపించండి. మాకు తృప్తి కలిగితే తీసుకుంటాం. ఈ డబ్బు మీకు ఇస్తాం' కిందపడిన కట్టల్ని చూపిస్తూ అన్నాడు ఆ మనిషి.

'వాడు ఎవడో గాని ఏదో మెంటల్ హాస్పిటల్ నుంచి పారిపోయి వచ్చిన శాల్తీమాదిరిగా ఉన్నాడు. రాళ్ళురప్పలు అంటాడేంటన్నయ్యా...' అంటూ, ఆ మాటలు తన నోటి నుంచి బయటికి వచ్చిన మరుక్షణం బొమ్మ మాదిరి బిగుసుకుపోయాడు బండోడు.

'అన్నయ్య... కొంపతీసి ఆ బాజిరెడ్డి... మన అమ్మవారి శిలని...' అంటూ మాటను ఆపాడు.

అతనికంటే వెయ్యి రెట్లు అధికమైన షాక్‌కి గురై ఉన్నాడు వెట్టి. తాము ఖరీదు చేయదలచుకున్న దుంగలు ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్‌కి స్వాధీనం అయ్యాయని, వాటిని మాకు అందించవలసిన వారందరూ అరెస్టు చేయబడ్డారని చింతలపల్లిలో అడుగు పెట్టగానే తెలిసి పోయిన తర్వాత కూడా వాళ్ళు వెనక్కి పోకపోవటానికి కారణం ఏమిటో అర్థం అయ్యేసరికి మతిపోయినంత పని అయింది అతనికి.

చౌడేశ్వరి గుడి దగ్గర్నించి అమ్మవారి ఆత్మ శిలను తీసుకువచ్చి పిచ్చిపొదల్లో పారేసిన బాజిరెడ్డి, ఆ శిలను గురించి మర్చిపోలేదు. తాను అనుకున్న పనులు అన్నీ అతలాకుతలం అవుతూ ఉండటాన్ని గమనించిన తర్వాత అతనికి తెలిసి వచ్చి ఉంటుంది అసలు విషయం.

అమ్మవారి శిలను ఆ చుట్టుపట్ల ఎక్కడా కనిపించకుండా, ఎవరూ ఊహించని ప్రదేశంలోకి పంపించేయాలంటే దానికి ఎంతో కొంత విలువను ప్రకటించి, పురాతన కాలపు విగ్రహాలను విదేశీయులకు అమ్మినట్టే, అమ్మిపారేయటమే మంచిపని అని నిర్ణయానికి వచ్చి ఉంటాడు.

అతని మాటలకు అంగీకరించి ఆ శిల కోసమే వచ్చారు ఈ పెద్ద మనుషులు. తమకు కావాల్సిన సరుకును చూడకముందే, డబ్బు కట్టల్ని ఎదుట పెట్టి రెచ్చగొడుతున్నారు.

'ఏమిటి బ్రదరూ? ఏమిటి ఆలోచన? ఏది ఆ రాయి?' ఉన్నట్లుండి వెట్టిని పలకరించాడు ఆ విదేశీయుడు.

'అదీ... ఆ రాయి.. అసలు విషయం ఏమిటంటే...' తను చెప్పవలసిన సమాధానం వెంటనే నోటికి రాకపోవటంతో, తడబడ్డాడు వెట్టి.

'తెలుసు బ్రదరూ! బాజిరెడ్డి సారు మాకు అన్ని విషయాలు చాలా వివరంగా చెప్పాడు. భయంకరమైన పాములు దానికి కాపలా కాస్తూ ఉంటాయట కదా... మనిషి అనే వాడు దాని దగ్గరికి పోవటమే కాదు అసలు కంటితో కూడా చూడలేడట కదా.. మాకు చెప్పాడు మీ సారు. మేము అందుకు సిద్ధంగానే వచ్చాం' అంటూ ఇంకోసారి తన సహచరులవైపు చూశాడు ఆ మనిషి.

తన దుస్తుల్లోనుంచి జానెడు పొడుగున్న సిరంజి వంటి సాధనాన్ని బయటికి తీసి చూపించాడు ఒక మనిషి.

'ఈ ప్రపంచంలో కనిపించే పాములు ఎటువంటివైనా ఈ సిరంజిలోని మెడిసిన్‌ని వాసన చూస్తే చాలు... గిలగిలా కొట్టుకుంటూ వెల్లకిలా పడిపోతాయి. తిరిగి మామూలుగా లేచి తిరగాలంటే రెండు మూడు రోజులు పడుతుంది. ఇది మా దగ్గర ఉండగా మమ్మల్ని ఎటు వంటి సర్పం ఏమీ చేయలేదు. చూపించండి ఆ రాయిని' సగర్వంగా చెప్పాడు మొదటి మనిషి.

'అన్నయ్యా... మనం ఇక్కడి నుంచి జంపైపోవటం చాలా మంచిది. వాళ్ళని మనం ఆపటం చాలా కష్టం' గుసగుసగా వెట్టిని హెచ్చరించాడు బండోడు.

'అమ్మవారు అవతలికి వెళ్ళిపోయి చాలాసేపు అయింది. కాబట్టి మనం భయపడవలసిన అవసరం లేదు' అంటూ ఆ జనాన్ని చూసి తల ఊపాడు వెట్టి.

'డబ్బు తీసుకో తమ్ముడు' అంటూ బండోడికి చెప్పాడు.

తన భుజంమీది తుండుగుడ్డని కింద పరిచి, వాళ్ళు కింద పడవేసిన నోట్ల కట్టలన్నిటినీ మూటగా కట్టుకున్నాడు బండోడు.

**దాదాపు గుడి దగ్గరగా వచ్చేశారిద్దరూ. కంకరరోడ్డును సమీపించారు. రోడ్డు మీద చరచరా పాకుతున్న జీవాలని చూసి షాక్ తిన్నారు. ఎటుచూసినా పాములు...లెక్క లేనన్ని. ఒకదానిమీద ఒకటి పాకుతూ రోడ్డుని మూసేశాయి. భయపడి పోయాడా యువకుడు. బాబీని హెచ్చరిస్తూనే వెనక్కి పరుగందుకున్నాడు. ఒక్క సారిగా వీరివైపు దూసుకొచ్చేశాయవి. ఆ తరువాతేం జరిగింది?**

'రండి... నా వెనకేరండి' అంటూ చందనం చెట్టు దగ్గర్నించి ఇవతలకు దారి తీశాడు వెట్టి.

తాము తీసుకువచ్చిన సిరంజిని సిద్ధంగా పట్టుకుని అతని పక్కనే నడిచాడు ఒక మనిషి. వెనుకే అడుగులు వేశారు మిగిలినవారు.

అమ్మవారి శిల అస్తవ్యస్తంగా పడి కనిపించిన పొద దగ్గరికి అందరినీ తీసుకుపోతున్న వెట్టికి, ఆ పొద ఇంకా పాతిక అడుగుల దూరంలో ఉండగానే, చెవులు చిల్లులు పడేటట్లు వినవచ్చింది పాము బుస.

'యస్... బాజిరెడ్డి చెప్పింది అక్షరాలా నిజం. ఆ శిల నిజంగానే చాలా శక్తిమంతమైనది అయి ఉంటుంది. దాన్ని కాపలా కాస్తున్న పాములు కూడా పవర్‌ఫుల్‌గానే ఉండి ఉంటాయి' అన్నాడు వెట్టితో మాట్లాడిన మనిషి.

అడుగులో అడుగు వేస్తూ ముందుకు పోయాడు సిరంజి పట్టుకున్న మనిషి.

'అదే.. శిల ఉన్న పొద అదే..' ఎక్కడివాడక్కడ నిలబడిపోయి తను ఏ పొదలో నుంచి అమ్మవారిని బయటికి తీసుకు వచ్చాడో, ఆ పొదను వేలుపెట్టి చూపించాడు వెట్టి.

మరో రెండు అడుగులు ముందుకు వేశాడు సిరంజి పట్టుకుని ఉన్న మనిషి. కంటికి కనిపించని చెయ్యి ఏదో తన గుండెల మీద బలంగా అదుముతున్న అనుభూతి కలిగింది వెట్టికి.

విశ్వాసంగా కాపలా ఉన్నది ఆ పొదలోని సర్పం. తన డ్యూటీ తను చక్కగా నిర్వర్తించింది. అందుకు ఆ తల్లి ఎటువంటి ప్రతిఫలం ఇస్తుందో గాని, తను మాత్రం తీవ్రమైన వేదనకు గురి చేయబోతున్నాడు. తప్పు చేస్తున్నాడా తను?

వెట్టి మనసులో మెదిలిన ఆ ప్రశ్నకు సమాధానం లభించలేదు. బొగ్గుతో నడిచే రైలింజన్ ఆవిరిని బయటికి వదిలే సమయంలో వినవచ్చే దారుణమైన శబ్దం మాదిరి వినిపిస్తున్న బుస ఉన్నట్లుండి మరింత అధికం అయింది.

'కింగ్‌కోబ్రాలు కూడా ఇంతపెద్ద శబ్దం చేయవు. ఇదేదో చాలా వింతగా ఉంది' అన్నాడు వెట్టి పక్కనే నిలబడి ఉన్న మొదటి మనిషి.

సిరంజి పట్టుకున్న మనిషి మరో రెండు అడుగులు వేశాడు. అంతే, పొదకు పది అడుగుల దూరంలో ఎత్తుగా ఎదిగి ఉంది ఒక చెట్టు. అది ఏ విధమైనదో వెట్టికి తెలియదు గాని, చాలా దట్టంగా ఉన్నాయి కొమ్మలు.



ఆ కొమ్మల్లో నుంచి జర్రున జారి సిరంజి పట్టుకున్న మనిషి భుజాల మీద పడింది వెట్టికి బాగా పరిచయం ఉన్న మహాసర్పం.

అదిరిపడి వెనక్కి దూకాడు ఆ మనిషి. అతనికి తెలియకుండానే చేతిలో నుంచి జారి కిందపడిపోయింది సిరంజి.

ఈతముళ్ళవంటి కోరలు కనిపించేటట్టు నోటిని తెరిచి తల వెనక్కి తీసుకున్నది అతని భుజాల మీద పడిన సర్పం.

అతని పని అయిపోయిందని తెలిసి వచ్చింది వెట్టికి. కాలుమీద వేలుమీద పాముకాటు పడితేనే తట్టుకోవడం కష్టం. సరాసరి తల మీదనో, ముఖం మీదనో పడితే తెప్పరిల్లటం ఇంపాజిబుల్.

అతన్ని వదిలి అది మిగిలిన వారి మీదికి జంప్ చేస్తే డిజాస్టరే!

డబ్బుకట్టల మూటను భుజం మీద వేసుకుని ఒక పక్కగా నిలబడి ఉన్న బండోడివైపు చూశాడు అతను. చూస్తూనే తనకు అటూఇటూ ఉన్నవారిని అవతలకు నెట్టి పరుగు అందుకున్నాడు ఒక్కసారిగా.

పని కట్టుకుని బొట్టూకాటుక పెట్టి చెప్పవలసిన అవసరం లేకపోయింది. అతను తనవైపు చూసిన చూపు అర్థం తెలుసుకుని తను కూడా వెనక్కి తిరిగాడు బండోడు.

వారిద్దరికీ అర్థం కాని భాషలో గంయ్ గంయ్‌మంటూ అరిచారు ఆ జనం. కుందేళ్ళ వెనుక పడిన తోడేళ్ళ మాదిరి వేగంగా వెన్నంటారు.

'బుల్లెట్ బండి.. బండి దగ్గరికి' వగరుస్తూ చెప్పాడు వెట్టి.

అడ్డం వచ్చిన పొదలమీదినుంచి ఎగిరెగిరి దూకుతూ వేగంగా పోయాడు బండోడు. బండి స్టార్ట్ చేయలేదు. భుజం మీద ఉన్న డబ్బుల మూటను బండి హ్యాండిల్ మీద పడేశాడు.

'స్టార్ట్ చెయ్యి. స్టార్ట్ చెయ్యి' అంటూ వచ్చాడు వెట్టి.

అప్పుడు కూడా ఆ పని చేయలేదు బండోడు. ఎగిరి పక్కకు దూకి, పఠాన్ మనుషులు నరకటం మొదలుపెట్టిన చందనం చెట్టు మొదలుకు తన భుజాన్ని ఆనించాడు.

'వచ్చేస్తున్నారు తమ్ముడు... వదిలేయ్' బండిని స్టార్ట్ చేస్తూ ఆందోళనగా హెచ్చరించాడు వెట్టి.

హుమ్మని హూంకరించి ఊపిరి బిగపట్టాడు బండోడు. సెకనులో పదో వంతు కాలంలో అర్థం అయింది వెట్టికి, అతనికి బండోడు అనే పేరు ఎందుకు పెట్టబడిందో...

పదునైన గొడ్డలి దెబ్బలు మరో పదో పాతికో పడితే తప్ప పక్కకు ఒరగటం అసాధ్యం అనిపించేటట్టు సగర్వంగా నిలబడి ఉన్న ఆ చందనం చెట్టు కిరకిరమని వికృత శబ్దాలు చేస్తూ వణికిపోయింది.

తరుముకుంటూ వస్తున్న విదేశీయులు అదిరిపడి వెనక్కి దూకటం వల్ల ప్రాణాల్ని దక్కించుకోగలిగారు గాని, ఏ మాత్రం ఆలస్యం చేసినా బలమైన ఆ చెట్టుకొమ్మల కిందపడి పచ్చడి పచ్చడి అయిపోయి ఉండేవాళ్ళు.

'పోనీ.. బండిని పోనీ అన్నయ్యా' అంటూ ఎగిరి బండి మీదికి దూకాడు బండోడు.

క్లచ్ వదిలేశాడు వెట్టి. ఊపిరి బిగపట్టి ముందుకు దూకించాడు.

ధనాధన్‌మంటూ గర్జించాయి నాలుగు రివాల్వర్లు. రివ్వురివ్వుమంటూ దూసుకువచ్చి పొదల్లో పడ్డాయి బుల్లెట్లు.

'అన్నయ్యా..' ఆందోళనగా అరిచాడు బండోడు.

తమ పని అయిపోయిందనే అనుకున్నాడు వెట్టి. ఒకదాని వెనుక ఒకటిగా దూసుకు వచ్చే బుల్లెట్లలో ఏ ఒక్కటి వచ్చి తగిలినా ఆగిపోతుంది తమ ప్రయాణం. తనకే తగలాల్సిన అవసరం లేదు. తనను నమ్మి తనతో వచ్చిన బండోడికి తగిలినా, అక్కడి నుంచి ఒక్క అడుగు దూరం కూడా తను ముందుకు పోలేడు.

'చేతనవుతుందని అనుకుని మొదలుపెట్టాను తల్లీ... నిన్ను నీ గుడి దగ్గరికి చేర్చే పనిని. చేతకానివాడిని అవుతానని అనుకోలేదు' మౌనంగా ఆక్రోశించింది అతని అంతరంగం.

రెండుసార్లు మాత్రమే గర్జించాయి పడిపోయిన చెట్టు అవతలి పక్కనుంచి ఆ విదేశీయుల రివాల్వర్లు. మంత్రం వేసినట్టు ఒకేసారి ఆగిపోయిందా శబ్దం.

'అన్నయ్య... అన్నయ్య... చూడు... వెనక్కి చూడు' తన భుజాలను గట్టిగా పట్టుకున్న బండోడు చెవులు చిల్లులు పడేటట్లు అరవటంతో, భుజం మీది నించి వెనక్కి చూశాడు అతను.

అంతకుముందు పఠాన్‌ని, అతని జనాన్ని అదరగొట్టి అడవిలో గిరికీలు కొట్టించిన తేనెటీగల గుంపు పూనకం వచ్చినట్టు చెలరేగిపోతోంది.

బయటికి తీసిన ఆయుధాలు వదిలేసి, చేతులతో తలల్ని కప్పుకుంటూ దూరంగా పరుగులు తీస్తున్నారు ఆ విదేశీయులు.

'మా నాయన అంటుంటే ఏమో అనుకున్నాను గాని, ఆ తల్లికి అన్ని విషయాలు ముందే తెలుసు అన్నయ్యా... మనం ఇటువంటి ప్రమాదంలో చిక్కుకుంటామని తెలిసే ఆ చెట్టును పడిపోకుండా నిలబెట్టి ఉంచింది' సంతోషంగా అన్నాడు బండోడు.

చెట్టు పడిపోవటానికి కారణం అతని భుజాల బలమే కారణమని చెప్పలేదు వెట్టి. తల ఊపి బండిని వేగంగా పోనీయటం మొదలుపెట్టాడు.

***

'ఎప్పుడో ఏదో జరిగిపోయిందని ఊరుకోకుండా, ఇప్పుడు ఆ మాటలన్నిటినీ తిరగతోడటం దేనికి? మీలో ఎంతమందికి మా మామయ్య గురించి పూర్తిగా తెలుసు?' ఎర్రబడిన ముఖంతో చాలా తీవ్రంగా అడిగింది శివారెడ్డి భార్య.

'అమ్మా.. మేము ఆ మాటలు మాట్లాడటానికి రాలేదు. చౌడేశ్వరి గుడి దగ్గర ఘోరాలు జరిగిపోతున్నాయి. పుట్టల్లో ఉన్న పాములన్నీ బయటికి వచ్చి దారిని మూసేసినయ్. అందుకు కారణం అడిగితే, మీ కుటుంబం చేసిన తప్పులే అంటున్నాడు బాజిరెడ్డి సారు. అది ఏమిటో తెలుసుకుని, వెంటనే ఉపచారాలు చేయాలి. మేము వచ్చింది అందుకే' చిన్నగా అన్నాడు ఒక ధర్మకర్త.

మౌనంగా కూర్చుని ఉన్నది పిచ్చమ్మి. 'ఆ కారణాలు తెలుసుకోవాలని అనుకోవటం బాగానే ఉన్నది. బాజిరెడ్డి కొడుక్కి మా బిడ్డను ఇచ్చి పెళ్ళి

## శృతి కూడా అదే పొరపాటు చేస్తోందా?

*అనుష్క 'సైజ్ జీరో' కోసం చేసిన పొరపాటునే ప్రస్తుతం శృతిహాసన్ కూడా చేస్తోందని అంటున్నారు సినీ జనాలు. నిన్న మొన్నటి వరకూ సన్నజాజి తీగలా ఉండే శృతి ఇప్పుడు బరువు పెరిగిపోయింది. ఇదంతా ఓ సినిమా కోసమట! సినిమా కోసం ఎక్కువ క్యాలరీలు ఉండే ఆహారం తీసుకుని శరీరాన్ని పెంచుకుంటోందట! బరువు పెరగడం సాధ్యమే కానీ, తగ్గడం అసాధ్యం అన్న సంగతి శృతికి తెలియదా? కనీసం అనుష్కను చూసైనా బుద్ధి తెచ్చుకోవచ్చు కదా అంటున్నారు సినీ జనాలు. అనుష్క కూడా గతంలో ఇలాగే బరువు పెరిగి, ఇప్పుడు ఆ బరువును తగ్గించుకోవడానికి పడరాని పాట్లు పడుతోంది. అయినా కూడా మునుపటి నాజూకుతనం అనుష్కలో మిస్ అయింది అన్న విమర్శలను ఎదుర్కొంటోంది.*



చేస్తే తెలుస్తాయా అవి?' అడిగింది ఒక్కసారిగా.

'తల్లీ... పెళ్ళి విషయం మాకు తెలియదు. బాజిరెడ్డి సారు చెప్పవలసిన మాట అది' అన్నాడు ఆ మనిషి.

'ఇదిగో శివారెడ్డీ... ముందు పెళ్ళి జరిపించు. ఈ విషయాన్ని నేను చూసుకుంటాను' అన్నాడు బాజిరెడ్డి.

'జరిపించకపోతే?' ప్రశ్నించింది పిచ్చమ్మి.

'నేను మాట్లాడేస్తాను. ఆ తర్వాత మీరు నెత్తీనోరు కొట్టుకున్నా ఏమీ చేయలేరు' అన్నాడు బాజిరెడ్డి.

'తల్లీ... మీరు తప్పుగా అనుకోకండి. శివారెడ్డి తండ్రిగారు మంచివాడు కాదని, ఆయన చేసిన పనుల మూలకంగానే ఇప్పుడు ఈ ప్రమాదం ఎదురయిందని బాజిరెడ్డి అంటున్నాడు. అదేమిటో చెప్పనీయండి' అన్నాడు ధర్మకర్త.

'శివారెడ్డి... నీ మాట కూడా ఇదేనా?' ఇంకోసారి శివారెడ్డి వైపు తిరుగుతూ దురుసుగా అడిగాడు బాజిరెడ్డి.

నీరు నిండిన కనులతో తల్లివైపు, తన చెల్లివైపు




చూశాడు శివారెడ్డి.

'అన్నయ్యా... శివారెడ్డి మాట్లాడితే పెళ్ళి జరిగిపోతుంది. మనకు ఆ అబ్బయ్య అప్పచెప్పిన పని నాశనం అయిపోతుంది' హైమారెడ్డి చెవిలో ఊదాడు బాబీ బాబయ్య.

'ఇక్కడ ఇంతమంది పెద్దలున్నారు. ఒకసారి మేము చెప్పేది విన్న తర్వాత మీ ఇష్టం వచ్చినట్లు పెళ్ళిళ్ళు జరుపుకోండి' ఖంగుమంటున్న కంఠంతో అన్నాడు హైమారెడ్డి.

అప్పటివరకూ ఆయన్ని కాని, సబ్బిరెడ్డిని గాని, ఎవర్నీ గమనించని జనం అదిరిపడి చూశారు.

'శివారెడ్డి ఇచ్చిన పవరాఫ్ అటార్నీ సహాయంతో ఈ బాజిరెడ్డి మా దగ్గర చాలా పెద్ద మొత్తాలు అప్పు తీసుకున్నాడు. మా అప్పు తీర్చి ఒకటి కాదు, వంద పెళ్ళిళ్ళు చేసుకోవచ్చు' అన్నాడు హైమారెడ్డి.

'ఇప్పటికిప్పుడు అంత మొత్తం ఇవ్వటం కష్టం. కొంచెం గడువు కావాలి' అనవసరమైన ఆర్గ్యుమెంట్లు పెట్టుకుంటే ఆలస్యం అవుతుందన్న భయంతో, వెంటనే సమాధానం ఇచ్చాడు బాజిరెడ్డి.

'మాకు మాటలమీద నమ్మకం పోయింది. కాయితం మీద మీ లాయర్లని పిలిపించి రాసివ్వు' అన్నాడు హైమారెడ్డి.

అందుకు ఒప్పుకోకూడదని బాజిరెడ్డి అనుకున్నాడు గాని, అక్కడ ఉన్నవారందరూ తలలు ఊపటాన్ని చూశాడు.

'పిలవండిరా.. ఎక్కడ ఉన్నారో చూడండి' అంటూ తన డ్రైవర్‌కి చెప్పాడు.

అతని లాయర్ల కోసం బయటికి పరిగెత్తాడు డ్రైవర్.

'ఏంటన్నా ఇది? వాడు కాయితాలు చూపిస్తాడు. మనం ముఖాలు వేలాడేసుకుని వెళ్ళి పోతాం. ఆ అబ్బయ్యకి సమాధానం' అంటున్న తమ్ముడి వైపు చూసి నవ్వాడు హైమారెడ్డి.

'వాడు రాసిచ్చిన తర్వాత మాట్లాడాల్సిన మాటలు అవి. ఇంకా రాసివ్వలేదు. కొంచెం టైము పడుతుంది...' అన్నాడు.

అర్థం కాలేదు తమ్ముడికి. ఆ మాటే అన్నాడు వెంటనే 'ఏదైనా మెలిక పెట్టావా?' అని.

తల ఊపాడు హైమారెడ్డి.

అధికం అయిపోయింది తమ్ముడికి కుతూహలం. 'ఎటువంటి పని అయినా తనకు చెప్పకుండా చేయటం అలవాటు లేని తన సోదరుడు చోటు గాని చోటులో పెట్టిన మెలిక ఎటువంటిది?

'లాయర్లు రావాలి కదరా చిన్నాడా? వాళ్ళు రారు. అసలు వాళ్ళు ఎక్కడ ఉన్నారో వీళ్ళకి ఇప్పుడప్పుడే తెలియదు. ఆళ్ళిద్దర్నీ బలంతంగా మనవాళ్ళిద్దరు ఊరి బయటికి తీసుకుపోయి కూర్చోబెట్టారు' చిన్నకంఠంతో వివరించాడు హైమారెడ్డి.

అప్పుడు గమనించాడు తమ్ముడు తమ మనుష్యుల్లో ఇద్దరు తక్కువగా ఉండటం. ఎంత బిగపట్టుకున్నా ఆగకుండా అతని పెదవుల మీదికి వచ్చేసింది పెద్ద నవ్వు.

'మీరు పిలిచినా పిలవకపోయినా ఈ పెళ్ళి చూడటానికి వచ్చాం. పెళ్ళి భోజనానికి ఇంకా టైము ఉంది. కనీసం ఏదో ఒక కూల్‌డ్రింకు అయినా ఇచ్చేదిది ఉందా?' అడిగాడు సూటిగా శివారెడ్డిని.

'వద్దు...' వెంటనే అన్నాడు హైమారెడ్డి.

అదిరిపడినట్టు తన అన్న వైపు చూశాడు తమ్ముడు.

'కతికితే అతకదురా.. కూల్‌డ్రింకు కాదు పచ్చి మంచినీళ్ళు కూడా మనం ముట్టుకో కూడదు' ఖచ్చితమైన కంఠంతో తన నిర్ణయం వినిపించాడు హైమారెడ్డి. అర్థమైంది తమ్ముడికి. మరింత పెద్దదై పోయింది నవ్వు.

తీసుకున్న అప్పు తీర్చకుండా కూర్చున్నందుకు కచ్చతో అతను అలా అంటున్నాడని అనుకున్నారు అందరూ.

ముసిముసి నవ్వులు నవ్వుతున్న ప్రత్యూష వంక విచిత్రంగా కూడా చూశారు.

***

'నడవటం ఇంక నావల్ల కాదు. నా పని అయిపోయింది' అంటూ నేల మీద చతికిల పడిపోబోయిన బాబీ భుజాలు పట్టుకుని బలవంతంగా నిలబెట్టాడు రవీంద్ర బావమరిది.

'దగ్గరికి వచ్చేశాం బ్రదరూ. కాస్తంత... పదే పది అడుగులు' అంటూ అతి బలవంతంగా ముందుకు నడిపించాడు.

గుబురుగా పెరిగి ఉన్న పొదల్లో నుంచి పెద్ద చెట్ల గుంపులోకి, అక్కడి నుంచి సరాసరి మెయిన్ రోడ్డు మీదికి వెళ్ళిపోయారు ఇద్దరూ – రెండే రెండు నిమిషాల తర్వాత.

'అదిగో అమ్మవారి గుడి దగ్గరికి పోయే కంకర రోడ్డు' అని రోడ్డుకు అవతల ఉన్న దారి చూపిస్తూ, గొంతు ఎండుకుపోయినట్లు మాటల్ని ఆపేశాడు రవీంద్ర బావమరిది.

గుడి దగ్గర ఒకటి రెండు పాముల్ని మాత్రమే చూసి ఉన్నాడు అతను గతంలో. లెక్క పెట్టటానికి వీలు లేనన్ని పాముల్ని గుడి దగ్గరే కాదు తన కలల్లో కూడా ఎన్నడూ చూసి ఉండలేదు.

ఒకదాని మీద ఒకటిగా పాకుతూ కనిపించే గాజు పురుగుల తెట్టు మాదిరి అనిపిస్తున్నాయి కంకర రోడ్డు మీద బైఠాయించి ఉన్న విషపు జీవులు.

'అయ్య బాబోయ్.... ఇలాంటి సీను నేను డిస్కవరీ ఛానల్లో కూడా చూడలేదు' అమ్మ వారి శిలను మరింత గట్టిగా గుండెలకు అదుముకుంటూ అన్నాడు అస్పష్టంగా బాబీ.

'పారిపోవాలి బ్రదరూ... మనం పారిపోవాలి. ఆ రాయిని రోడ్డు మీద పెట్టేయ్' ఉన్నట్లుండి కంగారుగా అన్నాడు రవీంద్ర బావమరిది.

పది క్షణాలు పట్టింది బాబీకి ఆ మాటలు అర్థం కావడానికి. అయితే అలా చెయ్యటం మాత్రం అతనికి చేతకాలేదు.

ఉన్నట్లుండి వచ్చింది చలనం కంకర రోడ్డు మీది పాముల్లో. శత్రువులో, గద్దలో, ముంగిసలో తమ వెంటపడినట్లు అతి వేగంగా వచ్చేశాయి మెయిన్ రోడ్డు మీదికి.

బాబీని హెచ్చరిస్తూనే పరుగు మొదలుపెట్టిన రవీంద్ర బావమరిది తప్పించుకోగలిగాడు. బాబీ మాత్రం ఆ పని చేయలేక పోయాడు.

కన్నుమూసి కన్ను తెరిచేటంతలో వచ్చి అతన్ని చుట్టుముట్టాయి అవి. పాదాలను పెనవేసుకున్నాయి కొన్ని. నడుమును చుట్టుకున్నాయి. మెడను భుజాల్ని ఆక్రమించుకున్నాయి. తల మీదికి ఎక్కి పడగలు విప్పి నాట్యం మొదలు పెట్టాయి ఇంకా కొన్ని.

**(ఇంకా వుంది)**

# లైంగిక వ్యాధుల నుంచి హోమియోతో విముక్తి

ప్రాణాంతక వ్యాధులలో ముఖ్యంగా చెప్పుకోదగినవి హెచ్ఐవి, హెపటైటిస్ బి, హెర్పిస్.

### అసలు హెచ్ఐవి అంటే ఏమిటి?

హెచ్ఐవి వైరస శరీరంలో ఉంటే రోగనిరోధక శక్తి క్రమేణ బలహీనపడుతుంది. చివరకు ఎయిడ్స్ రూపంలో బయటపడుతుంది. హెచ్ఐవి వైరస్ మానవ శరీరాన్ని నివాసంగా మార్చుకుంటే శరీరాన్ని పూర్తిగా దెబ్బతీస్తుంది.

### హెచ్ఐవి, ఎయిడ్స్ ఒక్కటేనా?

ఈ రెండూ ఒకటి కావు. ఒక వ్యక్తి శరీరంలో హెచ్ఐవి వైరస్ ఉన్నా అతన్ని ఎయిడ్స్ వ్యక్తి అని అనలేము. హెచ్ఐవి వైరస్ శరీరంలో ఉంటూ రోగనిరోధక వ్యవస్థను పూర్తిగా దెబ్బతీసి శరీరాన్ని పూర్తి బలహీనంగా మార్చినపుడు ఆ దశను ఎయిడ్స్ అని పిలుస్తారు. ఈ దశలో సీడీ 4 కౌంట్ 200 కన్నా తక్కువ ఉంటుంది. ఇన్‌ఫెక్షన్ సోకగానే 6 నుంచి 12 వారాలలోపు హెచ్ఐవి నిరోధక కణాలు కనిపిస్తాయి. ఇన్‌ఫెక్షన్ సోకిన తరువాత హెచ్ఐవి రోగనిరోధక కణాలు పుట్టడానికి మధ్య పట్టిన సమయాన్ని విండో పీరియడ్ అంటారు. ఈ విండో పీరియడ్‌లో హెచ్ఐవీ పరీక్షలో వైరస్ ఉండదు. అయినప్పటికీ ఈ వ్యక్తితో శృంగారంలో పాల్గొంటే భాగస్వామికి హెచ్ఐవి వచ్చే అవకాశం ఉంది.

### హెపటైటిస్ బి

ఈ వ్యాధి ముదిరే వరకు ఎలాంటి లక్షణాలు కనిపించవు. చాలా మంది ఇతర వైద్యపరీక్షలు చేసుకున్నప్పుడు హెపటైటిస్ ఉన్నట్లుగా బయటపడుతుంది. మానవ శరీరంలో కాలేయం చాలా ముఖ్యమైనది. ఈ అవయవానికి వైరస్ సోకితే ఎన్నో సమస్యలు వస్తాయి. కాలేయానికి సోకే వైరస్‌లలో ముఖ్యమైనవి హెపటైటిస్ బి, హెపటైటిస్ సి. హెపటైటిస్ బి వైరస్ సోకగానే కొంత కాలం నిద్రాణంగా ఉంటుంది. మెల్లమెల్లగా కాలేయాన్ని నిర్వీర్యం చేస్తుంది. చివరకు ప్రాణాంతకంగా మారుతుంది. లివర్ కేన్సర్, లివర్ సిర్రోసిస్ రావడానికి కారణమవుతుంది. ఈ వైరస్ వల్ల కాలేయ కణజాలం క్రమక్రమంగా పాడవుతుంది.


**డా. మధు వారణాశి,** ఎం.డి
ప్రముఖ హోమియో వైద్యులు
ప్లాట్‌నెం 188,
వివేకానందనగర్ కాలనీ,
కూకట్‌పల్లి, హైదరాబాద్
ఫోన్ : 8897331110
8886 509 509




**ఎలా వ్యాపిస్తుంది? :** లైంగిక సంపర్కం ద్వారా, లాలాజలం, తల్లి పాలు, స్టెరిలైజ్ చేయని నీడిల్స్ వాడటం ద్వారా వ్యాపిస్తుంది. హెపటైటిస్ బి ఉన్న వ్యక్తి నుంచి రక్తం, నేత్రాలు, మూత్రపిండాలు తీసుకోవడం వల్ల కూడా వ్యాపిస్తుంది. డ్రగ్స్, పచ్చబొట్టు, బ్లేడ్లు ఒకరు ఉపయోగించినవి వాడటం, టూత్‌బ్రష్ ఇతరులవి వాడటం వల్ల కూడా వ్యాపిస్తుంది.

### లైంగిక వ్యాధులు

లైంగిక వ్యాధులు శృంగారం ద్వారా వ్యాపిస్తాయి. పురుషుల్లో మూత్రం పసుపుపచ్చగా రావడం, పురుషాంగంపై చిన్న చిన్న కురుపుల మాదిరిగా రావడం, నొప్పి ఉండటం, లేకపోవడం జరిగినా ఇన్‌ఫెక్షన్స్ ఉండవచ్చు. స్త్రీలలో యోని ద్వారా వచ్చే స్రావాలు దుర్వాసనతో ఉండటం, పీరియడ్స్‌తో సంబంధం లేకుండా రక్తస్రావం కావడం, మూత్రంలో మంట, ఎక్కువసార్లు మూత్రానికి వెళ్లాల్సి రావడం, జననాంగాల దగ్గర గుల్లలు రావడం, దురద ఉండటం, ఒళ్లునొప్పులు, జ్వరం వంటి లక్షణాలుంటాయి. ఈ లక్షణాలు కనిపిస్తే హెర్పిస్, గనేరియా, సిఫిలిస్, హెచ్ఐవి, షాంకరాయిడ్‌పుండ్లు వంటి వ్యాధులు కావచ్చు.

### హోమియో చికిత్స

వ్యాధి శరీరంలో ఏ భాగానికి వచ్చినా దాని మూలకారణాన్ని గుర్తించి చికిత్స చేయడం హోమియో చికిత్స ప్రత్యేకతగా చెప్పుకోవచ్చు. చాలా కేసుల్లో శస్త్రచికిత్స అవసరం లేకుండా నయం చేసే వీలుంది. వ్యాధి గమనం, తీవ్రత, రోగి పరిస్థితిని పరిగణలోకి తీసుకుని చికిత్స చేస్తే తప్పక పరిష్కారం లభిస్తుంది. హోమియో చికిత్స రోగనిరోధక శక్తిని పెంచి ఇమ్యునోమాడ్యులేటర్‌గా పనిచేస్తుంది. ఈ సమస్యలలో హోమియో వైద్యుని ఎంపిక చాలా ముఖ్యమైనది. అనుభవజ్ఞుడైన వైద్యుడు వ్యాధి మూలంగా శరీర భాగాలకు జరిగిన హాని, వ్యాధి వ్యాపించిన తీరును అంచనా వేయగలడు. హోమియో వైద్యునికి అనాటమీ, మెడిసిన్, పెథాలజీపై పూర్తి అవగాహన ఉండాలి. అప్పుడే పరిష్కారం లభిస్తుంది.

# పీసీఓడి పత్తా లేకుండా పోయింది

**రంజని** మెడిసిన్ చదువుతోంది. ఇంటర్న్‌షిప్‌లోకి ఎంటర్‌అయింది. అప్పుడే ఆమెకు ఆరోగ్య సమస్య మొదలయింది. మెన్సస్ మూడు, నాలుగు నెలలకోసారి వస్తోంది. అయిన ప్రతీసారి బ్లీడింగ్ ఎక్కువ అవుతోంది. శరీరంలో మార్పులు కనిపిస్తున్నాయి. ముఖంలో అవాంఛిత రోమాలు, వెంట్రుకలు రాలిపోవడం జరుగుతోంది. ముఖం, ఛాతీ, చేతులు, కాళ్లపైన అవాంఛిత రోమాలు బాగా పెరిగాయి. ముఖంమీద మొటిమలు వచ్చాయి. ముఖం జిడ్డుగా తయారయింది. అక్కడక్కడా స్కిన్ టాగ్స్ వస్తున్నాయి. ఏదో తెలియని భయం ఆమెను ఉక్కిరిబిక్కిరి చేసింది. తెలియకుండానే ఒకరకమైన డిప్రెషన్‌లోకి వెళ్లింది. బరువు పెరుగుతుండటంతో తినడం కూడా బాగా తగ్గించింది. తను డాక్టర్ కదా.. అనే ఫీలింగ్‌తో సమస్యను ఎవరికీ చెప్పుకోలేక కొన్నినెలలు బాధపడింది. చివరకు అమ్మ ప్రోద్భలంతో మా దగ్గరకు వచ్చింది. తన సమస్యలన్నీ వివరించింది. పరీక్ష చేయిస్తే పాలిసిస్టిక్ ఒవేరియన్ డిసీజ్ అని తేలింది. చాలా మందికి ఇది యుక్తవయసులో కనిపిస్తుంది.

**మా అమ్మ ఒత్తిడితోనే డాక్టర్ మధువారణాశి దగ్గరకు వెళ్లాను. తన ట్రీట్‌మెంట్ వల్ల నార్మల్ మనిషి అవుతానని కలలో కూడా అనుకోలేదు. పీజీ ఎంట్రెన్స్‌లో గైనకాలజీలో సీటొచ్చింది. డాక్టర్ గారిచ్చిన ట్రీట్‌మెంట్ వల్ల కలిగిన ఆత్మవిశ్వాసంతోనే ఇది సాధించాను. థాంక్స్ టు డా. వారణాశి.**

ఇలాంటి కేసులు నేను రెగ్యులర్‌గా ట్రీట్ చేస్తూనే ఉంటాను. నువ్వు భయపడాల్సిన పని లేదు, త్వరగానే తగ్గిపోతుంది అని ధైర్యం చెప్పాను.

తన శారీరక లక్షణాలు, మానసిక లక్షణాలు చూస్తే అమ్మాయిది చాలా సున్నితమైన స్వభావం, త్వరగా ఏడ్చే స్వభావం ఉంది. చల్లదనం అంటే ఇష్టమని చెప్పింది. జీర్ణశక్తి చాలా తక్కువగా ఉంది. ఉదయం తీసుకున్న ఆహారం అరగక ఉబ్బరంగా ఉంటుందని చెప్పింది. ఆమె చెప్పిన లక్షణాలను ఆధారంగా చేసుకుని కొన్ని మందులు ఇచ్చాను. తేలికపాటి వ్యాయామం చేయమని సూచించాను. రెండు నెలల తరువాత మెన్సస్ వచ్చిందని చెప్పింది. నాలుగు నెలల తరువాత తనలో చాలాబెటర్‌మెంట్స్ కనిపించాయి. మొటిమలు తగ్గాయి. బరువు తగ్గింది. ముఖంలో కాంతి పెరిగింది. ప్రతి నెలా రెగ్యులర్‌గా వచ్చి మందులు తీసుకుంది. ఎనిమిది నెలల్లో ఆమె సమస్యలన్నీ పూర్తిగా తగ్గిపోయాయి. ఇప్పుడామె ఆరోగ్యవంతమైన జీవితం గడుపుతోంది.




**చిన్నికృష్ణునికి పాలిచ్చి జోకొట్టింది యశోద. నిద్రపోయాడు కృష్ణుడు. చల్లనిచెట్ల నడుమ, శకటం దిగువన, మెత్తని పానుపుపై పిల్లాణ్ణి పడుకోబెట్టిందామె. స్నానానికి పడుచులసహా యమునకు వెళ్ళింది. తల్లి అటు వెళ్ళగానే కృష్ణుడిటు మేల్కొన్నాడు. కావాలని లేచాడో, గండుచీమ కుట్టిందో పెద్దగా ఏడ్చాడు. ఆకలి అనిపించిందేమో! చిట్టిచేతుల్ని నోట్లో కుక్కుకున్నాడు. శ్రీపాదాలను అటూ ఇటూ కదలించాడు. చక్రరేఖలుగల పాదాలను గట్టిగా విసిరాడు. ఆ విసురు శకటాన్ని తన్నినట్టయింది. అంతే! దెబ్బకు శకటం ఆకాశానికి ఎగిసింది. అక్కడ ఇరుసులూ, చక్రాలుసహా విరిగిపోయింది. విరిగి నేలపై పడింది. కృష్ణుని ఏడుపు పెద్దగా వినరావడంతో పరుగు పరుగున వచ్చారక్కడికి గోపికలుసహా గోపకులు. విరిగి పడిన శకటాన్నీ, ఏడుస్తున్న కృష్ణుణ్ణీ చూసి విస్తుపోయారు.**

# శకటాసురసంహారం:గోపికల మొర

శకటం విరిగిపడడంతో అందులో భద్రపరిచిన పాలు, నెయ్యి, పెరుగు నేలపాలయ్యాయి. యమున నుంచి తీరిగ్గా నడచి వస్తున్న యశోదకు ఎవరో చెప్పారు, ఆ సంగతి. ఏమైంది? ఏమైందంటూ రోహిణి సహా అక్కడకు వేగంగా చేరుకున్నదామె. విచారించింది. కృష్ణుడు గట్టిగా శకటాన్ని తన్నాడు. దాంతో పాలు నేలపాలయ్యాయి అన్నారెవరో. నమ్మలేకపోయింది యశోద. చిన్నికృష్ణుడి చిన్నారిపాదాలకు అంత శక్తి ఎక్కడది? ఆశ్చర్యపోయింది. అంతలో కొద్ది దూరంలో ఆడుకుంటున్న గోపబాలకులు వచ్చి యశోదతో చెప్పారిలా.

నిజం తల్లీ! మేము కళ్ళతో చూశాం. ఆకలికి కృష్ణుడు లేచాడు. బండిని కాలితో తన్నాడు. అప్పుడే బండి ఆకాశానికి ఎగసి పాలు ఇలా నేలపాలయ్యాయి.

అవునా? ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసింది యశోద. కృష్ణుణ్ణి చేతుల్లోనికి తీసుకుంది.

ఆకలేసిందా కన్నా? ఏడ్చావా? పడుకున్నావని, స్నానానికి వెళ్ళానురా! అంతలోనే ఇంత అల్లరి చెయ్యాలా? అయ్యకి తెలిసిందనుకో! నన్ను ఎంతగా కోపగిస్తారో? అంది. భయపడింది. కృష్ణునికి పాలిచ్చి, అతని ముంగురులు సవరించింది. బొజ్జనిండా పాలు తాగిన కృష్ణుడు ముసిముసిగా నవ్వుతూ చూస్తోంటే, ముద్దొచ్చాడు. ముద్దులు కురిపించింది యశోద. తర్వాత ఆలోచించసాగిందిలా.

దేవుడు ఉన్నాడు కాబట్టి సరిపోయింది. లేకపోతే కృష్ణుడు ఏమయ్యేవాడో? బండి మీదికి ఎగరడం ఏమిటి? ముక్కలవడం ఏమిటి? కృష్ణుడు తన్నాడని అంటున్నారు, సాధ్యమా? కొవ్వెక్కిన ఆబోతులు పోట్లాడుకుంటూ బండి దగ్గరగా వచ్చి ఉంటాయి. అవి తన్ని ఉంటాయి. దాంతో జరిగి ఉంటుందిలా. అంతేకాని...అంటూ రకరకాలుగా మథనపడింది యశోద. అంతలో అక్కడికి పరుగున పరుగున వచ్చాడు నందుడు. జరిగిన సంగతి ఎవరో అతనికి చెప్పారు. భయపడి పరుగందుకున్నాడప్పుడు. వచ్చి చూశాడు. కృష్ణునికి ఏమీ కాలేదు. అమ్మయ్య అనుకున్నాడు. ఊపిరి పీల్చుకున్నాడు. ముక్కముక్కలైన బండిని చూశాడు. ఎలా ఎగిరింది? ఎలా విరిగింది? చిట్టిపాపడు తనని తాను ఎలా రక్షించుకున్నాడు? చిత్రంగా ఉంది అంతా అనుకున్నాడు. అంతలోనే కృష్ణునికి ఏ ప్రమాదమూ జరగనందుకు ఆనందించాడు. ఇంతింత గండాలు గడచి గట్టెక్కుతున్నాడంటే కృష్ణునికి చిరాయుర్దాయం తప్పదనుకున్నాడు.

భయపడుతూ భర్తను సమీపించింది యశోద. చేతులు జోడించి, అతనికి నమస్కరించి అన్నదిలా.

ఇంత ప్రమాదం జరుగుతుందని నేను ఊహించలేదు. ఎప్పటిలాగానే కృష్ణుణ్ణి బండి కింది పొత్తిళ్ళలో పడుకోబెట్టాను. స్నానానికని యమునకు వెళ్ళి వచ్చేంతలో...అని కన్నీరు పెట్టుకుంది. నేను చేసింది తప్పు అయితే నన్ను క్షమించండి. ఇక ముందు ఇలాంటివి జరగనివ్వను అంది. సన్నగా నవ్వాడు నందుడు. దగ్గరగా తీసుకుని ఆమె భయాన్ని పోగొట్టాడు.

ఇద్దరూ కలసి, కృష్ణునికి దృష్టిదోషం తొలగించారు. ఇంట్లోని దేవతామూర్తులకు ఆ చిన్నారిని చూపించి, అభయం ప్రసాదించమని వేడుకున్నారు.

**సుడిగాలిలా వచ్చి చిన్ని కృష్ణుణ్ణి ఆకాశానికి ఎత్తుకుపోయాడు రాక్షసుడు తృణావర్తుడు. గొంతు నులిమి అతడి ప్రాణాలు హరించాడు కృష్ణుడు. రోజులు గడిచేకొద్దీ తన బాల్య చేష్టలతో, అమాయకత్వంతో తల్లిని అలరించేవాడు. ఒకనాడు బోసినోరు తెరచి గట్టిగా నవ్వసాగాడు చిన్ని కృష్ణుడు. అతని ముఖంలో యశోదకు అనేక అద్భుతాలు కనిపించాయి. ఏమిటా అద్భుతాలు?**

కొన్నాళ్ళు గడిచింది. ఒకరోజు చిన్నికృష్ణుణ్ణి ఒడిలో కూర్చోబెట్టుకుని, ఆ పసివాని శరీరాన్ని నిమిరింది యశోద. అప్పుడు ఆ పిల్లాడి శరీరం పువ్వులా మెత్తగా లేదు. రాయిలా గట్టిగా ఉంది. ఎత్తిపట్టి చూసింది. బాగా బరువు అనిపించాడు. ఆశ్చర్యపోయింది యశోద. ఎవరో మహానుభావుడు కావాలనే తనకి పుత్రుడుగా జన్మించాడని భావించింది. ముద్దులతో ముంచెత్తింది.

చిన్నికృష్ణుడు ఆడుకుంటున్నాడు ఒకనాడు. వీధి అరుగు మీద అటూ ఇటూ దోగాడుతున్నాడు. అదే అవకాశం అనుకున్నాడు రాక్షసుడు తృణావర్తుడు. ఆకాశంలోంచి కిందికి దిగాడు. సుడిగాలిగా మారాడు. గిరగిర తిరుగుతూ కృష్ణుణ్ణి సమీపించాడు. పాపణ్ణి చేజిక్కించుకున్నాడు. ఆకాశానికి ఎగసిపోయాడు. దగ్గరలో ఉన్న గోపబాలకులు కృష్ణుణ్ణి రక్షించేందుకు ప్రయత్నించేంతలో వారి కళ్ళల్లో ధూళికమ్ముకుంది. ఏదీ కనిపించకుండాపోయింది. దానితో గోపబాలకులు నిశ్చేష్టులయ్యారు. భయభ్రాంతులయ్యారు. గోపబాలకుల్నేకాదు, ఆకాశంలోని సూర్యుణ్ణి కూడా ధూళి కమ్మేసింది. సూర్యుడు మరుగయ్యాడు. వ్రేపల్లెలో చీకటి ముసిరింది. పట్టపగలు ఈ చీకటి ఏమిటి? ఈ సుడిగాలి ఏమిటి? అంతుచిక్కక పల్లె ప్రజలు ఆక్రోశించారు. ఒకరిని ఒకరు వెదుక్కొంటూ విలపించసాగారు.

కృష్ణుణ్ణి సుడిగాలి ఆకాశానికి ఎత్తుకుపోయిందని యశోదకు తెలియజేశారెవరో. విన్నంతనే విలపిస్తూ పరుగుపరుగున వచ్చిందామె. ఆకాశానికేసి చూస్తూ, ఆక్రోశించిందిలా.

చిన్నికృష్ణా! ఎక్కడున్నావయ్యా? ఏ మేఘాల మాటున నిన్ను ఆ సుడిగాలి దాచిపెట్టింది? ఆకలికి అల్లాడిపోతున్నావా? అమ్మ గుర్తొచ్చి ఏడుస్తున్నావా? నేనేం చెయ్యనయ్యా, ఏం చెయ్యను? నా దురదృష్టం నిన్నూ వెంటాడుతోంది. దేవుడా! నా కన్నయ్యను కాపాడు అంటూ స్పృహ కోల్పోయింది. పిలిచినా పలకని యశోదను చూసి పల్లెప్రజలంతా భోరుమన్నారు. తల్లీ! అమ్మా అంటూ కన్నీరుమున్నీరయ్యారు. నింగి నుంచి నేలకు చూస్తూ, ఏడుస్తున్న పల్లెప్రజలను చూసి, ఆనందించాడు తృణావర్తుడు. చేతిలోని కృష్ణుణ్ణి చూసి వికటాట్టహాసం చేశాడు. పైకెత్తి కిందపడవేయబోయాడు. అంతే! కృష్ణుడు మహాభారమైపోయాడు. విదిలించేందుకు కూడా వీలులేకపోయాడు. కృష్ణుణ్ణి మోయలేక, వదిలించుకోలేక సతమతమైపోయాడు తృణావర్తుడు. నురగలు కక్కసాగాడు. అదే అదునుగా చిన్నికృష్ణుడు, ఆ రాక్షసుని మెడందుకున్నాడు. పట్టుకుని వేలాడాడు. కిందకు లాగాడు. నింగినుంచి నేలకు జారిపడుతూ ప్రాణభీతితో కేకలు వేశాడు తృణావర్తుడు. కర్ణకఠోరమైన ఆ కేకల్ని వినలేకపోయాడు కృష్ణుడు. అతని గొంతు నొక్కాడు. తృణావర్తుని ప్రాణాలు తీశాడు. ప్రాణాలు కోల్పోయిన తృణావర్తుని మృతదేహం నేలమీద పడి, చెల్లాచెదురైంది. అయితే అతని

గొంతుపట్టుకుని, గుండెలను అంటిపెట్టుకున్న కృష్ణుడుకి ఏమీ కాలేదు. క్షేమంగా నేల మీదికి చేరాడు. నవ్వుతున్న చిన్నికృష్ణుణ్ణి చేతుల్లోకి తీసుకున్నారు గోపస్త్రీలు. పరుగు పరుగున యశోదను సమీపించారు. ఆసరికే తేరుకుని కూర్చున్న యశోదకు అందించారు ఆ పాపణ్ణి. అందుకుని సంభ్రమాశ్చర్యాలు చెందింది యశోద. పరమానందభరితురాలైంది. కృష్ణుణ్ణి గుండెలకు అదుముకుంది. జరిగింది తెలుసుకుని నందగోపుడు వచ్చాడప్పుడు. బిడ్డడికి ఏమీ కాలేదని తెలిసి సంతోషించాడు. భార్య చేతుల్లోని కృష్ణుణ్ణి అందుకుని ముద్దు చేశాడు. మురిపాలు పోయాడు.

కృష్ణుని బాల్యచేష్టలకు నవ్వు ఆపుకోలేకపోయిందొకనాడు యశోద. పిల్లాడి అమాయకత్వానికి జాలిపడి దగ్గరకు చేరదీసింది. బుగ్గలు మీద ముద్దుపెట్టుకుంది. అదే సందర్భం అన్నట్టుగా బోసినోరు తెరచి గట్టిగా నవ్వసాగాడు కృష్ణుడు. అలా ఆ పాపడు నవ్వుతున్నప్పుడు అతని ముఖంలో అనేక అద్భుతాలను చూసింది యశోద. సప్తసముద్రాలు, దశదిశలు, వనాలు, ద్వీపాలు, శైలాలుసహా పరిభ్రమిస్తున్న భూమి, ఆకాశం, నక్షత్రాలు, నవగ్రహాలు, చరాచరప్రాణికోటి ఆదిగా కృష్ణుడి ముఖంలో కనిపించాయి. ఏంటిది? పిల్లాడి నగుమోములో ఈ వింత ఏమిటి? కలకాదుకదా? అనుకున్నది యశోద. కృష్ణుని ముఖాన్ని నిమిరి చూసింది. అంతే! కనిపించిన ప్రతి దృశ్యం అదృశ్యమైంది. అంతా భ్రమ అనుకున్నదామె.

రోజులు గడుస్తున్నాయి. నిల్చోబెట్టి, వేలందిస్తే అందుకుని, నడుస్తున్నాడు కృష్ణుడు. నడుస్తూ నవ్వుతున్నాడు కృష్ణుడు. దూరంగా నిలబెట్టి, చేతులు జాచి పిలిస్తే పరుగున వస్తున్నాడు. ఆ పరుగులో పడిపోతాడేమోనన్న భయాన్ని కలిగిస్తున్నాడు. యశోద సహా పల్లెలో స్త్రీలంతా కృష్ణుని కోసం, కృష్ణుని చిన్నారి చేష్టలకోసం కళ్ళప్పగించి చూస్తున్నారు. బలరాముడు కూడా చిన్నారిపొన్నారి చిలిపిచేష్టలతో రోహిణి సహా అయినవాళ్ళందరినీ అలరించసాగాడు.

బలరామకృష్ణులిద్దరూ అలా పెరిగి పెరిగి అందరికీ కన్నులపండువులైనారు. ఆటలవేళ వారిద్దరూ ధూళిభరితశరీరాలతో కొండజేగురులు అలముకున్న గున్న ఏనుగుల్లా కానవచ్చారు. గోపబాలకుల మధ్య సింహపుకొదమలనిపించారు. అనుక్షణం పెద్దల ప్రశంసలు అందుకుంటూ, సూర్యచంద్రుల్లా ప్రకాశించసాగారు. బలరామకృష్ణుల బాల్యక్రీడలు వ్రేపల్లెలో చూడముచ్చటనిపించాయి. తల్లికనుగప్పి, ఇరుగుపొరుగు ఇళ్లలో యథేచ్ఛగా విహరించసాగాడు కృష్ణుడు. పెరుగుచిలుకుతోంటే కవ్వాన్ని అదిమిపట్టేవాడు. వెన్నపెట్టమని వేధించేవాడు. వెన్న పెడతాం, నృత్యం చెయ్ అంటే చేసి చూపించేవాడు. కృష్ణనృత్యం మైమరుపు కలిగించేది. కాగిన పాలు, పేరుకున్న పెరుగు, నేయి, వెన్న, మీగడలను దోసిళ్ళతో దొంగిలించి, తాను తిన్నంత తిని, మిగిలినది తోటివారికి పంచిపెట్టేవాడు. వారు తింటుంటే చప్పట్లు కొట్టి ఆనందించేవాడు. అందకుండా ఎత్తుగా పెట్టుకున్న ఉట్లను కొట్టిమరీ నవనీతాన్ని పొట్టనపెట్టుకునేవాడు కృష్ణుడు. ఎంత తిన్నా, ఏమీ



తిననివాడిలా ఆకలిగొన్నవాడిలా అమ్మ చెంతకు చేరేవాడు. పాలిమ్మని, పెరుగిమ్మని మారాము చేసేవాడు.

బలరాముడు తమ్ముడికి వంతపాడేవాడు. తమ్ముడెంతంటే అంత. తమ్ముడు ఏది చెబితే అది. అన్నసహా గోపబాలకుల్ని కొందరిని చేరదీసి, వారితో కృష్ణుడిలా అనేవాడు.

మీరంతా ఆవులు! నేను ఆబోతుని.

వాళ్ళు ఒప్పుకుంటే పరుగులు పెట్టించేవాడు కృష్ణుడు. వెంటపడి వేధించేవాడు. అలాగే నేను రాజుని. మీరంతా భటులు అనేవాడు. అని రాజుగారు నగరపర్యటనకు బయల్దేరారు. మీరు నా వెన్నంటి రండి అనేవాడు. రాజసం ఒలకబోస్తూ నడిచేవాడు కృష్ణుడు. ఆ నడక చూడముచ్చటనిపించేది అందరికీ. బంతులాటలు, దాగుడుమూతలు...ఆటలన్నిటికీ కృష్ణుడే జట్టునాయకుడిగా ఉండేవాడు. చెరువులో, తోటలో, కోవెలలో, కొమ్మలలో, అక్కడా ఇక్కడా ఎక్కడ చూసినా కృష్ణుడే కనిపించేవాడు. పిన్నలనే కాదు, పెద్దలను కూడా ఆటపట్టించేవాడు. అయితే ఎవరూ కృష్ణుని అల్లరి గురించి నందగోపునికిగానీ, యశోదకుగానీ చెప్ప సాహసించేవారు కాదు. ఒకసారి గోపస్త్రీలు తెగించారు. కూడబలుక్కున్నారంతా. యశోదాదేవిని సమీపించారు.

అమ్మా! యశోదమ్మా! నీ ముద్దులకృష్ణుని అల్లరి అంతా ఇంతా కాదమ్మా! మమ్మల్నందరినీ బాగా ఏడిపిస్తున్నాడు. పిల్లలకే పాలులేవని ఎంతగానో అల్లరిపడుతోంటే నీ చిన్నికృష్ణుడు, లేగల్ని విడచిపెట్టి, చుక్కపాలు లేకుండా చేస్తున్నాడు. కడవల్లోని పాలు పిల్లలతో పంచుకుని తాగి, ఆ కడవల్ని పగలగొడుతున్నాడు. అక్కడితో ఆగితే బాగుండేది. మొన్ననేం చేశాడో తెలుసా?

ఏం చేశాడమ్మా?

ఉట్టి మీది పెరుగు అంతా పిల్లలతో తాగి, వెళ్ళిపోతూ వెళ్ళిపోతూ ఆ ఎంగిలిచేతిని ఆ ఇంటి కోడలిపిల్ల నోటికి రాశాడు. దాంతో పెరుగంతా కోడలే తాగి వేసిందని అత్త పెద్దగొడవపడింది. అలాగే ఈ ఇంటికుండలో నేతిని తాగి, ఆ ఖాళీ కుండను ఆ ఇంట పెడుతున్నాడు. దాంతో వాళ్ళూ వీళ్ళూ కొట్టుకుంటున్నారు. నిన్ననేం చేశాడో తెలుసా తల్లీ?

ఏం చేశాడేం చేశాడు?

నా కొడుకు నిద్రపోతుంటే, వాడి జడని, లేగదూడతోకకి ముడిపెట్టాడు. ముడిపెట్టి దానిని ముందుకు తోలాడు. పాపం చంటి వెధవకి ఎన్ని గాయాలయ్యాయో!

కృష్ణుని అల్లరి వినసొంపుగా ఉంది. ఇంకా వినాలని ఉంది. ఆ భావాన్ని ముఖంలో కనిపించనీయక జాగ్రత్తపడసాగింది యశోద. చీరకొంగు నోటకుక్కుకుని మరీ నిల్చింది.

**—అరణి**



# గత్తరు చరిత్రం

వారాల కృష్ణమూర్తి

**శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయం లోపల భక్తుల కోలాహలం. ఆలయం వెలుపల యాచకుల కోలాహలం. లోపలి కోలాహలంలో భక్తి మిన్నంటే ఆరాధన. బైట భుక్తి కోసం భూమి దద్దరిల్లే ఆరాటం.**

**ఆలయం నుండి బైటకొచ్చిన ముసలిజంట బైట జరుగుతున్న గొడవను ఒక్కక్షణం పరికించారు. "నువ్వు ఇక్కడకు రాకూడదు. ఊరంతా తిరిగి అడుక్కున్నది చాలక గుడి ముందూ చేరి మా పొట్ట కొడతావా? నిన్నూ....నీ ఆవునీ పొడిసిపారేస్తా!" ఉక్రోషంతో ఊగిపోతున్నాడు నడివయసు యాచకుడు. వాడి వాదనతో అక్కడున్న యాచకులందరూ "ఇక్కడకు రావద్దు" అంటూ తలోవిధంగా తిడుతున్నారు.**

"ఒరే! ఇదేం బజారనుకున్నారా...మీ ఇష్టం వచ్చినట్టు గొడవపడుతున్నారు. గుడిముందు ఏమిట్రా మీ దౌర్జన్యాలు. అందరూ జానెడు పొట్టకోసమేగా. దాని కడుపూ నిండాలిగా!" అన్నాడు పెద్దాయన. "అందరూ అడుక్కునే వెధవలేగదా కలిసి ఉండలేరూ?" ఈసడించుకుంది పెద్దామె.

"ఏం చెప్పమంటావు తల్లీ. మనిషిగా వచ్చి అడుక్కుంటే అంతగా పట్టించుకోం. అదో.... ఆ ఆవుని తోలుకొస్తుంది. దాని ముఖానికి అంత పసుపు, కుంకుమా పెట్టి దాన్ని పక్కన పెట్టుకుని 'అమ్మా! గోమాతకింత దానం చెయ్యి తల్లీ!' అనగానే గుడికి వచ్చిన ఆమ్మోర్లంతా ఆవునుదురు, మూపురం, తోక తాకి దండం పెట్టుకుని దానికో పండో కాయో రూపాయో ఇస్తున్నారు. ఇహ మేం ఏం గావాల" అంది గద్గదస్వరంతో ఓ బిచ్చగత్తె.

"మా గోడు ఎవరు వింటారు బాబూ. తమరే ఓ దారి చూపించండి"

"ఔను బాబూ!" అందరూ అర్థించారు.

"వేళా పాళా లేకుండా, సమయం సందర్భం చూడకుండా రచ్చచేస్తే నష్టం మీకే. అంతా సామరస్యంగా మాట్లాడుకోవాలి. ఆలోచించండి. ఇది ఇట్లా తేలేది కాదు. రేపు ఇక్కడే అదో, ఆ రాగిచెట్టు యాపచెట్టు అరుగుమీద కూర్చుని తేలుద్దాం. పొద్దుట కలుద్దాం...సరేనా!"

"బాబూ మేమంతా అడుక్కుతినేవాళ్ళం. మీలా మేము డ్యూటీకి బారెడు పొద్దెక్కి పోలేం గదా!" పొగరుగా అన్నాడొకడు. వాడి వాలకం చూస్తే తాగుబోతులా ఉన్నాడు.

"మీకు డ్యూటీ లేంటి?" ఆశ్చర్యంగా అడిగింది పెద్దామె.

"అదే తల్లీ అడుక్కోను...పొద్దు పొడవగానే జోలెలతో వీధిన పడాలి. లేకుంటే మారాజులు అమ్మయ్యలూ ఆఫీసులకెల్లాక అడుక్కోను ఎక్కడికి పోతాము"

"మీకూ టైమింగ్స్ ఉన్నాయా.... సర్లే మీరే చెప్పండి ఎప్పుడు కలుద్దాం"

"రేపు మద్దేనం ముద్ద నోట్లో ఏసుకుని ఈడకు చేరుకుంటాం. పెద్దోరు పెద్ద మనసుతో వచ్చి మా తగవు తీర్చండి" అంది ముసల్ది. "సరే! రేపు మీరంతా...ఒసే నీ పేరు....ఏద్దైతే ఏంటే

గోమాతా! నువ్వూ రావాలి. ఈడ అదో ఆ చెట్ల కింద చేరాలి"

"అలాగే బాబూ" అన్నారంతా. పెద్దాయన పెద్దామె నెమ్మదిగా ఇంటిదారి పట్టారు. యాచకులంతా యాచనలో పడ్డారు.

"కోడలు ఆఫీసునుండి వచ్చి వంటలో మునిగి తేలుతూ ఉంటుంది. పిల్లలు ట్యూషన్ల నుండి ఆవురావురుమంటూ వస్తారు. పదండి. మీరు వీళ్ళతో పంచాయతీ పెట్టుకున్నారు"

"పంచాయతీ నేను పెట్టుకోలేదు. గుడి ముందు గొడవ ఎందుకని"

"మనకెందుకొచ్చిన గొడవ?" పెద్దామె మందలింపు.

"మనకు గొడవ రాలేదు. గొడవ పడుతున్న వాళ్ళనలా వదిలెయ్యడం తగదు. గొడవని సద్దుమణిగించాలి. అది ఆలుమగల మధ్యగానీ, రెండిళ్ళ మధ్యగానీ, రెండు వీధుల మధ్యగానీ, రెండు కులాల మధ్యగానీ....రెండు మతాల మధ్యగానీ..."

"ఇంక చాలు ఆపండి. మీకేమీ పనిలేక అందరి విషయాల్లో తలదూరుస్తున్నారు" నిష్ఠూరమాడింది పెద్దామె.

"నిజమే! అలా అని ఊరకే తిని కూర్చుంటే ఎలా? పని కల్పించుకోవాలి. మన ఊళ్ళో నేను ఒక్కడినే సేద్దెగాడు లేకుండా రెండెకరాల వరి, మూడెకరాల మెట్టసాగు చెయ్యాలా"

"ఆ రోజులు పోయాయి. నీళ్ళు లేక భూములు బీడుపడిపాయె. పొలాలతో పాటు మన బతుకులూ ఎండిపాయె"

"ఓసారి మనూరు పోయి రావాలె"

పెద్దామె నవ్వింది.

"నవ్వులాటగాదు. ఈసారి సంక్రాంతికి పోదాం!"

"అలాగే. పదండి లోపలికి ఇల్లొచ్చింది"

పల్లె కలల నుండి బైటపడేసింది పెద్దామె.

రంగదాసు తండ్రిలాగే భూమినే నమ్ముకున్నాడు. తల్లిదండ్రులతో తనను నమ్ముకువచ్చిన లక్ష్మితో ఉన్న రెండెకరాల మాగాణితో కుటుంబానికి సరిపడా తిండి గింజలేకాదు, కూర నార గుడ్డా గుసురూ దేనికీ లోటు లేకుండా సంసారం లాక్కొచ్చాడు. బతికినంతకాలం తల్లిదండ్రులకు ఏ లోటూ లేకుండా చూశాడు. ఇహ మిగిలింది కట్టుకున్న భార్య, ఇద్దరు కూతుళ్ళు, ఒక కొడుకు. వ్యవసాయం, బతుకులో రతనాలు పండించాక రాను రాను ఉన్న సిరినీ శక్తినీ కరగదీసే దీర్ఘవ్యసనంగా మారిపోవడం గమనించి పిల్లల్ని చదువులబాట పట్టించాడు. ఆడపిల్లలకు చదువులు అబ్బలేదు. ఆలస్యం చెయ్యకుండా కాస్త పచ్చగా ఉన్నప్పుడే వాళ్ళ పెళ్ళిళ్ళు చేసి కొంత బరువు తగ్గించుకున్నాడు. ఇహ మిగిలింది కొడుకు, వాడి చదువు.

కరిమింగిన వెలగపండులా పచ్చని సేద్యం డొల్లైంది. చెరువులు, ఏర్లు, వంకలు ఎండిపోయె. బావుల్లో నీళ్ళు ఇంకిపోయె. వ్యవసాయం జూదమనబట్టిరి. వ్యవసాయం దండగనిరి పెద్దలు. వ్యవసాయం దండగైతే మరి కడుపెట్టా నింపుకోవాలో ఆ పెద్దలు చెప్పకపోయిరి.

సాఫ్ట్‌వేర్ కాదు, హార్ట్ వైర్లతో వ్యవసాయాన్ని షట్‌డౌన్ చేసిరి.

చిన్న చితక రైతులు బతకలేక ఉన్నదంతా అమ్ముకుని పట్నాలకు ఎగబాకిరి. కొడుకు చదువు కోసం, ఆ తరువాత ఉద్యోగం కోసం చేసిన అప్పులకు వడ్డీలు పెరిగి మనిషి మొత్తాన్ని మింగక ముందే మేలుకుని, వచ్చింది చాల్లే! అని అద్దు

**వేంకటేశ్వరస్వామి ఆలయం వెలుపల యాచకులతో కోలాహలంగా ఉంది. వారంలో ఏదో రెండు రోజులు, పండగలు, పర్వదినాలప్పుడు తప్ప భక్తుల రద్దీ ఉండటం లేదు. దాంతో యాచకులమధ్య పోటీ వచ్చింది.. వాళ్ళంతా ఏకమై గోమాతను వెంటేసు కొచ్చిన ఓ కొత్త యాచకురాలిపై సామూహిక దాడికి దిగారు. ఆమెను తరిమికొట్టే పనిలో పడ్డారు. సరిగ్గా అప్పుడు ఏం జరిగిందంటే....**

మానంగా భూములు తెగనమ్మి కొడుకు పంచన చేరారు. లంచాలతో కొన్న ఉద్యోగమే కొడుక్కి బతుకు తెరువు, వాళ్ళకు చావకుండా బతికే ఇరుకు దారి చూపించింది. ఆ దారిలోనే అలుపెరుగని పయనం. వ్యవసాయంతోపాటే మనుషుల్లో ఆప్యాయతలూ కరిగిపోయాయి. బతుకుభారమైంది. కనిపించని కరువుదాడి చాలామందిని పల్లెల నుండి తరిమేసింది. ఉన్నదంతా అమ్మి కొడుకు చేతిలో పోసినా ఈసడించుకునే కోడలు, అన్నీ చూస్తున్నా ధృతరాష్ట్రుడిమల్లే గుడ్డివాడైన కొడుకు ప్రవర్తన పెద్దాయనను, పెద్దామెను కృంగదీసింది. అయినా ఏదో బతుకు వెళ్ళదీను ఒకపూట తిని మరోపూట మాని...ప్రశాంతత పేరుతో దేవాలయాలు, పార్కులు వీధులు పట్టుకుని తిరుగుతూ ఉంటారు. ఒకరు శుక్రవారం ఉపవాసం ఉంటే, ఒకరు శనివారం ఉపవాసం ఉంటారు. అసలు రెండు పూటలా భోజనం అంత ఆరోగ్యం కాదు. అందుకే ఒకపూట గుడిలో ప్రసాదాలతో సరిపెట్టుకుంటారు. చాలామందికి ధ్యానాలు భజనలూ ఆ కోవలోనే సంతృప్తిపరుస్తున్నాయేమో!

చరచరలాడుతూ తెల్లవారింది. కొడుకు, కోడలు ఆఫీసులకు పోను పరుగులు తీశారు. ఆ వేగానికి అనువుగా ఆహార వ్యవహారాలు అమర్చడం, పిల్లలను స్కూళ్ళకు ముస్తాబు చెయ్యడం ముసలాళ్ళపని. నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని ఆయాసపడుతూ బస్సులకోసం కొడుకూ కోడలూ పరుగెత్తుతారు. ఇక అప్పుడు గాలిపీల్చుకుని నింపాదిగా తమ పనులు చేసుకోవడానికి అలవాటు పడ్డారు వాళ్ళిద్దరూ. ఒంటిచేత్తో సేద్యం చేసినవాళ్ళకు ఈ వంటపనీ, ఇంటిపనీ ఒక లెక్కగాదు. కాకపోతే 'ఆప్యాయతతో ముభావంగా మారిపోవడం చూసి ఇది కాలం తెచ్చిన మార్పో, తమ తలరాతో అర్థం కాక తమ బాధ పంచుకునే మనిషి దొరక్క ఇరుగు పొరుగుతో మాట్లాడితే తన గురించే అనుకుని రుసరుసలాడే కోడలు, 'ఇక్కడ మనూర్లోలా కాదు. ఎవరితోనూ మాటలు పెట్టుకోకండి!' అనే కొడుకు విపరీత ధోరణికి విస్తుపోయి మూగగా ఇంట్లో వాళ్ళిద్దరే నోరు తెరవను, గాలి పీల్చను, మనసు తేలికపరుచుకోనూ కోవెలే ఒక ఒయాసిస్సయిందా ఎడారి బతుకుల్లో.

"త్వరగా తెములు. రెండు గంటలకల్లా గుడికి పోవాలి"

"మీరు వెళ్ళండి. నాకు ఓపిక లేదు!"

భోజనం చేసి పెద్దాయన గుడికి బయలుదేరుతూ "సాయంకాలానికి వచ్చెయ్. నేను అక్కడే ఉంటా!" అన్నాడు. "సరే, కోడలు రాగానే అటు వస్తా!" రోజూ చేసే పని అదే. కోడలు చిరాకు చూడలేక ఆమె రాగానే దేవుడి పేరుతో గుడికిపోవడం పెద్దాయనకు, పెద్దామెకు అలవాటైన అవసరం.

ఎండాకాలం కాకున్నా ఎండ తన ప్రతాపం చూపుతోంది. కాలాన్నిబట్టి ఎండ, వాన, చలి, గాలిరావడం అరుదయ్యాయి. అన్ని కాలాలూ



## ఆరిపోని అల్లావుద్దీన్ అద్భుత దీపం!




నేనూ ఆమే
కలిసి నడుస్తామా
ఒక నది ప్రేమగా
మమ్మల్ని అనుసరిస్తది!
హృద్యంగా ఇద్దరమే



నిశ్శబ్దంగా మాట్లాడుకుంటామా
పూల పరిమళమొకటి
విసురుగా చుట్టేస్తది!
ఆమె సమూహంలో ఉండనీ
పక్కన ఖాళీ స్థలమొకటి
నా కోసం నిలువుకళ్ళతో
ఎదురు చూస్తూనే ఉంటది!
ఆకలవనీ దాహమవనీ
అలవికాని వేదనవనీ
ప్రత్యామ్నాయం లేకుండా
ఆమెనే గుర్తొస్తది!
ఒక్కోసారి ఇద్దరం
తీవ్రంగా యుద్ధం చేస్తామా
నేనెక్కడ ఓడిపోతానేమోనని
తానే తెల్లజెండా ఎగరేస్తది!

ఒకటా రెండా
ఎన్నని చెప్పను?
ఆమె ఎప్పటికీ నాచేత చిక్కిన
ఆరిపోని అల్లావుద్దీన్ దీపమే!!

—కోట్ల వెంకటేశ్వరరెడ్డి
సెల్: 94402 33261

ఎండాకాలమే అనిపిస్తోంది. పెద్దాయన రాక చూసి గౌరవ సూచకంగా యాచకులు లేచి చేతులు జోడించారు.

"అంతా వచ్చారా. అది...ఆవుని తీసుకొచ్చిందే. నువ్వు ఒక్కదానివీ రాక అదెందుకే?"

"దాన్నొదిలి నేనుండలేను. నన్నొదిలి అదుండదు సామీ"

"సరే సరే!" అంటూ రాగిమాను వేప చెట్టుకు కలిపి కట్టిన రచ్చబండమీద కూర్చున్నాడు.

"ముందు మీరే చెప్పండిరా! ఏమిటి మీ బాధ. అదీ మీలాగే అడుక్కుంటే ఏం?"

"సెమించాలయ్యా! ఉన్నది ఉన్నట్టు సెబుతాను. మరోలా అనుకోకండి" తాగుబోతు వెధవ లేచాడు.

"ఒరే అప్పుడే ఏసుకున్నావా?"

"ఎప్పుడూ ఏసుకునే ఉంటాను బాబూ, సెమించాల"

"అడుక్కునేవాళ్ళు తాగడమేమిట్రా!"

"అడుక్కునేవాడికి దాహమెయ్యదా? అడుక్కునే వాడికి ఇల్లూ, వాకిలీ ఆడదీ వద్దా? ఇంత గుడ్డ పీలిక కోరుకోకూడదా? బతుకులేక బతకలేక పడే బాధలు ఎట్లా మరిసిపోతాం. గాలికి పుట్టినోల్లం. మాకూ కోరికలుంటాయి. అవి తీరవు. తీరవని తెలిసినా సంపాదనంతా తినడానికీ, తాగడానికే...."

"ఒరే, ఆగు. ఆపు నీ తాగుడు కతలు" మందలించాడు ముసిలోడు.

"చెప్పనీ...." అన్నాడు పెద్దాయన.

"ఏంలేదు బాబు, గుడి పుట్టినప్పటినుండీ శ...శ... మేం పుట్టినప్పటినుండీ ఈ గుడిమెట్ల కిందే మా బతుకుల్ని అడుక్కుంటున్నాం. దయగల తల్లులు, తండ్రులు ఏదో జాలిపడో పున్నెంకోసమో అంత ఇస్తున్నారు. రోజు రోజుకూ జనంలో భక్తి తరిగిపోతోంది. గుడికివచ్చే జనం తగ్గిపోయారు. ఒక్క శుక్రవారం, శనోరం లేదా పండగలప్పుడే కలకలలాడుతుంది కోవెల. ఆ రోజుల్లోనే మా బొచ్చెల్లో గలగలలు. ఇది ఆవుని పట్టుకు తయారవడంతో వచ్చే అమ్మయ్యలంతా దానికే పండో కాయో లేదంటే ఒక రూపాయో ఏసి గోమాతకు దండం పెట్టిపోతున్నారు. మా నలుగురిదీ ఒక్కత్తే మింగేస్తోంది బాబూ"

"మందెక్కువైతే మజ్జిగ పలచబడుతుంది. అడుక్కునే జనం ఎక్కువైతే వాళ్ళ కడుపులే ఎలితి పడేది"

"అందుకే కొత్తవాళ్ళు మా గుడి ముందు అడుక్కోవడం కుదరదు"

తలా ఒక మాట అన్నారు పాతవాళ్ళు.

"బాబూ గుళ్ళూ గోపురాలూ ఒకరి జాగీరా! ఎవరైనా గుడిని చేరి దండం పెట్టుకోవచ్చు. కావాల్సింది అడుక్కోవచ్చు. దేవుడికి కొత్తాపాతా లేదు. ఇచ్చే ఆసాములకు భేదం లేనప్పుడు వీళ్ళకెందుకు బాధ" తెలివిగా అంది గోమాత.

పాతజనం ఒక్కసారిగా గోమాతమీదకు లేచారు బండబూతులు తిడుతూ. "ఆగండి. ఆమెను ఏమీ అనకండి" పెద్దాయన హెచ్చరిక చేశాడు. ఆవేశం దిగమింగి అంతా శాంతించారు.

"మనం మనుషులం. అది మరచిపోకండి. ఈ లోకంలో మనుషులంతా ఏదోవిధంగా బతకాల్సిందే. బతికే బతుకంతా ఒక్కటి కానట్టే మనుషులూ ఒక్కటి కాదు. మనుషులు మతాలవారీగా, కులాల వారీగా చీలిపోయారు. ఇది ఉన్నవాళ్ళ పరిస్థితి.

అడుక్కునే వాడికి మతం లేదు. కులం లేదు. గుడి దగ్గరైనా మసీదు దగ్గరైనా చర్చిదగ్గరైనా ఆ మతం వాళ్ళే అడుక్కుంటున్నారా! అన్ని మతాల వాళ్ళు, కులాలవాళ్ళు బతకడంకోసమే అక్కడ వాలుతున్నారు.

ఆకాశం, భూమి, నీరు, నిప్పు, గాలి అందరిదీ. ఏ ఒక్కరి సొంతమూ కాదు. అలాగే, దేవుడు, దేవుడి గుళ్ళు.

ఆకలి అందరికీ సమస్యే. సమస్యను సామరస్యంగా పరిష్కరించుకోవాలి. అందరూ కలిసి ఆకలిని జయించాలి. అప్పుడే మనం నిజమైన మనుషులం. ఏమంటారు?"

"తమరు చెప్పింది తెలిసినట్టే ఉందిగానీ, మనసులో ఇమడలేదు" అన్నాడు ముసలోడు.

"అంతా కలిసి బతకాల. ఎవరూ ఎవరి కడుపూ కొట్టకూడదు. అదీ సారం"

"సారాలాగా ఇనడానికి సొంపుగా ఉంది పెద్దాయనా...కానీ ఎలా.." అడిగాడు సారా ప్రియుడు.

"చెబుతా. ముందు ఆమె కథ విందాం!"

**ఆమె కథ**

"నేనూ నా మొగుడు, కొడుకు ముగ్గురం మూడు రకాలుగా కష్టపడేవాల్లం. ఊర్లో అందరికన్నా నాలుగు గింజలు ఎక్కువ పండేది మా పొలం. కానీ పొలానికి నీటి ఆదరువు లేదు. శాన్నాల్లనుండి ఓ బోరు ఏయిస్తే పొలమూ తడుస్తది, మా కడుపూ సల్లబడుతుందని ఆశపడ్డాం. పిల్లగాడికి పెల్లికి కట్నం లచ్చ రూపాయలు ఇచ్చిరి. కోడలు లచ్చిందేవిలా మా ఇంటికొచ్చిందని సంబరపడ్డాం. నలుగురం పొలాన్ని కలిసి దున్నాం. సుక్కవాన రాలా. ఊరించి ఊరించి ఆకాశం మెరిసింది. మబ్బులు మూటగట్టినట్టు వాలిపోయాయి. వాన ఆలస్యంగానైనా వచ్చింది. గింజలు ఏసినాం. అదునుకు మల్లీ పదును వాన. మా లచ్చిందేవి వచ్చిన ఏలని మురిసిపోయాం. ఆ తరువాత వానలు బిగదీశాయి. పచ్చని జొన్నచేను ఎండబట్టె. సూసేకొద్దీ కడుపు తరుక్కుపాయె.

"ఒరే నరసింవా! మనం బోరు ఎయ్యాలి. లేదంటే ఎండిపోతాం!" అన్నాడు నా మొగుడు.

"ఏద్దాం. నలుగుర్ని ఇసారించు ఏద్దాం" అన్నాడు కొడుకు.

## సౌత్‌కి వస్తానంటున్న ఆలియా!

నిన్న మొన్నటి వరకూ ఉత్తరాది భామలకు దక్షిణాది సినిమాలు పెద్దగా కనిపించేవి కావు. కానీ 'బాహుబలి 2' తరువాత ఉత్తరాది హీరోయిన్లకు దక్షిణాది సినిమాలంటే ఆసక్తి అమాంతం పెరిగిపోయినట్టుంది. అందుకే ప్రభాస్‌తో అవకాశం వస్తే దక్షిణాది సినిమాల్లో నటించడానికి తాను సిద్ధం అంటూ ఆలియాభట్ ఓపెన్‌గా చెప్పేసింది. దక్షిణాది హీరోలలో ప్రభాస్ అంటే తనకు ఇష్టమనీ, అతడితో నటించే అవకాశం వస్తే ఎట్టి పరిస్థితుల్లోనూ వదులుకోననీ స్పష్టం చేసింది.



"సెబాస్ ఎయిరా! దరిద్రం తీరిపోద్దని కొందరు, ఒరే ఎందుకురా ఉన్న నాలుగురాల్లూ గుంతలో పోస్తావు? అని కొందరూ అటూ ఇటూగా చెప్పిరి. ఒకరితో ఏంటని బోరు ఏద్దామనుకుంటిమి. ఊర్లో దొరతానకు బోయి బోరు మిసను మాట్లాడు కుంటిమి. బోరు మిసను పొలంలో దిగి దడ దడ లాడించింది. అలా మూడు గంటలు తెగింది. ఆ తర్వాత తెగడం లేదు.

"బండ పడింది!" డ్రిల్లింగోడి అరుపు.

"ఏం చేద్దాం. ఆపేద్దామా? ఇంకా లోపలికి పోదామా?"

"పోనీ దిగాక ఎనక్కు పోవడం ఎందుకు? లోపలికి పోనీ..." అనిరి కొడుకు, మొగుడు.

అయిదారుగంటలు బండను బద్దలుగొట్టి లోపలికి దిగింది. సుక్కనీరు అందలా.

"ఇంక లాభం లేదు" తేల్చేశాడు డ్రిల్లింగోడు.

"మా బతుకులమీద బండ పడింది. ఉన్న సొమ్ము పోయి దిగులుపడి దిబ్బయినాము"

"మరోచోటు చూసి ఎయ్యండ్రా బోరు. అప్పోసప్పో చెయ్యండి' అనిరి నలుగురూ.

ఊర్లో బాంకీల సుట్టూ గవర్నమెంటు సుట్టూ తిరిగినా, కాళ్ళరిగాయిగానీ రాగి దమ్మిడీ పుట్టలేదు. అప్పుడు వాలిపోయాడు దొర.

"ఎంతగావాలో తీసుకో. బోరు ఎయ్. ఈసారి నీళ్ళు పడతాయి. నీళ్ళు పడ్డప్పుడే ఇద్దువుగానీ పైసలు. ఇప్పుడు నీతానున్నవి ఇయ్. లేదా పేపర్ రాద్దాం" అని కొత్త ఆశలు రేపాడు.

దొరతాన తనకాపెట్టి మరోమూల ఏసినాము. అయిదొందలు అడుగున కూడా నీల్లు తగల్లా.

"ఒరే మీ ఆశగాకపోతే పక్కన దొర పొలాల్లో నాలుగు బోర్లు ఎయ్యి అడుగులు లోతుకేసి నీల్లు లాగేస్తుంటే నీకు యాడనుండి వస్తాయిరా" అని తిట్టిరి.

"ఒక్కడూ ముందీమాట చెప్పలేదేంట్రా!"

"కనిపిస్తున్న సత్తెం. నాలుగు పైసలుండాయని ఎగిరిపడితివి. అవి యాడికి చేరాల్నో ఆడికే చేరిపాయె" అని నిష్టూరాలాడిరి.

మా రాత బాగాలేదు.

దొర పిలిసి "ఓ పని చెయ్యండిరా, నీ పొలానికి నా బోరునీల్లే పారిస్తా. పంట చెరి సగం" అన్నాడు.

దొరమాట కాదనలేక మరోదారి లేక 'సరే!' అన్నాం. 'ఏదో ఒక దారి దొరికింది కదా బతకను' అని. నలుగురం కలిసి ఎంత కష్టపడినా ఏటికేడు బతుకు హీనమైంది. అప్పు వడ్డీలతో పెరిగిపోయింది. "మీరింక వ్యవసాయం చెయ్యలేరుగానీ నా దగ్గరే పాలేరుగుండండి. ఆడోళ్ళుకూడా" అన్నాడు దొర.

ఆడిబుద్ధి తెలిసిందే. ఆడోళ్ళక్కడ పని చెయ్యడమంటే ఇజ్జత్ పోయినట్టే.

ఏం చెయ్యనూ చేతగాక పొలంలో పురుగుల మందు తాగాడు కొడుకు. కొడుకు చావు చూసి నిలువరించుకోలేకపోయాడు నా మొగుడు. ఇద్దరూ బుగ్గయ్యాక ఇంక ఆడ మాకు బతుకుదారి ఎట్టా. అప్పుకింద పొలం జమైంది. ఉన్న ఎద్దుల్ని గంగిరెద్దులోల్లకు అమ్ముకున్నాం. ఈ ఆవు ఒట్టిపోయినా మాకింత ఆదరువైంది. సెప్పండి బాబు ఎలా బతకాల. మొగుడు సచ్చినముండలం. అందునా అది వయసునుంది. దాన్ని కాసుకోను ఊరొదిలి ఇలా అడుక్కుంటూ బతుకును వెతుకులాడుతున్నా" కన్నీరు మున్నీరైంది గోమాత.

ఆమె కష్టం అందరినీ కదిలించింది. అందరి కంటా తడి తగిలింది.

"రైతులు సస్తున్నారు. సస్తున్నారు అంటే పంటలు పండకుంటే సావాలా! అనుకునేవాన్ని. వాళ్ళ బతుకుల్ని తోలుబొమ్మలు జేసి, ఆడించే వాళ్ళు చంపుతున్నారని తెలియకపాయె" సారా మత్తు వదిలించుకున్నవాడు కనుగొన్న సత్యం.

"సర్లే బతకనీ. ఈడే ఉండు మాతోపాటే మీరూ బతకండి" అన్నాడు ముసలోడు.

"శభాష్ రా, మీరు నిజమైన మనుషులు. మనిషికి మనిషి తోడుండేవాడే దేవుడురా..... మీరంతా"

"దయ్యాలం కాదు. మనుషులం. మామూలు మనుషులం. సారా తడారిపోయిన వాడి వాక్కులు.

అంతా లేచారు. గోమాతని గోవుని చేరి మూగవేదనతో జీవితానికి భరోసా ఇస్తున్నారు. ఈ గడ్డమీద రైతు బతకలేక చస్తున్నాడు. ఒక్క బక్కరైతులేనా బతకలేకపోతోంది? బతకడం బలహీనతైంది. చావడం అమరత్వమైంది. జీవితంలో చావు అనివార్యమైనదే కావచ్చు. దాన్ని ప్రతి సమస్యకూ ఆదర్శంగా మలుచుకుంటున్నారు జనం. ఇక్కడ ఆత్మహత్యలు, చావులు, ఆదర్శాలు, అమరత్వాలుగా రూపాంతరం చెంది జీవితానికి వికృతమైన ముగింపునిస్తున్నాయి. ప్రస్తుతం సమాజానికి సోకిన గత్తరు ఇది. నిట్టూర్చాడు పెద్దాయన.

**సెల్ 9440234491**




## ఇండోర్ థీమ్ పార్క్



సరదా సరదా రైడ్లు, భయంగొలిపే హాంటెడ్ హౌస్‌లు, హుషారెత్తించే అడ్వెంచర్ ఆటలు... అమ్యూజ్‌మెంట్ పార్కుల్లో సందడిచేసే విషయాలే ఇవి. మామూలుగా అమ్యూజ్‌మెంట్ పార్కులు పెద్ద ఖాళీస్థలంలో ఓపెన్‌గా ఏర్పాటు చేస్తారు. కానీ ప్రపంచంలోనే పెద్ద ఇండోర్ థీమ్ పార్క్ దుబాయ్‌లో ఏర్పాటుచేశారు. పేరు 'ఐఎంజీ వరల్డ్ ఆఫ్ అడ్వెంచర్'! ఇది ఏకంగా 15 లక్షల చదరపు అడుగుల విస్తీర్ణంలో ఉంటుంది. ఇక్కడ నాలుగు విభాగాలుంటాయి. ఒక్కొక్క విభాగాన్నీ ఒక్కో ప్రత్యేక అంశంతో తీర్చిదిద్దారు.

కార్టూన్ నెట్‌వర్క్, మార్వెల్ కామిక్స్ విభాగాలు వందలాది కార్టూన్ పాత్రలతో సందడిగా ఉంటాయి. ఐరన్ మ్యాన్, బ్యాట్‌మాన్, స్పైడర్ మ్యాన్, బెన్ 10వంటి ఎన్నో కార్టూన్ పాత్రల బొమ్మలతోనే గుండెలదరగొట్టే రైడ్లు, కళ్ళు తిరిగే రోలర్ కోస్టర్లు ఉంటాయి.

లాస్ట్ వ్యాలీ డైనోసార్ అడ్వెంచర్‌లో రాకాసి బల్లుల శిల్పాలు అటూ ఇటూ కదులుతూ నిజమైన డైనోసార్లలాగా అనిపిస్తుంటాయి. వీటితోనూ బోలెడు ఆటలుంటాయి. ఇవే కాదు హంటెడ్ హౌస్ వంటి ప్రత్యేక ఆకర్షణలు కూడా ఉన్నాయి. ముప్ఫై వేల మంది ఒకేసారి ఈ పార్కును సందర్శించవచ్చు.

## నవ్వుతూ స్వాగతిస్తాయి



పచ్చటి లాన్, వరండా...బయటినుంచి చూస్తే మామూలు ఇల్లులానే కనిపిస్తుంది. లోపలికి అడుగు పెడితే చాలు మీరు ఊహించని రీతిలో ముచ్చటైన జోకర్ బొమ్మలు మీకు స్వాగతం పలుకుతాయి. ఎక్కడ? ఏమిటి? ఎలా? వివరాలు కావాలంటే మెక్‌మానిస్ గురించి తెలుసుకోవాల్సిందే!

కెనడా, ఒంటారియోలో నివాసముంటున్న మైకెల్ మెక్‌మానిస్ 25 సంవత్సరాలుగా ఈ జోకర్ బొమ్మల్ని సేకరిస్తోందట. ఇప్పుడు ఆమెకు 59 సంవత్సరాలు. సైకిల్ తొక్కుతున్న జోకర్, ఉయ్యాల ఊగుతున్న జోకర్...ఇలా ఎన్నోరకాల జోకర్లు ఆ ఇంటిని ఆక్రమించేశాయి. గోడలనిండా వాటి బొమ్మలే. వాటికి కొన్నింటికి సెపరేట్‌గా కుర్చీలు కూడా ఉన్నాయి. ఎప్పుడు ఎలా మొదలైందో తెలీదు కానీ వాటిని సేకరించటం హాబీగా మార్చుకుంది ఆవిడ. ఎన్నో రకాల హాబీలు.... వాటిల్లో ఇదొకటి.

## లిటిల్ ఏంజెల్

నదుల్లో మంచినీరు, సముద్రాల్లో ఉప్పునీరు సహజం. అయితే దీనికి భిన్నంగా పైన మంచి నీరు ప్రవహిస్తూ, కింద ఉప్పునీరు ప్రవహించటం ఎక్కడయినా విన్నారా? మెక్సికోలోని యుకటాన్ ద్వీపకల్పంలోని సెనోట్ అనే సింక్ హోల్ సంగతే ఇది. ఎన్నో ఏళ్ళక్రితం సున్నపు రాళ్ళు బద్దలై భూగర్భంలోంచి నీరు బయటకి రావడం వల్ల ఈ హోల్ ఏర్పడింది. ఇంకో విశేషం కూడా ఉందండోయ్... ఇక్కడ నీటి అడుగున చెట్లు ఉంటాయి. పైనుంచి వంద అడుగుల లోతు వరకు మంచినీరు, దాని కింద వంద అడుగుల లోతు వరకు ఉప్పునీరు కలిసిపోకుండా వేర్వేరు పొరల్లాగా ఉంటాయి. మధ్యలో హైడ్రోజన్ సల్ఫేట్ పదార్థంతో ఏర్పడిన మూడు అడుగుల మందపాటి పొర దీనికి కారణమట. దీనికి 'సెనోట్ ఏంజలిటా' అని పేరు కూడా పెట్టారు. అంటే ఆంగ్లంలో లిటిల్ ఏంజెల్ అని అర్థం. సృష్టి వింతలు బహువిచిత్రం కదూ!



## మార్జాల దైవం...!

విదేశాల్లో చాలామంది పిల్లుల్ని పెంచుకుంటారు. కానీ మనదేశంలో మాత్రం పిల్లిని అపశకునంగా భావిస్తారు. అయితే ఈజిప్టులో మాత్రం పిల్లిని ఏకంగా దైవంగా కొలుస్తారట. విడ్డూరంగా ఉందికదూ!

ప్రాచీనకాలంలో ఈజిప్షియన్లు పిల్లిని తమ రాజసానికి ప్రతీకగా భావించేవారు. వాటిని అత్యంత పవిత్రంగా చూసేవారు. ఎవరింట్లో పిల్లి ఉంటుందో వారిని అదృష్టవంతులుగా భావించేవారు. కాస్త ఉన్నవారయితే పిల్లులను ప్రత్యేకంగా ఆభరణాలతో అలంకరించి బైటకు తీసుకెళ్ళేవారట. తమ పెంపుడు పిల్లులు మరణిస్తే కుటుంబ సభ్యులు మరణించినట్టు బాధపడేవారట. ఏదైనా ప్రమాదం జరిగి పిల్లి మరణానికి కారణమైన వారికి మరణశిక్ష విధించడం వంటివి కూడా ఉన్నాయి.



## జైలోథీక్స్

మామూలుగా గ్రంథాలయానికి వెళితే ఒక్కో విభాగానికి సంబంధించిన పుస్తకాలు అరల్లో చక్కగా పేర్చి ఉంటాయి. అయితే జైలోథీక్స్‌లో మాత్రం అరల్లో పుస్తకాలకు బదులుగా కలప పుస్తకాలు దర్శనమిస్తాయి. 18వ శతాబ్దంలో జర్మనీలో మొట్టమొదటగా కలపను పుస్తకాల రూపంలో సేకరించడం మొదలైంది. ఈ కలప పుస్తకాల్లోనే వివిధ రకాల చెట్లకు సంబంధించిన ఆకులు, విత్తనాలు, ఫలాలు, పువ్వులు దాచి ఉంచారు. లైబ్రరీలో పుస్తకాలు ఎలా అమర్చుతారో.. అలానే ఈ కలప పుస్తకాలను అమర్చి ప్రత్యేకంగా పేర్లు కూడా పెట్టారు. ఈ లైబ్రరీలను 'జైలోథీక్స్' అనే పేరుతో పిలుస్తున్నారు. ప్రపంచంలోనే అతిపెద్ద జైలోథీక్స్, యేల్ విశ్వవిద్యాలయంలో ఉంది. ప్రపంచంలోని చెట్లు, వాటి వివరాలు, వాటి కలపకు సంబంధించిన సమాచారం మొత్తం ఈ జైలోథీక్స్‌లో లభిస్తుంది.

–నర్మద వాసిరెడ్డి



# ఆటో ఇమ్యూన్ డిజార్డర్

శరీరం వ్యాధుల బారిన పడకుండా కాపాడటానికీ, పోరాడ టానికీ ఒక రక్షణ వ్యవస్థ ఉంటుంది. ఆ రక్షణ వ్యవస్థ పొరబడి తన సొంత శరీరంపైనే దాడిచేసే థైరాయిడ్ సమస్యలు, రుమటాయిడ్ ఆర్థరైటీస్, తెల్లమచ్చలు, సోరియాసిస్ వంటి వ్యాధులువస్తాయి. అందుకే వీటిని ఆటోఇమ్యూన్ వ్యాధులంటారు. **కారణాలు:** బ్యాక్టీరియా, వైరస్, కెమికల్స్, వాతావరణ కాలుష్యం. వంశపారం పర్యంగా కూడా ఇది వచ్చే అవకాశం ఎక్కువగా ఉంటుంది. **లక్షణాలు:** కండరాల నొప్పి, నీరసం, జ్వరం, అలసట. కీళ్ళనొప్పులు, చర్మం, రక్త కణాలు, రక్తనాళాలు వంటి భాగాలు ఎక్కువ ప్రభావానికి లోనవుతాయి. **వ్యాధి నిర్ధారణ:** ఆటోయాంటీ బాడీస్ టెస్టులు, సిబిపి, సీరియాక్టివ్ ప్రోటీన్, ఈ.ఎస్.ఆర్. సిబిపి, ఎరిత్రోసైట్ సెడిమెన్‌టేషన్‌రేట్.

**కొన్నిరకాల ఆటోఇమ్యూన్ వ్యాధులు: రుమటాయిడ్ ఆర్థరైటీస్:** ఇదొక ఇన్‌ఫ్లమెటరీఆర్థరైటీస్, జీవక్రియలలో ఏర్పడే అసమతూల్యతవలన తలెత్తే ఈ ఆటోఇమ్యూన్ డిసీజ్, శరీరంలో ఇరు ప్రక్కలలో ఉండే కీళ్ళకు సమాంతరంగా వ్యాప్తి చెందుతుంది.

థైరాయిడ్ సమస్యలు: యాంటీబాడీస్ శరీరంలో తయారగుట వల్ల థైరాయిడ్ గ్రంథికి వ్యాపిస్తాయి. ఇది కొన్ని నెలలనుంచి కొన్ని సంవత్సరాలు పడుతుంది. రేడియేషన్ చికిత్స ఇచ్చినప్పుడు థైరాయిడ్ గ్రంథి దెబ్బ తిని హైపోథైరాయిడిజం రావచ్చు. హైపర్ థైరయిడ్ వచ్చినప్పుడు గ్రేవ్స్‌డిసిజ్అంటారు. **లక్షణాలు:**మలబద్ధకం, డిప్రెషన్,నీరసం,అలసట,వెంట్రుకలు రాలిపోవడం, గోళ్ళు విరగడం, కాళ్ళు, చేతులు వాయడం, గొంతు బొంగురు పోవడం. **వ్యాధి నిర్ధారణ:** టీ,టీ4, టీఎస్‌హెచ్ పరీక్షలు, లిపిడ్‌ప్రోఫైల్, సిబిపి, ఎల్.ఎచ్.టీ,ప్రోలాక్టిన్ మొదలైన పరీక్షలు చేయించుకోవాలి. **సోరియాసిస్:** సోరియాసిస్ అనేది దీర్ఘకాలపు చర్మ వ్యాధి. ఇది పొలుసుల మాదిరిగా వచ్చే చర్మవ్యాధి. దురద, ఎర్రమచ్చలు శరీరమంతా వ్యాపిస్తాయి. ఈ వ్యాధి స్త్రీ పురుషులకు సమానంగా వస్తుంది. సోరియాసిస్ వ్యాధి ఎక్కువగా మోచేతులు, మోకాళ్ళు, తల, వీపు, అరిచేతులు, అరికాళ్ళు, ఉదరంపై, మెడ, నుదురు, చెవులు మొదలైన ప్రాంతాల్లో వ్యాపిస్తుంది. **లక్షణాలు:** చర్మం ఎర్రబడటం, జుట్టు రాలిపోవడం, కీళ్ళనొప్పులు, చర్మం పొడిబారి నప్పుడు, చర్మంపై పగుళ్ళు, ఏర్పడంతో పాటు రక్తస్రావం అవుతుంది. **నిర్ధారణ పరీక్షలు:** స్కిన్‌బయోప్సి, ఈఎస్ఆర్, సిబిపి, ఎక్స్‌రే. **డయాబెటీస్:** టైప్-1 డయాబెటీస్ అనేది ఆటో ఇమ్యూన్ డిజార్డర్‌లో మరో డయాబెటీస్ అనగా షుగర్ వ్యాధి. ఇది ఏ వయసులోనైనా రావచ్చు, ప్రస్తుతం భారతదేశంలో ప్రతి వంద మందిలో 14 మంది డయాబెటీస్ బారిన పడుతున్నారు. ఇది ఇన్సులిన్ ఉత్పత్తి లోపం వల్ల జరుగుతుంది. వంశపారంపర్యంగా కూడా ఇది రావచ్చు. ఇప్పుడు 20-30 ఏళ్ళ వారిలో సైతం కనిపిస్తోంది. డయాబెటీస్ రెండు రకాలుగా ఉంటుంది. టైప్ 1, టైప్ 2.

**టైప్ 1:** 20 సంవత్సరాల లోపు వారిలో వచ్చే వ్యాధి. ఇది ఆటోఇమ్యూన్ డిసిజ్‌గా చెబుతారు. ఇది చిన్నపిల్లలో కనిపించే సమస్య కనుక అది వారి మానసిక, శారీరక పెరుగుదల మీద చాలా ప్రభావాన్ని చూపుతుంది.

**టైప్-2:** డయాబెటీస్ 20 సంవత్సరాలు పైబడిన వారిలో కనిపిస్తుంది, ఏటా 5.1 మిలియన్ల మంది డయాబెటీస్ వల్ల మరణిస్తున్నారు. 2030 వరకు ప్రపంచంలోని ప్రతి ఇద్దరిలో ఒకరు డయాబెటీస్ బారిన పడే అవకాశం ఉందని అంచనా. టైప్-1, టైప్-2, టైప్-3 డయాబెటీస్ కుడా ఉంది ఇది జెస్టేషనల్ డయాబెటీస్ ముఖ్యంగా గర్భిణుల్లో కనిపిస్తుంది.



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

**లక్షణాలు:** ఆకలి, నీరసం, దాహం ఎక్కువగా ఉండటం. అతిమూత్రం, కళ్ళుమసకగా కనిపించడం, బరువు తగ్గడం. తలనొప్పి, గుండెదడ, చెమటలు పట్టడం, గాయాలు నయం కాకపోవడం, కాళ్ళు, చేతులు తిమిర్లు రావడం, **నిర్ధారణ పరీక్షలు:** ఫాస్టింగ్ బ్లడ్ షుగర్, పోస్‌డియల్ బ్లడ్ షుగరం, గ్లూకోజ్ టాలరెంట్ టెస్ట్, యూరిన్ షుగర్ లెవల్, రావడమే షుగర్ లెవల్, బ్లడ్ యూరియా లెవల్స్, సిరమ్ పరీక్షలు.

**హోమియోచికిత్స:** హోమియో వైద్యవిధానంలో వ్యాధి లక్షణాలు, మానసిక, శారీరక స్థితిగతులు, ఆహార వివరాలను పరిగణలోకి తీసుకొని చికిత్స అందించడ్ జరుగుతుంది. ఆటోఇమ్యూన్ డిజార్డర్స్ అన్నింటికీ హోమియోలో మంచి మందులు ఉన్నాయి. వీటితో ఎలాంటి దుష్ప్రభావాలు ఉండవు, ఇది అనుభవజ్ఞులైన హోమియో వైద్యుని పర్యవేక్షణలో చికిత్స తీసుకుంటే ఆటోఇమ్యూన్‌డిసిజ్‌ను సమూలంగా నయంచేయువచ్చు, మన రక్షణ వ్యవస్థను పటిష్టం చేయడం వ్యాధి మూలాలకు చికిత్స చేస్తూ వ్యాధి తిరగబడకుండా చికిత్స చేయడం హోమియోపతి యొక్కప్రాధాన్యం.



# సంతాన భాగ్యం కలగదా?

**మాతృత్వం ఒక వరం. ఆ భాగ్యం కలగని దంపతుల బాధ వర్ణనాతీతం. గతంతో పోల్చితే ఇప్పుడు సంతానలేమితో బాధపడుతున్న వారి సంఖ్య పెరిగింది. అయితే సంతానం లేదని బాధపడుతూ కూర్చోవాల్సిన అవసరం ఇప్పుడు లేదు. సంతానలేమిసమస్యను దూరంచేయడానికిసంతాన సాఫల్యకేంద్రంచక్కగాఉపయోగపడుతుందనిఅంటున్నారు ఫెర్టిలిటీ నిపుణురాలుడా॥ సి.జ్యోతి.**

పెళ్లయి ఐదేళ్లవుతోన్న ఇంకా పిల్లలుకాలేదా? ఎన్ని హాస్పిటల్స్ తిరిగినా ఫలితం దొరకలేదా? సంతానలేమితో బాధ పడుతోన్న దంపతుల జీవితాల్లో వెలుగులు పూయాలంటే సంతానసాఫల్యతకేంద్రాలుఒక్కటేమార్గమనిఅంటున్నారు ఫెర్టిలిటీ నిపుణులు. దంపతులు సంతోషంగా వైవాహిక జీవితంగడిపిన తరువాతకూడా సంతానం కలగనట్లయి తే దానిని సంతానలేమి సమస్యగా భావించ వచ్చు, కొన్ని సందర్భాల్లో స్త్రీ పురుషుల్లోసమస్య లేకున్నా సంతానలేమికి కారణంకావచ్చు. **మహిళల్లోసంతానలేమికి కారణాలు:** ట్యూబల్‌బ్లాక్‌సంతానలేమికిఒకకారణం. ట్యూబులు మూసుకుపోవడం, అండం,శుక్రకణంతో కలిసి ఫలదీ కరణం చెందడానికి ముఖ్యమైన దారిగా ఉపయోగ పడేది ఫాలోపియన్ ట్యూబ్స్, ట్యూబర్‌క్యులర్ ఇన్‌ఫెక్షన్లు, మూత్రనాళ ఇన్‌ఫెక్షన్ల వల్ల ఈ ట్యూబుల్లో బ్లాక్స్ ఏర్పడిన పుడు అండంశుక్రకణంతోకలిసి ఫలదీకరణం చెందడం లో విఫలమవుతుంది. **ఫైబ్రాయిడ్స్:**ఫైబ్రాయిడ్స్‌ఉన్న వారిలో పీరియడ్స్‌సమయం లో తీవ్రమైన నొప్పి, సబ్ మ్యూకస్‌లో ఫైబ్రాయిడ్స్ ఏర్పడినపుడు.అబార్షన్‌జరగడానికి ఆస్కా రంఉంటుంది. ఒకవేళ సబ్‌సెరోసల్‌లో ఫైబ్రాయిడ్స్ ఉంటే పిండం ఎదుగుదలకు ఎటువంటి ఆటంకాలుం డవు. అందుకే ఫైబ్రాయిడ్స్ ఎక్కడఉన్నాయనేది చాలా కీలకాం శంగా ఉంటుంది. **ఎడినోమయోసిస్:** నెలసరిలోనొప్పి, దీర్ఘ కాలంగా పీరియడ్స్ ఉండటం, రక్తంలో ఇన్‌ఫెక్షన్ల కారణం గా పొట్టలో ఏర్పడే అడిహెసిన్స్‌వల్ల పీరియడ్స్ సమ యంలోనొప్పిఉండటంజరుగుతుంది.**పీసీఓడీ:**ఈ సమస్య ఉన్నవారిలో హార్మోన్ల అసమతుల్యతవల్ల అండాలు సరిగ్గా విడుదల కావు. పీరియడ్స్ కూడా సక్రమంగా రావు. అండాలువిడుదలకాకపోవడంతో గర్భం దాల్చే అవకాశం ఉండదు. **ఎండోమెట్రియాసిస్:** గర్భాశయంలోపల పొర లలో కనిపించాల్సిన కణాలు గర్భాశయం బయట అసహ జంగా తయారవుతాయి. దీనివల్ల పీరియడ్స్ సమయంలో విపరీతమైన రక్తస్రావం కనిపిస్తుంది. దీనివల్ల ఇన్‌ఫెక్షన్లు పెరిగిఅండాలుబలహీనపడతాయి. **ఆధునికపరిష్కారాలు:** సంతానలేమి ఉన్నవారికి ఇప్పుడు 3రకాల పరిష్కారాలు అందుబాటులో ఉన్నాయి. 1.ఐ.యు.ఐ 2.ఇక్సీ 3.ఐ.వి.ఎఫ్. **ఐ.యు.ఐ.** భర్త నుంచి సేకరించిన వీర్యాన్ని ల్యాబ్‌లో పరీక్షించి దానిలోనుంచి ఆరోగ్యంగా, చురుగ్గా, ఉన్న కణాలను మాత్రం వేరుచేసి సిద్ధం చేస్తారు. ఒక సన్ననిగొట్టం ద్వారా స్త్రీ గర్భాశయంలోనికి ప్రవేశపెడతారు. ఇలా ఒక నెలలో చేస్తే 15% వరకు సంతానం కలిగేఅవకాశాలుంటాయి. ఇలా 6 రుతుచక్రాల పాటు ఈచికిత్స చేసినా ఫలితంలేకుంటేఅప్పుడే ఐ.వి.ఎఫ్‌ద్వారాప్రయత్నించవచ్చు. **ఇక్సీ:** స్త్రీ నుంచి సేకరించిన అండాల్లోకి పురుషుని శుక్ర కణాన్ని ఒక ప్రత్యేకమైన మైక్రోమానిప్యులేటర్ సహాయంతో ప్రవేశ పెట్టి ఫలదీకరణం చెందిస్తారు. వాటిని తిరిగి గర్భాశయం లోకిప్రవేశ పెడతారు. ఈపద్ధతి ద్వారా 40% వరకు విజయావకాశాలుంటాయి. **ఐ.వి.ఎఫ్:** దీన్ని టెస్ట్ ట్యూబ్ బేబీ విధానం అంటారు. ముందుగా స్త్రీ నుంచి పక్వమైన అండాలను బయటకు తీసి పురుషుడి శుక్రకణాలలో బయటే ఫలదీకరణం చెందిస్తారు. ఇలా ఏర్పడిన తొలిదశ పిండాల్లో రెండు లేక మూడింటినితిరిగి స్త్రీ గర్భాశయంలో ప్రవేశపెడతారు. దీని ద్వారా 30 నుంచి 35%వరకు విజయావకాశా లుంటాయి. ఇటీవలి కాలం లో సంతాన సాఫల్యత చికిత్సలలో మరెన్నో కొత్త విధానాలు వచ్చాయి. ఫలదీకరించిన పిండాలలో గర్భా శయం లోకి ప్రవేశ పెట్టగా మిగిలిన పిండాలను అతిశీతల పరిస్థితుల్లో ఉంచి తరువాత వాటినే వాడటం జరుగుతుంది. అవసరాన్ని బట్టి అండాలనుగానీ,శుక్రకణాలనుగానిదాతలనుంచి సేకరించి వాడటం జరుగుతుంది. అందుకే సంతానం కలగడం లేదనిబాధపడుతూకూర్చోకుండాసంతానసాఫల్య కేంద్రం లో సంప్రదించినట్లయితే సంతానసాఫల్యం కలిగే అవకాశం లభిస్తుంది.

**– డా॥ సి. జ్యోతి** ఫెర్టిలిటీ స్పెషలిస్ట్
**ఫెర్టీ 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం**




**పశ్చిమ బెంగాల్‌లో తృణమూల్ కాంగ్రెస్‌ను ఓడించి అధికారంలోకి రావాలంటే బీజేపీ ఎంతో చేయాల్సి ఉంటుంది.**

**తర్వాత 'పశ్చిమ బెంగాల్ రాష్ట్రమే'నంటూ బీజేపీ అధ్యక్షుడు అమిత్ షా ఇటీవల బెంగాల్ నినాదం ఇచ్చిన కొద్ది రోజులకే ఆ రాష్ట్ర ముఖ్య మంత్రి మమతా బెనర్జీ 'ఢిల్లీని ఆక్రమిస్తాం' అంటూ గట్టి హెచ్చరిక జారీ చేశారు. నారదా కుంభకోణంలో 13 మంది తృణ మూల్ కాంగ్రెస్ అగ్రనాయకులు, మంత్రులపై సీబీఐ కేసులు పెట్టినప్పుడు కూడా మమతా బెనర్జీ ఈ రకమైన హెచ్చరికనే జారీ చేశారు.**

మమత తప్ప మిగిలిన అగ్ర నాయకులందరి పైనా సీబీఐ కేసులు పెట్టినప్పుడు ఆమె బీజేపీ ప్రభుత్వంమీద మరీ పేట్రేగిపోయారు. "కేంద్రం లోని బీజేపీ ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా మేం గొంతెత్తుతున్న దగ్గర నుంచీ మా నాయకులను వాళ్లు వేధించడం ప్రారంభిం చారు. ఎంత మంది నాయకులను జైళ్లలో పెడ తారు? దమ్ముంటే మా ఎంపీలు, మంత్రులు, ఎమ్మెల్యే లనందరినీ అరెస్టు చేయండి... మీరు మా నాయ కుల్ని జైళ్లకు పంపితే మేం మీ నాయకులందరినీ జైళ్లలో పెడతాం" అని ఆమె మండిపడ్డారు.

మమతా బెనర్జీ హెచ్చరికలను తాటాకు చప్పుళ్ల కింద తీసిపారేయొచ్చు. ఆమె కేంద్ర ప్రభుత్వం మీద విరుచుకుపడడం, అందులోనూ నరేంద్ర మోదీ సార థ్యంలోని ప్రభుత్వం మీద ధ్వజమెత్తడం కొత్త విషయ మేమీ కాదు. నిజానికి జాతీయ రాజకీయాల్లో ప్రవే శించడానికి గతంలో ఆమె అనేక పర్యాయాలు ప్రయత్నం చేసి భంగపడ్డారు. బీజేపీ అధికారంలోకి వచ్చిన తర్వాత ఇక అందుకు అవకాశమే లేకుండా పోయింది. మూడేళ్ల క్రితం అన్నాహజారేతో కలిసి ఢిల్లీలో రాంలీలా మైదానంలో జరిగిన ఓ పెద్ద ర్యాలీలో పాల్గొనడానికి ప్రయత్నించారు కానీ, ఆ ర్యాలీలో చివరికి ఖాళీ సీట్లే దర్శనమిచ్చాయి. ఆమె తీవ్రంగా నిరుత్సాహం చెందారు. ఇక నోట్ల రద్దును అడ్డుపెట్టుకుని ప్రతిపక్షాలన్నిటినీ ఒక తాటి మీదకు తెచ్చి 'మహా కూటమి' ఏర్పాటు చేయాలని సంకల్పించారు. కానీ, అది ఇంతవరకూ ప్రారంభం కూడా కాలేదు.

మొత్తానికి జాతీయ స్థాయిలో తృణమూల్ కాంగ్రెస్ ఇంతవరకూ సాధించిందేమీ లేదు. మధ్య మధ్య బీజేపీ వ్యతిరేక వ్యాఖ్యలేవో చేసి వార్తలకెక్క గలుగుతోంది. అంతే తప్ప, జాతీయ స్థాయి నాయకు రాలిగా గుర్తింపు పొందడం కానీ, ప్రతిపక్షాలను కూడగట్టడం కానీ ఆమెకు సాధ్యం కావడం లేదు. క్రమంగా ఆమె వ్యాఖ్యలకు కూడా విలువ లేకుండా పోతోంది. ఆమె లేనిపోని భయాలు, అనుమానాలు మనసులో పెట్టుకుని బీజేపీ మీద విరుచుకుపడు తున్నారని కూడా బెంగాలీ విశ్లేషకులు ఆక్షేపిస్తు న్నారు. అయితే, ఆమె వ్యాఖ్యల వల్ల ప్రయోజనం కూడా ఉందనిపిస్తోంది. ఆమె వ్యాఖ్యలు బీజేపీకి హెచ్చరికకింద ఎంతవరకూ ఉపయోగపడతాయో తెలియదుకానీ, పార్టీ శ్రేణులకు టానిక్ కింద మాత్రం ఉపయోగపడుతున్నాయి. బీజేపీ ఇప్పుడు తన దృష్టి నంతటినీ బెంగాల్ మీద కేంద్రీకరించ డంతో పార్టీ శ్రేణులలో ఆత్మవిశ్వాసం నింపడానికి మమత అడపాదడపా ఇటువంటి హెచ్చరికలు జారీ చేస్తున్నారనుకోవాలి.

### అమిత్ షా వ్యూహం

బీజేపీ నాయకులు తరచూ బెంగాల్ రాష్ట్రానికి రావడం ఎక్కువైంది. స్థానిక బీజేపీ నాయకులు కూడా తృణమూల్‌తో అమీతుమీ అన్నట్టుగా వ్యవహ రిస్తున్నారు. రాష్ట్రంలో పార్టీని విస్తరించడానికి ఈ నాయకులు ఆత్రపడుతున్నారు. అమిత్ షా ఈ మధ్య మూడు రోజుల పాటు బెంగాల్ పర్యటన చేయడాన్ని బట్టి బీజేపీ ఈ రాష్ట్రం మీద ఎంతగా కన్నేసిందో అర్థం చేసుకోవచ్చు. 2019లో జరగ బోయే లోక్‌సభ ఎన్నికల్లో పార్టీ గనుక మెజారిటీ సీట్లు సాధించగలిగితే భవిష్యత్తులో ఇది తమ దేశ వ్యాప్త విస్తరణకు ఎంతగానో ఉపకరిస్తుందని బీజేపీ భావిస్తోంది. ఈ లక్ష్యాన్ని చేరుకోవడం అంత సులభ సాధ్యం కాదని బీజేపీకి తెలుసు. అందుకనే బీజేపీ నాయకత్వం నువ్వా నేనా అన్నట్టుగా వ్యవహ రిస్తోంది. అయితే, మిగిలిన రాష్ట్రాల సంగతి ఎలా ఉన్నా, బెంగాల్‌లో మాత్రం బీజేపీ స్థానిక నాయ కత్వ పరిస్థితి పరమ అధ్వానంగా ఉంది. నాయకత్వప రంగా, సంస్థాగతంగా ఇక్కడ పార్టీ శైశవ దశలోనే ఉంది. ఒకపక్క స్థానిక నాయకత్వాన్ని బలోపేతం చేస్తూ మరో పక్క బెంగాల్‌లో పీఠం వేయాలంటే అంత తేలికైన విషయం కాదని బీజేపీ అధిష్ఠానానికి తెలుసు.

ఇటీవల కోల్‌కతా వచ్చినప్పుడు అమిత్ షా కొన్ని నిర్దిష్టమైన లక్ష్యాలను పార్టీకి నిర్దేశించారు. ముందుగా పార్టీ కార్యకర్తల సంఖ్య పెంచాలని ఆయన స్థానిక బీజేపీ నాయకులకు సూచించారు. అవసరమైతే ఇతర పార్టీల్లోని, ముఖ్యంగా తృణ మూల్ కాంగ్రెస్‌లోని అసమ్మతివాదులను గుర్తించి, పార్టీ వైపు మళ్లించేందుకు ప్రయత్నించాలని ఆయన సలహా ఇచ్చారు. ఆయన గతంలో ఇటువంటి వ్యూహాన్నే అమలు జరిపి విజయాలు సాధించారు. శాసనసభ ఎన్నికలకు ముందు కాంగ్రెస్ తదితర పార్టీల నుంచి సీనియర్ నాయకులు సైతం బీజేపీ లోకి క్యూ కట్టిన సందర్భాలు ఉన్నాయి. ఆయన ఇక్కడ కూడా ఇప్పుడు ఇదే వ్యూహం అనుసరిస్తు న్నారు. బెంగాల్‌లో పంచాయతీ ఎన్నికలు జరగడానికి ముందే పార్టీ సభ్యుల సంఖ్యను కోటి దాటించాలని ఆయన లక్ష్యంగా పెట్టుకున్నారు. బూత్ స్థాయి కార్యకర్తలు తమకు అనుకూలమైన ఓటర్లను గుర్తిం చాలనీ, ఇంటింటికీ వెళ్లి ప్రధాని మోదీ అభివృద్ధి నినాదాన్ని ప్రచారం చేయాలనీ ఆయన ఇటీవల ఇక్కడకు వచ్చినప్పుడు పార్టీ వర్గాలకు దిశానిర్దేశం చేశారు.




- రాజశుక

ఈ బూత్ స్థాయి ప్రచారంతో పాటు, బీజేపీ సిద్ధాంతాలను పెద్దయెత్తున ప్రచారం చేయాలని, తమకు ఎంత మద్దతు ఉన్నదీ అంచనా వేయాలని షా చెప్పారు. సభలు, సమావేశాలు, పార్టీ కార్యక్రమాలు, విలేకరుల సమావేశాలు వగైరాల ద్వారా పార్టీని విస్తరించడానికి, పార్టీని బలోపేతం చేయడానికి బీజేపీ ఓ ద్విముఖ వ్యూహాన్ని అనుసరిస్తోంది. ఒక పక్క అభివృద్ధి నినాదాన్ని చేపడుతూనే, మరో పక్క హిందువుల ఓట్లను కూడగట్టడమన్నది ఈ ద్విముఖ వ్యూహంగా బీజేపీ అమలు చేస్తోంది. బెంగాల్‌లో బీజేపీ విస్తరించడం, బలం పుంజుకోవడం ఖాయమని, అందుకు సంబంధించిన సూచనలు తమకు స్పష్టంగా కనిపిస్తున్నాయని అమిత్ షా కోల్‌కతా, ఢిల్లీలలో మీడియా సమావేశాల్లో ఆత్మవిశ్వాసం వ్యక్తం చేస్తున్నారు. "మూడు రోజులు బెంగాల్‌లో పర్యటించి వచ్చా. అక్కడి వాతావరణం క్రమంగా బీజేపీకి అనుకూలంగా మారిపోవడం నాకు స్పష్టంగా కనిపించింది. ఈసారి బెంగాల్‌లో బీజేపీ ప్రభుత్వం ఏర్పాటు చేయడం ఖాయం అన్న నమ్మకం కలుగుతోంది. బెంగాల్‌లో బీజేపీ ప్రభుత్వం ఏర్పాటైతే, బంగ్లాదేశ్ నుంచి చొరబాట్లు ఆగిపోతాయి. యువతీ యువకులందరికీ ఉద్యోగాలు లభిస్తాయి. స్వేచ్ఛగా దుర్గా మాత విగ్రహాలను నిమజ్జనం చేసుకోవడానికి కూడా అవకాశం ఏర్పడుతుంది" అని అమిత్ షా అన్నారు.

### అంత తేలిక కాదు!

రాష్ట్రాభివృద్ధి మీదే బీజేపీ దృష్టి పెడుతుందని, ప్రజాస్వామ్యానికి పార్టీ విలువనిస్తుందని చెబుతూ ఆయన, నరేంద్ర మోదీ హయాంలో దేశం వివిధ రంగాలలో సాధిస్తున్న ప్రగతిని గణాంక వివరాలతో సహా వెల్లడించారు. బీజేపీ ప్రభుత్వం పేదల కోసం పనిచేస్తున్న ప్రభుత్వమనీ, అవినీతిని నిర్మూలించి, పేదలకు ధనికులతో పాటు సమాన ఫలాలు అందేలా కృషి చేస్తోందనీ ఆయన చెప్పారు.



మమత కోటలోకే చొచ్చుకుపోయి, తృణమూల్ ఆధిపత్యాన్ని సవాలు చేయడం లక్ష్యంగా అమిత్ షా వ్యూహాల మీద వ్యూహాలు రూపొందిస్తున్నారు. తృణమూల్ కాంగ్రెస్ నేతలమీద సీబీఐ దాడులు చేస్తున్న సమయంలో అమిత్ షా బెంగాల్ పర్యటన చేయడం కాకతాళీయం. ఆయనకు ఈ సందర్భం సరిగ్గా ఉపయోగపడింది.

నిజానికి అమిత్ షా సారథ్యంలోని బీజేపీకి రాష్ట్రంలో చెప్పుకోదగినంత బలమేమీ లేదు. పైగా ఎన్నికల యంత్రాంగం మరింత బలహీనంగా ఉంది. అయినప్పటికీ బీజేపీ తన శ్రేణులను తుది పోరాటానికి సిద్ధం చేస్తోంది. అయితే, తనకు బీజేపీ నుంచి ముప్పు పొంచి ఉందనే సంగతి మమతకు తెలియదనుకుంటే పొరపాటే. అసలు ఆమె అధికారంలోకి వచ్చినప్పటి నుంచీ కమ్యూనిస్టులకన్నా బీజేపీ గురించే ఎక్కువగా ఆలోచిస్తున్నారంటే అందులో ఆశ్చర్యపోవాల్సిందేమీ లేదు. అప్పటి నుంచి ఆమె బీజేపీని ఎదుర్కోవడానికి తన తృణమూల్ కాంగ్రెస్ పార్టీని బలోపేతం చేస్తూనే ఉన్నారు. ఆమెకు తన బలహీనతలు, బలాల గురించి క్షుణ్ణంగా తెలుసు. అయినప్పటికీ పార్టీ సంస్థాగత శక్తి మీద ఆమెకు ఎంతో నమ్మకం ఉంది. ప్రజలకు చేరువ కావడానికి ఆమె మొదటి నుంచీ ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు. వామపక్షాలు లేదా కాంగ్రెస్ నాయకులను పార్టీలోకి ఆకర్షించేందుకు ప్రత్యేక ప్రయత్నాలేవీ చేయవద్దని, దేశవ్యాప్తంగానే కాక రాష్ట్రంలో కూడా క్రమక్రమంగా తెరమరుగవుతున్న ఆ పార్టీల వల్ల తృణమూల్ కాంగ్రెస్‌కు వచ్చే ఇబ్బందేమీ లేదని ఆమె అనేక సందర్భాలలో, కార్యకర్తల సమావేశాల్లో చెప్పారు. కాంతి దక్షిణ్ శాసనసభ స్థానానికి ఉప ఎన్నిక జరిగినప్పుడు బీజేపీ ఓటు వాటా 22 శాతం పెరగడాన్ని ఉదహరిస్తూ ఆమె, తమ పార్టీ వామపక్షాల మీద దృష్టి కేంద్రీకరించడం వల్లే ఈ పరిణామం చోటు చేసుకుందని గుర్తు చేశారు.

### హోరాహోరీ పోరాటం

తమ పార్టీల్లోంచి చాలామంది కార్యకర్తలు, చోటా నాయకులు వెళ్లి తృణమూల్ కాంగ్రెస్‌లో చేరుతున్న మాట నిజమేనని వామపక్ష నాయకులు సైతం బహిరంగంగానే ఒప్పుకుంటున్నారు. ప్రభుత్వ వ్యతిరేక ఓట్లన్నీ బీజేపీ వైపు మొగ్గి, ఆ పార్టీ ఓ బలమైన శక్తిగా ఎదగడానికి తోడ్పడుతున్నాయనే విషయాన్ని కూడా వామపక్షాలు అంగీకరిస్తున్నాయి. పశ్చిమ బెంగాల్ గ్రామీణ ప్రాంతాల్లో సైతం వామపక్షాలు, కాంగ్రెస్ పార్టీల పరిస్థితి అధ్వానంగా ఉంది. రాష్ట్రంలో అంతర్లీనంగా హిందువుల ఏకీకరణకు బీజేపీ ప్రయత్నిస్తోందనే సంగతి తృణమూల్‌కు తెలియకపోలేదు. దాన్ని దృష్టిలో పెట్టుకునే తృణమూల్ రాష్ట్రంలో హిందువుల ఏకీకరణకు స్వయంగా కొంత ప్రయత్నం చేస్తోంది. ఉదారవాద హిందువుల ఏకీకరణకు తృణమూల్ ప్రయత్నిస్తుండగా



**బి.జె.పి పశ్చిమ బెంగాల్‌పై కన్నేసింది. వచ్చే లోక్‌సభ ఎన్నికల్లో అక్కడ ఎక్కువసీట్లు సాధిస్తే పార్టీ విస్తరణకు ఢోకా ఉండదనుకుంటున్నారు అమిత్ షా. తృణమూల్ కోటలో పాగా వేసేందుకు ద్విముఖ వ్యూహం అనుసరిస్తూ తరచు బెంగాల్లో పర్యటిస్తున్నారాయన. మరోవైపు కాంగ్రెస్, లెఫ్ట్‌పార్టీల పరిస్థితి గ్రామాల్లో అధ్వానంగా ఉంది. ఇంతకూ షా వ్యూహం ఫలిస్తుందా? లేక మమతను తక్కువగా అంచనా వేస్తున్నారా?**

ఈ విషయంలో బీజేపీ కొద్దిగా అతివాదాన్నే అనుసరిస్తోంది. నిజానికి బెంగాల్‌లో హిందువులు సైతం మతపరమైన గుర్తింపు కోసం కాకుండా సాంస్కృతిక గుర్తింపు కోసం ప్రయత్నిస్తుంటారు.

ఈ పరిస్థితిలో మార్పు తెచ్చి, తమ పంథాలో హిందువుల ఏకీకరణకు బీజేపీ పట్టు వదలని విక్రమార్కుడిలా ప్రయత్నాలు చేస్తోంది. రాష్ట్రంలో సుమారు 27 శాతం ఉన్న ముస్లింలను ఆకట్టుకోవడానికి మమత ప్రయత్నిస్తుండగా రామనవమి వంటి పర్వదిన సందర్భాలలో వీలైనన్ని ఊరేగింపులు నిర్వహించి హిందువులను ఒక్క తాటి మీదకు తీసుకురావాలని బీజేపీ కృషి చేస్తోంది. ఈ మధ్య బీజేపీ ఊరేగింపు జరిపినప్పుడు కార్యకర్తలు కత్తులు, కర్రలతో పాల్గొనడం, జై శ్రీరామ్ నినాదాలు చేయడం పార్టీ వ్యూహానికి అద్దం పడుతోంది. రాష్ట్రంలో అధికార పార్టీ సాగిస్తున్న మైనారిటీల బుజ్జగింపు ధోరణి గమనించిన కలకత్తా హైకోర్టు ఈ 'పక్షపాత' ధోరణిపై తీవ్రంగా విమర్శలు గుప్పించింది. బెంగాలీ హిందువుల్లో అధిక సంఖ్యాకులు ఇప్పటికే బీజేపీ పట్ల మొగ్గు చూపించడం ప్రారంభించారు.

బీజేపీ ఎత్తులు, పై ఎత్తులు తృణమూల్‌ను ఇరకాటంలో పడేస్తున్నాయనడంలో సందేహం లేదు. అయినప్పటికీ ఆ పార్టీ అధినేత మమతా బెనర్జీ తెలివితేటలను తక్కువగా అంచనా వేయడానికి వీల్లేదు. మమత కోటలో పాగా వేయడం అమిత్ షాకు అంత తేలిక కాదు. 2019లో బెంగాల్‌లో బీజేపీ అధికారంలోకి రావాలంటే ఆ పార్టీ అగ్రనాయకత్వమంతా బెంగాల్‌లోనే తిష్ట వేయాలి. ఎన్నో వ్యయప్రయాసలకు ఓర్చాలి. అగ్గిబరాటా మమతను కట్టడి చేయడం అంత తేలికైన విషయం కాదని షా గ్రహించాలి.



# చిత్రవిచిత్ర నిద్రలు

**కడుపునిండా తిండి, కంటినిండా నిద్ర... ఈ రెండింటిలో దేనిలోనైనా తేడా వస్తే మనిషి అనారోగ్యం పాలవుతాడు. పరిస్థితి విషమిస్తే మరణానికి దగ్గరవుతాడు. తిండి తినకుండా 20 నుంచి 40 రోజుల వరకు ఉండొచ్చు కానీ నిద్ర పోకుండా మాత్రం ఎక్కువ రోజులు ఉండటం అసాధ్యం. ఒక్కరోజు సరిగా నిద్రలేకుంటే పని చేస్తున్నప్పుడు మధ్యలోనే కునుకు పాట్లు, తలనొప్పి ముంచుకొస్తుంటాయి. యూనివర్సిటీ ఆఫ్ కాలిఫోర్నియా శాస్త్రవేత్తల సర్వే ప్రకారం ఓ మనిషి నిద్రపోకుండా 264 గంటలు.. అంటే 11 రోజుల పాటు ఉండ గలడట. అంతకుమించితే చావును చూడాల్సి వస్తుందని సర్వే చేసిన వారు తేల్చిచెప్పారు.**

అయితే నేటి యువత ఫేస్‌బుక్ డేటింగ్‌లు, వాట్సప్ చాటింగ్‌లతో నిద్రను దూరం చేసుకుంటోంది. తద్వారా రోగాల బారిన పడుతోంది. అధిక రక్త పోటు, పక్షవాతం, గుండె జబ్బులు, మధుమేహం, వంటి సమస్యలకు నిద్రలేమి కారణమని డాక్టర్లు చెప్పినా, స్థూలకాయానికి దారితీస్తుందని సర్వేలు ఘోషించినా పెడచెవిన పెడుతోంది. అయితే నిద్రను దూరం చేసుకోవడం వల్ల కలిగే రోగాలు, నష్టాల గురించి చాలామందికి తెలుసు. కానీ నిద్రే రోగంగా మారి పీడిస్తుంటే... నిద్ర వద్దు బాబోయ్ అని ఎంత పట్టుదలగా ఉన్నా తెలియకుండానే నిద్రలోకి జారుకుంటే... ఒకటి కాదు రెండు కాదు ఏకంగా రోజుల తరబడి నిద్రలోనే ఉండిపోతే... శృంగార కార్యకలాపాలు కూడా నిద్రలోనే చేస్తే.. ఏంటీ విచిత్రం అని అనుకుంటున్నారా? అస్సలు నమ్మలేకపోతున్నారా? ఎవరు నమ్మినా నమ్మక పోయినా నిద్ర ఓ సమస్యగా మారి ఎంతో మందిని వేధిస్తోంది. ఆ వింత విచిత్ర నిద్ర రోగాలేవో ఓ లుక్కేసి అవాక్కవడానికి రెడీగా ఉండండి.

## కుంభకర్ణుడి చెల్లెలు

కుంభకర్ణుడి గురించి భారతీయులకు వేరుగా చెప్పనక్కర్లేదు. రావణ సోదరుడు కుంభకర్ణుడికి ఆరు నెలలు ఏకధాటిగా నిద్రపోయేలా వరమిస్తాడు బ్రహ్మ. మరి ఏ దేవుడి వరమో, ఎవరు ఇచ్చిన శాపమో కానీ ఓ యువతి కూడా ఈ కుంభకర్ణు డితో పోటీ పడుతోంది. కుంభకర్ణుడిలా ఆరు నెలలు కాదు గానీ ఏకధాటిగా పన్నెండు రోజుల పాటు నిద్రపోతోంది. బ్రిటన్‌కి చెందిన లూసియా బాల్ అనే 22 ఏళ్ల యువతి పడుకుంటే చాలు 8 నుంచి 12 రోజుల పాటు నిద్రపోతోంది. స్లీపింగ్ బ్యూటీ అని పేరు తెచ్చుకున్న ఈ యువతి రోజులో దాదాపు 22 గంటలపైనే నిద్రపోతుంది. మిగిలిన రెండు గంటలు కూడా మగత నిద్రలో ఉంటుం దట. ఆ సమయంలో అతి కష్టం మీద ఆమె తల్లి దండ్రులు ఆహారం, నీళ్లు, కాలకృత్యాలు వంటి అవ సరాలను తీరుస్తారు. వెంటనే మళ్లీ నిద్రలోకి జారు కుంటుంది. ఈ నిద్ర రోగం వల్ల అమ్మాయి చదువు కోల్పోతోందనీ, ప్రయాణాలు చేయలేకపో తోందనీ తల్లిదండ్రులు వాపోతున్నారు. క్లీనెలెవిన్ సిండ్రోమ్ (KleineLevin) వల్ల ఈ విధంగా రోజుల తరబడి ఆమె నిద్రపోతోందని వైద్యులు తెలిపారు. దీనికి కచ్చితమైన వైద్యం లేదని డాక్టర్లు కూడా తేల్చేశారు. ఇలాంటి నిద్ర రోగం ప్రపంచవ్యా ప్తంగా దాదాపు 1000 మందికి పైగానే ఉందని సర్వేలు చెబుతున్నాయి.

## నిద్రలోనే శృంగారం

ఏంటీ ఆశ్చర్యపోతున్నారా? నిద్రలోనే శృంగారం ఏంటని అనుమానిస్తున్నారా? ఎవరు నమ్మినా నమ్మకపోయినా హేలీ బట్లీ అనే యువతి మాత్రం నిద్ర లోనే శృంగారంలో పాల్గొంటోంది. తాను చక్కగా నిద్రపోతూ, పక్కన ఉన్నవారికి నిద్రలేకుండా చేస్తోంది. ఇంగ్లాండ్‌కు చెందిన ఈ యువతి 'సెక్సోమ్నియా' (Sexsomnia) అనే విచిత్ర వ్యాధితో బాధపడు తోంది. ఈ సమస్య ఉన్నవారు నిద్రలోనే ఒకటికి నాలుగు సార్లు శృంగారంలో పాల్గొంటారట. భాగ స్వాములను బలవంతం చేస్తారట. నిద్ర నుంచి మేల్కొన్న తర్వాత రాత్రి జరిగినవేమీ గుర్తులేకపో వడం ఈ వ్యాధి విచిత్ర లక్షణం. తాను నిద్రలో కామ పిశాచిలా ప్రవర్తిస్తున్నానని తన ప్రియుడు చెబితే అస్సలు నమ్మలేదని, ఆ తర్వాత తన గురించి తనకు తెలిసి బాధపడుతున్నానని ఈ అమ్మడు చెబుతోంది. అయితే ఈ రోగం వల్ల తనకు వచ్చిన సమస్య ఏమీ లేదని, కాకపోతే శృంగారంలో పాల్గొన్న అనుభూతి మాత్రం తనకు మిగలడం లేదని ఈమె వాపోతోంది. తన కోసం కాకున్నా ప్రియుడి క్షేమం కోరి ఈ రోగానికి చికిత్స తీసుకుంటోందట ఈ యువతి. ప్రపంచవ్యాప్తంగా ఈ 'సెక్సోమ్నియా' వ్యాధితో 11 శాతం మంది పురుషులు, 4 శాతం మంది స్త్రీలు బాధపడుతున్నారని సర్వేలో తేలింది.

## ఉన్నట్లుండి నిద్రలోకి....

మొదట నిద్రమత్తు.. ఆ తర్వాత నిద్రలోకి జారుకోవడం.. సాధారణంగా ఈ రెండు ప్రక్రియల అనంతరమే చాలామంది నిద్రపోతుంటారు. కానీ వంట చేస్తూ ఉన్నట్లుండి నిద్రపోతే, ఆఫీసులో ప్రోగ్రామ్ కోడింగ్ రాస్తూ రాస్తూ అకస్మాత్తుగా నిద్రపోతే.. తింటూ ఉండగానే డైనింగ్ టేబుల్‌పై వాలిపోతే.. వినడానికి విచిత్రంగా, కాస్త కొత్తగా

ఉన్నా, ఇలాంటి పరిస్థితులను చాలామంది ఎదుర్కొంటున్నారు. 'నార్కోలెప్సీ' (Narcolepsy) అనే విచిత్రమైన వ్యాధి దీనికి కారణం. రోజులో కొన్ని గంటలపాటు ఇలా మధ్యమధ్యలో కునుకు తీయడమే ఈ వ్యాధి లక్షణం. ఇలాంటి లక్షణాలు కుటుంబ సభ్యుల నుంచి కూడా సంక్రమిస్తాయని వైద్యులు చెబుతున్నారు. శరీరంలో రోగనిరోధక శక్తి తగ్గిపోవడం, మనసులో అలజడి, మానసిక ఒత్తిడి వంటివి కూడా ఈ వ్యాధికి కారణాలవుతాయట. దీని నుంచి బయటపడటం అంత సులభం కాదని వైద్యులు చెబుతున్నారు. మానసిక ఒత్తిడిని జయించేలా యోగా, ధ్యానం వంటివి చేస్తే ఉపయోగముంటుందని చెబుతున్నారు.

## ఒక్క నవ్వు చాలు

నవ్వు ఆరోగ్యానికి మంచిదని డాక్టర్లు చెబుతూనే ఉంటారు. కానీ ఈ నవ్వే ఓ మహిళ కొంప ముంచుతోంది. ఒక్కసారి నవ్వితే చాలు నిద్ర దానంతట అదే ముంచుకొస్తుందామెకు. న్యూజెర్సీకి చెందిన క్లైరే స్కాట్ అనే మహిళ ఇలాంటి వింత సమస్యతో బాధపడుతోంది. ముసిముసి నవ్వులు నవ్వినా చాలు నిద్రలోకి జారుకుంటుందామె. కాటప్లెగ్జీ (Cataplexy) అనే విచిత్ర వ్యాధి దీనికి కారణమని చెబుతున్నారు డాక్టర్లు. కండరాల బలహీనత వల్ల, కోపం, నవ్వు, బాధ వంటి పరిస్థితులపై అదుపు తప్పడమే ఈ అరుదైన నిద్రకు కారణమట. ప్రతి పదివేల మందిలో ఒకరికి ఇలాంటి వ్యాధి ఉంటుందని శాస్త్రవేత్తలు చెబుతున్నారు. తనకు నవ్వితే నిద్ర వస్తుందని తెలుసుననీ, కానీ నవ్వును ఆపుకోలేకపోతున్నాననీ స్కాట్ చెబుతోంది. అలా నిద్రపోయిన గంట, రెండు గంటలకు మెలకువ వస్తోందంటుందామె. దీనివల్ల తన ఇద్దరు పిల్లల ఆలనాపాలనా చూసుకోవడం కష్టమవుతోందని వాపోతోంది.

## బరువు పెరిగింది

ఉదయం, మధ్యాహ్నం, రాత్రి.. ఇలా తిండి తినడానికి కొన్ని సమయాలు ఉన్నాయి. అయితే కొంత మందికి మాత్రం ఇవి మినహాయింపేనని చెప్పుకోవాలి. కొందరు నిద్రలో ఉలికిపడి లేచి భోజనమో, పండ్లో ఫలహారమో.. ఏదోటి తినేస్తుంటారు. అదేమంటే 'నాకు ఆకలెక్కువ' అని సమాధానం ఇస్తుంటారు. దీన్నే 'నాక్టర్నల్ స్లీప్ రిలేటెడ్ ఈటింగ్ డిజార్డర్' (Nocturnal Sleep Related Eating Disorder) అంటారు. నిద్ర మధ్యలో ఏదోటి తినకపోతే వారికి ప్రశాంతంగా నిద్రపోయినట్లు ఉండదు. అయితే ఇది ఒక తరహా రోగమని ఈ సమస్యను ఎదుర్కొంటున్న వారికి తెలియకపోవడం చాలా విచిత్రం. రాత్రిళ్లు తాము ఏమేం తింటున్నామో వాళ్లకు అవగాహన కూడా ఉంటుంది. ఈ లక్షణాలు ఉన్న అన్నా ర్యాన్ అనే ఓ యువతి యేడాదిపాటు రాత్రిళ్లు తిండి తిని ఏకంగా 27 కేజీల బరువు పెరిగిందంటే నమ్మగలరా? రాత్రి పూట ఇలా సమయం, సందర్భం లేకుండా భోజనం చేసే వాళ్లు బరువెక్కువ పెరుగుతారని, తద్వారా అనారోగ్య సమస్యలు కూడా ఎదురవుతాయని డాక్టర్లు చెబుతున్నారు.

**కొందరు నవ్వితే నిద్రపోతారు. మరికొందరు ఆఫీసులో పనిచేస్తూ చేస్తూ తెలియకుండానే నిద్రపోతారు. ఇంకొందరు నిద్రలో తమకు తెలియకుండానే సెక్స్‌లో పాల్గొంటారు. మరికొందరు కుంభకర్ణుడుతో పోటీ పడేలా రోజులతరబడి నిద్రపోతారు. ఇవన్నీ నిద్ర రోగాలే. మనకు తెలియని చిత్రవిచిత్రమైన ఈ రోగాలపై కొందరు సర్వే నివేదిక కూడా వెలువరించారు. ఈ వివరాలన్నీ మీ కోసం...**





లూసియా బాల్



## శాశ్వతనిద్రలోకి...

సుఖమైన చావు.. అనే పదాన్ని విననివారు ఉండరు. అనారోగ్య సమస్యలు ఏవీ లేకున్నా రాత్రికి రాత్రే నిద్రలోనే మరణించే వారి గురించి ఆ పదాన్ని వాడుతుంటారు. బీపీ, షుగర్, స్థూలకాయం, కేన్సర్ వంటి రోగాలు ఏవీ లేకున్నా, పూర్తి ఆరోగ్యంతో ఉన్న వ్యక్తి ఇలా అకాల మరణం చెందేందుకు కారణమేంటో డాక్టర్లు కూడా చెప్పలేరు. అయితే ఇలా నిద్రలోనే మరణిస్తున్న వారు ఎక్కువగా పురుషులే అని ఓ పరిశీలనలో తేలింది. ప్రపంచవ్యాప్తంగా అందులోనూ ఆసియన్ దేశాల్లోని పురుషులే ఇలా ఆకస్మిక మరణాలకు గురవుతున్నారట. రోజూలాగే అన్నం తింటారు.. టీవీ చూస్తారు.. కుటుంబ సభ్యులతో కులాసాగా గడుపుతారు... నిద్రకు ఉపక్రమిస్తారు. కానీ వారికి అదే చివరి రాత్రి అని వారితో సహ ఎవరికీ తెలియకపోవడమే విచిత్రం. సాధారణంగా మనిషి గుండెకు విశ్రాంతి లేదు. 24 గంటలూ పని చేస్తూనే ఉంటుంది. అయితే నిద్రలో ఉండగా అకాల మరణం చెందిన వారి గుండె ఒక్కసారిగా పనిచేయడం మానేస్తుందనీ, తద్వారా నిద్రలోని వ్యక్తి ఎలాంటి ఒత్తిడికి లోనవకుండానే మరణిస్తాడని డాక్టర్లు చెబుతున్నారు. లోస్ అనే ఆఫ్రికా దేశంలో అయితే ఆడ దయ్యాలు పురుషులను ఇలా అకాల మరణాలకు గురిచేస్తున్నాయని నమ్ముతుంటారు కూడా.

## మెలకువ వచ్చినా లేవలేరు

నిద్రపోయినప్పుడు పిలిస్తే కొంతమంది ఇట్టే లేస్తారు. ఒక్కసారి ముట్టుకుంటే చాలు ఉలిక్కిపడి లేచి కూర్చుంటారు. కానీ అతి తక్కువ శాతం మంది మాత్రం ఎంత పిలిచినా ఉలకరు పలకరు. మెలకువ వచ్చినా లేవలేరు కూడా. దీనినే స్లీప్ పెరాలసిస్ అంటారు. పెరాలసిస్ వ్యాధిగ్రస్థులు మంచం మీద నుంచి లేవలేరు. స్లీప్ పెరాలసిస్ (Sleep Paralysis) లక్షణాలు ఉన్నా అంతే! నిద్రలో నుంచి మెలకువ వచ్చినా సరే.. లేచి కూర్చోలేకపోవడాన్నే స్లీప్ పెరాలసిస్ అంటారు. మగత నిద్రలో ఉండి, కాళ్లు, చేతులు పట్టేసినట్లు ఉండి శరీరం మొత్తం అచేతన స్థితిలోకి వెళ్లిపోతుంది. అయితే కొద్దిసేపటికి దానికదే మళ్లీ సాధారణ స్థితికి వచ్చేస్తుంది కూడా. ఇలాంటి నిద్ర రోగం వల్ల నష్టం ఏమీ లేకున్నా, అత్యవసర పరిస్థితుల్లో మాత్రం కొంచెం కష్టమేనని డాక్టర్లు చెబుతున్నారు. చైనాలోని కొన్ని ప్రాంతాల్లో ఇలాంటి లక్షణాలను 'దయ్యం మనిషిని లేవకుండా కిందకు నెట్టేస్తోంది' అని భావిస్తుంటారు. మెక్సికోలో అయితే, 'మరణమే మనిషిపై కూర్చుని ఉంది' అని చెప్పుకుంటుంటారు. అక్కడి ఆచారాల ప్రకారం పూజలు పునస్కారాలు కూడా చేస్తుంటారు.

నిద్ర పోకపోవడం వల్ల వచ్చే రోగాలతో పాటు ఇలాంటి నిద్రరోగాలు కూడా మనుషులను వేధిస్తున్నాయి. ప్రస్తుతకాలంలో సోషల్ మీడియా ప్రభావం పెరగడంతో మనిషి నిద్రకు దూరం అవుతున్నాడు. నిద్ర రోగాలను ఎలాగూ ఆపలేము కానీ నిద్ర పోకపోవడం వల్ల వచ్చే రోగాలను ఆపడం మన చేతుల్లో పని. అందువల్ల సమయానికి నిద్రపోయి ఆరోగ్యాన్ని కాపాడుకుంటే కళ్లకు హాయి... ప్రాణానికి హాయి.

–కె. హసాన్
kandula.hassan@gmail.com



6

# మనసుగతి ఇంతే!

-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**"వారం రోజులుగా కంటిమీద కునుకు లేదు. నిద్ర పూర్తిగా దూరమైపోయింది. శరీరానికి విశ్రాంతి లేదు. మనసుకు శాంతి లేదు. ఎవరికో ఒకరికి చెప్పుకోవాలి. చెప్పుకోవడానికి నువ్వు తప్ప నాకు ఇక్కడ ఎవ్వరూ లేరు" ఉపోద్ఘాతంలా చెప్పి, బరువుగా నిట్టూర్చాడు వినయ్.**

**కిరణ్ వినయ్ ముఖంలోకి చూశాడు. ముఖంలో అలసట, కళ్ళల్లో నిద్రలేమి తెచ్చే ఎరుపు. "నీకు నిద్ర లేకుండా చేసిన సమస్య గురించి చెప్పుకోవడానికి ఇప్పుడు నీకు భార్య ఉంది వినయ్."**

"ఇది సంధ్యకు చెప్పే విషయం కాదు" వినయ్ కిరణ్ ముఖంలోకి నిదానించి చూస్తూ అన్నాడు. అమ్మకూ, నాన్నకూ చెప్పాలనుకుని తెగ ఆరాటపడిపోయాను. వాళ్ళకు కష్టం కలిగించడం ఇష్టం లేక మానేశాను. వెయ్యి విధాలుగా ఆలోచించి నీ వద్దకు వచ్చాను."

"ఓకే...చెప్పు. వినడానికి మనం రెడీ."

"నువ్వు వినబోయే విషయం నీ నోటమ్మట మరెవ్వరూ వినకూడదు; హర్షిత కూడా.."

"అంత సీక్రెట్టా?" కిరణ్ ఆశ్చర్యంగా అన్నాడు.

"అంతా విన్నాక టాప్‌సీక్రెట్ అని నువ్వే అంటావు" వినయ్ నిట్టూరుస్తూ అన్నాడు. "చెప్పనా?"

### జరిగిన కథ

ఒకదాని తరువాత ఒకటిగా కంప్యూటర్ స్క్రీన్ మీద ఫోటోలు జరిగిపోతున్నాయి. అన్నీ సంధ్య ఫోటోలే! అతనికి ఎటుచూసినా ఆమే కనబడుతుంది. ఆమెనే మంత్రముగ్ధుడిలా చూస్తూ గతంలోకి జారుకుంటాడు వినయ్. అమెరికాలో ఉన్న వినయ్ ఇండియా వచ్చి సంధ్యని పెళ్ళి చేసుకుంటాడు. శోభనం రాత్రి గదిలోకి అడుగుపెట్టిన సంధ్య ఒక్కసారిగా కుప్పకూలిపోతుంది. హాస్పిటల్‌కి తీసుకువెళతారు. అయితే ఆమెకేమీ సమస్య లేదని చెబుతారు డాక్టర్లు. ఆ తరువాత రెండోసారి ఏర్పాటుచేసిన మొదటిరాత్రి, అమెరికా వెళ్ళిన తరువాత కూడా ఇద్దరూ దూరంగానే ఉంటారు. దాంతో వినయ్‌లో నిరాశ చోటుచేసుకుంటుంది. ఇద్దరూ ఏకమయ్యే రోజుకోసం పరితపిస్తుంటాడు వినయ్. ఆలోచిస్తుంటాడు. ఆరోజు రాత్రి బయట డిన్నర్ చేసొచ్చాక సంధ్య కోసం ఎదురు చూస్తూ ఉంటాడు వినయ్. ఆమె ఎంతకీ రాకపోయేసరికి ఆమె దగ్గరకు తనే వెళ్తాడు. నిద్రపోతున్న సంధ్యను చూస్తూ అతడలాగే నిలబడతాడు. ఇంతలో ఆమె లేచి అతణ్ణి చూసి భయపడి, హిస్టీరిక్‌గా అరుస్తూ మూలకెళ్ళి కూర్చుంటుంది.

ఆ తర్వాత....

"నీ రహస్యం నా రహస్యంలా నాలో ఉండిపోతుందిరా; చెప్పు!"

వినయ్ తగ్గుస్వరంతో ప్రారంభించాడు. మొదట వారం క్రిందట జరిగిన విషయం వివరించాడు. ఆ తరువాత కిరణ్ ఇంట్లో వాళ్ళు అరేంజ్ చేసిన ఏకాంతంలో జరిగింది ఏకరువు పెట్టాడు. ఆ తరువాత ఇండియాలో జరిగిన రెండు మొదటి రాత్రుల కథలూ వినిపించాడు. వింటున్న కిరణ్ ఆశ్చర్యంతో నోరు తెరుచుకుని, అచేతనంగా ఉండిపోయాడు.

"అంటే... ఇంతవరకూ..." కిరణ్ చివరికి నోరు పెగల్చుకుని అన్నాడు.

"నేను సంధ్యను ముట్టుకోలేదు" వినయ్ తగ్గుస్వరంతో దీనంగా అన్నాడు. "సంధ్య సంధ్యగానే ఉంది. నేను నేనుగానే ఉన్నాను. ఇద్దరం ఒక్కటి కాలేదు. వండుతుంది. వడ్డిస్తుంది. చీకటి పడగానే సెకండ్ బెడ్‌రూంలోకి దూరి తలుపు మూసి, లాక్ చేసుకుంటుంది. పగలు ఏమీ జరగనట్టు ఉంటుంది. రాత్రిళ్ళు ఏమీ జరగకుండా తాళం వేసుకున్న గదిలో నిద్రపోతుంది!"

"అన్ బిలీవబుల్"

"మాది సూత్రప్రాయంగా-కాకపోతే మంగళసూత్రప్రాయంగా జరిగిన వివాహంగానే ఉండిపోయింది. ఎందుకిలా జరిగింది?"

"సంధ్యకు ఎందుకలా అయ్యింది అని నువ్వు నన్ను అడుగుతున్నావు. అవునా?" కిరణ్ ప్రశ్నించాడు.

వినయ్ అవునన్నట్టు తలపంకించాడు.

"ఫ్రాయిడ్‌నో, జంగ్‌నో, యాడ్లర్‌నో అడగాల్సిన ప్రశ్న నన్ను అడుగుతున్నావ్!" కిరణ్ నవ్వుతూ అన్నాడు.

"కిరణ్ వయసులో, పెళ్ళి అనుభవంలో నువ్వు నాకు సీనియర్‌వి. ఎందుకిలా అవుతుందో, నేను ఏం చేయాలో చెప్పగలిగింది నువ్వే! ఎందుకంటే అమ్మా నాన్నలకు చెప్పి వాళ్ళనూ, అత్త మామలకు చెప్పి వాళ్ళనూ కంగారుపెట్టలేను! అందుకే నీకు చెప్పున్నాను" వినయ్ నీరసంగా అన్నాడు.

"మామూలు మనిషిగా ఊహించి చెప్పమంటే చెప్తాను. ఇండియాలో రిక్షా తొక్కే వ్యక్తికి కూడా కలిగే ఊహలే అవి..."

"కిరణ్..."

"చెప్తాను. అవి నిజాలు కాకపోవచ్చు. విషయం వినగానే కలిగే అనుమానాలు. ఇండియాలో రెండవ తొలిరాత్రీ, మా ఇంట్లో 'అమెరికాలో తొలి రాత్రి' సంధ్య వాంతులు చేసుకున్నావు. అవి మామూలు వాంతులు కాకపోవచ్చు. వేవిళ్ళు కావచ్చు..."

"కిరణ్!"



"తొందరపడొద్దు వినయ్! నాలో కలిగినవి నేలబారు అనుమానాలు అని ముందే చెప్పాను. ఆ వేవిళ్ళు..."

"వేవిళ్ళను మార్నింగ్ సిక్‌నెస్ అంటారని విన్నాను. సంధ్య చేసుకున్న వాంతులు 'ఉదయం వాంతులు' కావు. రాత్రి వాంతులు.."

"వేవిళ్ళకు... ఆ విధంగా సమయనియమం ఏమీలేదు. నెల తప్పాక మా వదిన ఇరవై నాలుగ్గం టలూ వాంతులతో బాధపడింది. సంధ్య వాంతుల్ని మనం మాట వరసకి వేవిళ్ళు అనుకుంటే ఆమెకో గతచరిత్ర ఉందని అర్థం. ఆ చరిత్ర మరొక పురుషుడితో ముడిపడి ఉందని అర్థం. కారణం మనకి తెలీదు గానీ, గతాన్ని చెప్పుకోలేని స్థితిలో సంధ్య నిన్ను పెళ్ళాడింది. గతాన్ని మరిచిపోయే కోరికలేని సంధ్య నీతో సంసారం చేయడానికి ఇష్టపడలేక పోతోంది అని మన ఊహలకి రెక్కలు కట్టొచ్చు.."

"మొన్న ఇంట్లో దిగాక సూట్‌కేస్‌లోంచీ శానిటరీ నాప్‌కిన్స్ తీసుకుంది తను..." వినయ్ అనుమానంగా అన్నాడు.

'అది నటన కావచ్చు. నిజం కావచ్చు. వాంతులు నిజం కావచ్చు, నటన కావచ్చు.." అరచేత్తో నుదుర్ని కప్పుకున్న వినయ్‌ని చూస్తూ ఆపేశాడు కిరణ్.

"కిరణ్... నీ ఊహాగానం నన్ను పూర్తిగా కన్‌ఫ్యూజన్‌లో పడేసింది. తల తిరిగిపోతోంది" వినయ్ బలహీనంగా అన్నాడు.

కిరణ్ చిన్నగా నవ్వాడు. "నిజమేరా! నా ఊహలు నన్నే కన్‌ఫ్యూజ్ చేసి పారేశాయి. మొదట్లో అందుకే అన్నాను ఏ ఫ్రాయిడ్‌నో, జంగ్‌నో, యాడ్లర్‌నో అడగాల్సిన ప్రశ్న నన్నడుగుతున్నావని!"

వినయ్ విరక్తిగా నవ్వాడు. "నా ప్రశ్న అడగడానికి ఇప్పుడు ఆ ముగ్గురూ లేరు."

"ఆదుర్దా పడొద్దు. సిగ్మండ్ ఫ్రాయిడ్‌కీ, ఆల్‌ఫ్రెడ్ యాడ్లర్‌కీ, కార్ల్‌జంగ్‌కీ ఉమ్మడి వారసుడిగా పేరు తెచ్చుకున్న ఫేమస్ సెక్సాలజిస్ట్ ఒకతనున్నాడు. అర్జెంటుగా అతన్ని కన్‌సల్ట్ చెయ్!"

"ఎవరతను? ఎక్కడున్నాడు?" వినయ్ ఆత్రంగా అడిగాడు.

"డాక్టర్ జాన్ డేవిడ్. మనకు దగ్గర్లోనే, శాన్ ఫ్రాన్సిస్కోలో!"

"ఆయన నీకెలా తెలుసు?" వినయ్ కళ్లు చిట్లిస్తూ అడిగాడు.

"ఆయన గురించి తెలుసు. టీవీ ముఖాముఖీలో చూశాను; విన్నాను" కిరణ్ నవ్వుతూ అన్నాడు. "ఆయన క్లినిక్‌లో ఒక ఇండియన్ డాక్టర్ కూడా ఉంది. పేరు జలజ."

"సంధ్యను ఆయన వద్దకు తీసుకెళ్ళడం మంచిదంటావా?"

"ముందుగా నువ్వెళ్ళు. కావాలంటే తోడుగా నేనూ వస్తాను. ఆయన్తో సంధ్య గురించి డిస్కస్ చెయ్. ఏం చేయాలో ఆయనే చెప్తాడు."

వినయ్ తేలిగ్గా నిట్టూర్చాడు. "థాంక్స్‌రా కిరణ్. మంచి సలహా ఇచ్చావు."

"స్టార్ బక్స్ కాఫీ ఇప్పుడు తాగుదాం. గో అండ్ గెట్ టూ లార్జ్ కాఫీస్" కిరణ్ నవ్వుతూ అన్నాడు.

వినయ్ లేచి కౌంటర్ వైపు వెళ్ళాడు.

***

"సంధ్యా.."

"పిలిచారా?"

"ఆ...ఇవాళ శనివారం. లివర్‌మోర్ టెంపుల్‌కెళదామా? చాలా బాగుంటుంది" వినయ్ అన్నాడు.

"దానికేం? వెళ్దాం. ఏ దేవుడి గుడి అది?" సంధ్య అడిగింది.

"శివుడు, బాలాజి ఇద్దరూ ఉంటారు ప్రధాన దేవుళ్ళుగా. అరగంటలో బయల్దేరుతున్నాం. తయారవ్వు. అక్కడ ప్రసాదం పుష్కలంగా దొరుకుతుంది. వంట చేయక్కర్లా."

***

ఆలయంలో దర్శనాలు ముగించుకుని, ప్రసాదాలు తిని ఇద్దరూ కారు వద్దకు వచ్చారు. వినయ్ స్టీరింగ్ ముందు కూచుని, కుడివైపు డోర్ తెరిచాడు. సంధ్య ఎక్కి కూచుంది. కారు స్టార్టయింది.

కారు నెమ్మదిగా వెళుతోంది. విశాలమైన రోడ్డుకి ఇరువైపులా పచ్చగా మెరుస్తున్న రోలింగ్ హిల్స్. సంధ్య మౌనంగా ప్రకృతిసౌందర్యం చూస్తూ ఉండిపోయింది.

"దేవుణ్ణి ఏ కోరిక కోరుకున్నావ్?" వినయ్ ఉన్నట్టుండి అడిగాడు.

"నాకా అలవాటు లేదు.."

"అలవాటు లేదా? నిజంగా?" వినయ్‌లో ఆశ్చర్యం.

"నిజమే. నా కోసం అమ్మా, నాన్న కోరుకునే వాళ్ళు" సంధ్య నిర్లిప్తంగా అంది.

"నేనేం కోరుకున్నానో తెలుసా?" వినయ్ ప్రశ్నించాడు.

"చెప్పు"



"నీ యోగక్షేమాలు కోరుకున్నాను."

"థాంక్స్! ఇన్నాళ్ళూ అమ్మా నాన్నా. ఇప్పుడు నువ్వు. అయామ్ లక్కీ!" సంధ్య చిన్నగా నవ్వింది. వినయ్ నవ్వుతూ కారు మెయిన్ రోడ్డులోంచీ కుడివైపు తేలిన సన్నటి రోడ్డు మీదికి మళ్ళించాడు.

"ఇటెక్కడికి?" సంధ్య అడిగింది.

"కాసేపు విశ్రాంతికి.." అంటూ వినయ్ కారుని రెండు వైపులా ఏపుగా పెరిగిన చెట్ల మధ్యకు పోనిచ్చాడు. కొంచెం దూరం వెళ్ళాక కారుని ఆపి, కిటికీ అద్దాల్ని దించి ఇంజన్ స్టాప్ చేశాడు. చల్లటి గాలి వీస్తోంది.

"సంధ్యా.." ఆమెవైపు తిరుగుతూ పిలిచాడు వినయ్.

సంధ్య తల తిప్పి ప్రశ్నార్థకంగా చూసింది.

"ఆరోజు నుండీ నిన్నొకటి అడగాలనుకుంటు న్నాను. అడగనా?"

"నీ ఇష్టం. అడగాలనుకుంటే అడుగు."

"సంధ్యా, నాకు నిజం కావాలి. కేవలం నిజం. అది ఎంత కఠోరమైనదైనా సరే; ఆ నిజం నన్ను ఎంత బాధించినా సరే; నిన్ను ఏమీ అనను. ఎందుకో తెలుసా?"

"తెలీదు. ఎందుకు?"

"మొదటిసారిగా చూసిన ముహూర్తంలో నిన్ను ప్రేమించాను. ప్రేమిస్తున్నాను. ప్రేమిస్తూనే ఉంటాను. అందుకు."

"థాంక్స్..."

"నిజం చెప్తావా?" వినయ్ ప్రశ్నించాడు.

"నాకు అబద్ధాలాడడం తెలీదు."

"సంధ్యా, నన్ను ఇష్టపడే పెళ్ళి చేసుకున్నావా?" వినయ్ అడిగాడు. "ఇటు తిరిగి నా కళ్ళల్లోకి చూస్తూ సమాధానం చెప్పు!"

సంధ్య తిరిగి, అతని కళ్ళల్లోకి చూసింది. "అమ్మా నాన్నల ఇష్టమే నా ఇష్టమనీ, అందుకే చేసుకుంటున్నా ననీ మన చిలుకూరు యాత్ర సందర్భంలో చెప్పాను."

"నువ్వు...నువ్వు... ఎవర్నయినా ప్రేమించావా? నా కళ్ళలోకి చూస్తూ చెప్పాలి."

"లేదు.."

"ఒకే...ఆనాటి రాత్రి... అదే మన తొలిరాత్రి శోభనం గదిలో స్పృహతప్పి పడిపోయావు. ఏం జరిగింది?"

"నీ కళ్ళల్లోకి చూస్తూ, నిజం చెప్తాను. ఏం జరి గిందో నాకు తెలీదు.."

"అంతకు ముందు ఎప్పుడైనా... ఆ విధంగా.."

"ఎప్పుడూ లేదు. అదే తొలిసారి" సంధ్య అడ్డొస్తూ అంది.

"రెండో రాత్రి మీ ఇంట్లో, ఆ తరువాత ఇక్కడ కిరణ్ ఇంట్లో వాంతి చేసుకున్నావ్. ఎందుకు?" సంధ్య ముఖంలోకి తదేకంగా చూస్తూ అడిగాడు వినయ్.

సంధ్య అతని ముఖంలోకి చిరునవ్వు నవ్వుతూ చూసింది. "వాంతి వచ్చింది, చేసుకున్నాను!"

"ఆరోజు నిన్ను బాత్‌రూంలో బట్టలు లేకుండా చూశాను కదా! అప్పుడు భయపడ్డావా?"

"సిగ్గుపడ్డాను. కోప్పడ్డాను. భయపడలేదు!" సంధ్య తలదించుకుంటూ అంది.

"అయితే, ఆ రాత్రి నన్ను చూడగానే మంచం మీంచీ దూకి, అరుస్తూ, హిస్టీరియా వచ్చిన దానిలాగా కేకలు పెడుతూ గది మూలలో నక్కి కూచున్నావు. నన్ను గెటౌట్ అన్నావు. తలుపు తాళం వేసి పడుకున్నావు. ఎందుకు?"

"భయపడ్డాను."

"నన్ను చూసి భయపడ్డావా?"

"ఔను!"

"ఎందుకు?"

"ఏం చేస్తావో అని భయపడ్డాను."

"ఏం చేస్తాననుకున్నావు?"

సంధ్య వినయ్ కళ్ళల్లోకి సూటిగా, జాలిగా చూసింది. "తెలీదు."

వినయ్ నివ్వెరపోతూ చూశాడు. అతనికి తెలీకుం డానే, అతనిలో సంధ్య పట్ల జాలి పుట్టుకొస్తోంది. బరువుగా నిట్టూర్చి తనముందు నిర్మానుష్యంగా ఉన్న రోడ్డును చూస్తూ ఉండి పోయాడు. మెల్లిగా తల తిప్పి సంధ్య వైపు చూశాడు. ఆమె బాబ్డ్ హెయిర్‌తో ఆడుకుంటోంది పచ్చికబయళ్ళ మీంచీ వచ్చే గాలి.

"సంధ్యా నీకు తెలీనిదీ, నాకు తెలీనిదీ – ఇద్దరికీ అర్థంకానిదీ ఏదో మనిద్దర్నీ ఫుల్‌ఫ్లెడ్జ్‌డ్ భార్యాభర్త లుగా రూపొందకుండా అడ్డుపడుతోంది. ఆ అదృశ్య దుష్టశక్తిని మన కళ్ళు చూడలేవు. మన మేధస్సులు పసికట్టలేవు. ఆ శక్తిని చూసి, మనకు చూపించగలి గిన వాళ్ళను, దానిని తరిమికొట్టి మనల్ని ఏకం చేయగలిగిన వాళ్ళను మనం ఆశ్రయించాలి. వాళ్ళ సహాయం తీసుకోవాలి. నువ్వూ, నేనూ భార్యాభర్తలుగా ఒకరికొకరం అంకితం కావాలి. జీవితాల్ని అర్థవంతం చేసుకోవాలి. మన తల్లిదండ్రుల్ని సంతోషపెట్టాలి. ఈ ప్రయత్నంలో నీ సహాయం కావాలి.."

"ఏం కావాలి? నేను ఏంచేయాలి?" సంధ్య ప్రశ్నించింది.

"ఒక ప్రముఖ సెక్సాలజిస్టును మనం కలుసు కోవాలి. అవసరమైతే నువ్వు ఆయన ట్రీట్‌మెంట్ తీసుకోవాలి. వస్తావా?" వినయ్ తగ్గుస్వరంతో ప్రాధేయపూర్వకంగా అడిగాడు.

సంధ్య అతని ముఖంలోకి సీరియస్‌గా చూసింది. ఉన్నట్టుండి ఫక్కున నవ్వింది. "వినయ్... ఎంత అమాయకుడివి? నన్ను అంతగా అడగలా? ఎప్పుడెళ్ళాలి ఆ సెక్సాలజిస్టు దగ్గరికి?"

వినయ్ ముఖం మీద చిరునవ్వు మెరిసింది. "థాంక్యూ సంధ్యా! అందుకే నువ్వంటే నాకిష్టం."

"నేనంటే నాక్కూడా ఇష్టమే!" సంధ్య నవ్వుతూ అంది.

వినయ్ అర్థం కానట్టు చూశాడు. సంధ్య చిన్నగా నవ్వింది.

"ఏమిటలా చూస్తున్నావు? ప్రతి మనిషికీ తనంటే ఇష్టం! తనంటే ఎంతో ఇష్టం! అందులో ఆశ్చర్య పడాల్సిందేముంది?"

వినయ్ మాట్లాడకుండా కారు స్టార్ట్ చేశాడు. అతనిలో వేరే ఆలోచనలు సాగుతున్నాయి. సెక్సాల జిస్ట్ జాన్‌డేవిడ్ అన్నమాటలు అతనికి గుర్తొస్తున్నాయి. "సమస్య ఏమిటో మీరు చెప్పారు. దానికి కారణం ఏమిటో కనిపెట్టాలి. అందుకు రోగిని పరీక్షించాలి. శారీరకంగా, మానసికంగా. మీ భార్యను తీసుకు రండి" అన్నాడు డాక్టర్ జాన్‌డేవిడ్ ఇంగ్లీషులో.

"సంధ్య రానంటే ఏం చేయాలి?" అడిగాడు తను. "ఆమె పేషెంటు... వచ్చితీరాలి. రావడమే కాదు; చికి త్సలో మాతో సహకరించాలి." అన్నాడు డాక్టర్. సంధ్యను నయానో భయానో ఒప్పించు అన్నాడు కిరణ్. అదృష్టం బాగుంది. సంధ్య సులభంగానే ఒప్పుకుంది!

"వినయ్ ఏమిటాలోచిస్తున్నావు?" సంధ్య ప్రశ్న వినయ్‌ని ఆలోచనల్లోంచి ఇవతలకి లాగింది.

"నీ గురించే. ఇంకా కరెక్టుగా చెప్పాలంటే మన గురించే!" వినయ్ చిన్నగా నవ్వాడు.

"ఎప్పుడెళ్ళాలి డాక్టర్ దగ్గరకు?" సంధ్య అడి గింది.

"రేపే"

"నాకు భయంగా ఉంది."

**మనిద్దరం కలవకుండా ఏదో అదృశ్య శక్తి అడ్డుపడుతోంది సంధ్య. అదేంటో మన కళ్ళు చూడలేకపోతున్నాయి. మన మేధస్సు పసికట్టలేకపోతోంది. ఆ శక్తిని చూసి మనకు చూపించగలిగిన వాళ్లను, దానిని తరిమికొట్టి మనల్ని ఏకం చేయ గలిగినవాళ్ళను మనం ఆశ్రయించాలి. అందుకు నువ్వు సహక రిస్తావా? అంటూ అడిగాడు వినయ్. దానికి సంధ్య ఏమన్నది? ఆ తరువాత ఏంజరిగింది?**



వినయ్ తల తిప్పి చూశాడు. "దేనికి?"

"ఇంగ్లీషుభాష, అమెరికాయాస నాకు కొత్త. ఒక్క ముక్క అర్థం కాదు."

"అది సమస్యే కాదు. డాక్టర్ జాన్‌డేవిడ్ కుడిభుజంగా ఒక లేడీ సెక్సాలజిస్టు ఉంది. మన అదృష్టం కొద్దీ ఆమె తెలుగావిడ. పేరు డాక్టర్ జలజ."

"అలాగా?"

"సంధ్యా... ఒకటడగనా?" వినయ్ రోడ్డునే చూస్తూ అన్నాడు.

"అడుగు.."

"పెళ్ళయ్యాక... ఇన్నాళ్ళయినా.. మనం ఇలా ఒకరి కొకరు దూరంగా ఉండడం నీకు కష్టంగా లేదా? బాధ కలగడం లేదా?" వినయ్ సంధ్య వైపు ఓరగా చూశాడు.

సంధ్య వెంటనే సమాధానం చెప్పలేదు. ఆమె చూపులు రోడ్డు మీదే ఉన్నాయి. సంధ్య సమాధానం చెప్పదా?

"నీకు కష్టంగా ఉందా?" అతని ప్రశ్నకు సమాధానంగా ప్రశ్నను రువ్వింది సంధ్య.

వినయ్ బరువుగా నిట్టూర్చాడు. "కష్టంగా ఉంది. నిజం చెప్పాలంటే బాధగా ఉంది. విచారంగా ఉంది. నిరాశగా ఉంది. నిస్పృహగా ఉంది. జీవితం అర్థరహితంగా ఉంది."

"అలాగా! అంత దారుణంగా ఉందా? దురదృష్టం!" సంధ్య చిన్నగా నవ్వింది. "నాకు అలా లేదు. పెళ్ళికి ముందు ఎలా ఉందో, ఇప్పుడూ అలాగే ఉంది."

వినయ్ ఆశ్చర్యంగా చూశాడు, తల తిప్పి. ఆమె రోడ్డునే చూస్తోంది.

"ఎందుకో తెలుసా?"

"తెలీదు.." వినయ్ బొంగురుగా అన్నాడు.

"దూరమయ్యామన్న భావనా, బాధా ఎప్పుడు కలగాలి, సహజంగా? దగ్గరైన తరువాత. మనం ఇంత వరకూ దగ్గర కాలేదు; దూరంగా పోలేదు. యథా తథస్థితి; స్టేటస్ కో" సంధ్య నవ్వింది.

"సంధ్యా, నువ్వు నాకు అర్థం కావు.." వినయ్ బలహీనంగా అన్నాడు. కారు వేగం పుంజుకుంది.

***

"మిసెస్ సంధ్యా, మిస్టర్ వినయ్!" యూనిఫామ్‌లో ఉన్న నర్సు గుమ్మంలో నిలబడి పిలిచింది.

సంధ్య, వినయ్ కూచున్న చోటు నుంచి లేచారు. నర్సు వాళ్ళకి తెల్లని పళ్ళు చూపిస్తూ చిరునవ్వు నవ్వింది.

"దిస్ వే ప్లీజ్" అంది నవ్వు మొహంతోనే.

"మిసెస్ సంధ్యా, ప్లీజ్

## శ్రియకు అవకాశాలు అందుకేనట!

హీరోయిన్ శ్రియ తెరమీదకన్నా కూడా ప్రారంభోత్సవాలలోనే ఎక్కువగా కనిపిస్తూ ఉంటుంది. మరే హీరోయిన్‌కూ లేనన్ని ప్రారంభోత్సవాలు ఆమె ఖాతాలో వచ్చి చేరుతుంటాయి. దానికి కారణం ఒకటి ఉందట! ప్రారంభోత్సవాలకు సినీ తారలను ఆహ్వానించేందుకు కొంత మంది ఏజెంట్లు ఉంటారట! తారలను తీసుకు వచ్చినందుకు ఆయా కంపెనీలు వారికి కొంత ముట్టచెబుతుంటాయి. కానీ శ్రియ మాత్రం పర్సనల్‌గా తన రెమ్యునరేషన్ నుంచి కొంత మొత్తాన్ని వారికి ఇస్తుందట! ఈ కారణంగానే ఎక్కడ ప్రారంభోత్సవం జరిగినా ముందుగా శ్రియ పేరే వినిపిస్తుందట! సినిమాలు లేకపోయినా, ఈ విధంగా క్షణం తీరిక లేకుండా ఉండడం శ్రియకు మాత్రమే సాధ్యమైన విద్య అంటున్నారు సినీ జనాలు. ఇదే పద్ధతిని మిగతా వారూ ఫాలో అయితే మరి శ్రియ పరిస్థితి ఏమిటని? మరికొందరు అనుమానాన్ని వ్యక్తం చేస్తున్నారు.



సిడౌన్" అంది లోపలి గదిలో కుర్చీ చూపిస్తూ. "బీపీ చెకప్" అంది చేతిలోని ఫైల్స్‌ని టేబుల్ మీద పెడుతూ.

బీపీ చెక్ చేసి ఫైల్లో నోట్ చేసింది; "నార్మల్" అంటూ.

"హైట్ ప్లీజ్" అంటూ సంధ్య చేతిని పట్టుకుని గోడ దగ్గరగా నిలబెట్టింది. ఎత్తు చూసి ఫైల్లో నోట్ చేసింది.

"నౌ యువర్ వెయిట్" అంటూ మిషన్‌ని చూపించింది. సంధ్య బరువు చూపే మిషన్ ప్లాట్‌ఫాం మీద నిలబడింది. నర్సు వెయిట్ నోట్ చేసింది. వినయ్ బీపీ నోట్ చేసింది. హైటూ, వెయిటూ నోట్ చేసింది నర్సు, నవ్వును మొహం మీద నాట్యం చేయిస్తూ.

"నౌ.. కమ్ విత్‌మీ ప్లీజ్" అంది నర్సు ఫైల్సు తీసుకుని లోపలి గదిలోకి దారితీస్తూ.

లోపలి గదిని వినయ్ పరిశీలనగా చూశాడు. గది అద్దంలా ఉంది. ఎదురుగా రెండు తలుపులు ఉన్నాయి. ఒకదాని పక్కన 'డాక్టర్ జాన్ డేవిడ్' అనే నేమ్ ప్లేట్ ఉంది. రెండో తలుపు పక్కన 'డాక్టర్ జలజ' అనే నేమ్ ప్లేట్. నర్సు డాక్టర్ జాన్ డేవిడ్ కన్సల్టింగ్ రూం తలుపు మీద వేళ్ళ కణుపుల్తో చప్పుడు చేసి, తలుపును లోపలికి నెట్టింది. "ప్లీజ్ గో ఇన్" అంది ఇద్దర్నీ ఉద్దేశించి.

వినయ్ చెయ్యి పట్టుకుని సంధ్యను లోపలికి తీసుకెళ్ళాడు. డాక్టర్ కుర్చీ ఖాళీగా ఉంది. కుర్చీ వెనుక గోడకి వరసగా కొన్ని ఫోటోలు ఉన్నాయి. ఫ్రాయిడ్, యాడ్లర్, జంగ్, హేవలాక్ ఎల్లిస్. అందరూ సెక్స్ అండ్ సైకాలజీ విషయంలో మేధావులు.

ఎదురుగా ఉన్న కర్టెన్ దగ్గర అలికిడి అయింది. వినయ్ తల తిప్పి చూశాడు. యాభై ఏళ్ళు దాటిన వ్యక్తి కర్టెన్ తొలగించుకుని గదిలోకి వచ్చాడు. బట్టతల. ట్రిమ్ చేసిన తెల్లటి గెడ్డం. కళ్ళకి గోల్డ్ రిమ్డ్ అద్దాలు. వెడల్పాటి నుదురు. నుదురు మీద గీతలు. డార్క్ కలర్ సూట్ పైన వైట్ వోవరాల్.

"అయామ్ డాక్టర్ జాన్ డేవిడ్.."

"హలో డాక్టర్" వినయ్ చిరునవ్వు నవ్వాడు. "మై వైఫ్ సంధ్య"

"హలో డాక్టర్" సంధ్య అంది.

డాక్టర్ జాన్ డేవిడ్ ఎదురుగా ఉన్న కుర్చీలు చూపిస్తూ, తన రివాల్వింగ్ కుర్చీలో కూర్చున్నాడు.

"యూ ఆర్ ఫ్రం?"

"ఇండియా, డాక్టర్" వినయ్ అన్నాడు.

"ఓహ్...ద ల్యాండ్ ఆఫ్ వాత్సాయన అండ్ కామసూత్ర!" డాక్టర్ జాన్ డేవిడ్ ఉత్సాహంగా అన్నాడు. "కామసూత్ర... గ్రేటెస్ట్ బుక్ ఆఫ్ కాంజుగల్

లవ్ ఎవర్ రిటన్! హావ్ యూ రీడిట్!"

"నో డాక్టర్.." వినయ్ సిగ్గుపడుతూ అన్నాడు.

"యూ బోత్ షుడ్ రీడిట్. కామసూత్ర ఈజే టెక్స్ట్ బుక్ టు మ్యారీడ్ కపుల్! రీడిట్!"

వినయ్ అలాగే అన్నట్టు తల పంకించాడు.

తలుపు తట్టిన చప్పుడు. వైట్ వోవరాల్‌లో ఉన్న లేడీ డాక్టర్ లోపలికి వచ్చింది. "డాక్టర్" అంది జాన్ డేవిడ్‌ని చూస్తూ.

"దిసీజ్ డాక్టర్ జలజ. ఫేమస్ సెక్సాలజిస్ట్ ఫ్రం ఇండియా. షీ ఈజ్ మై రైట్ హ్యాండ్!" డాక్టర్ జాన్ డేవిడ్ పరిచయం చేశాడు. "మిస్టర్ వినయ్, మిసెస్ సంధ్య డాక్టర్."

డాక్టర్ జలజకు సంధ్యా, వినయ్ నమస్తే చెప్పారు. డాక్టర్ జలజ చిరునవ్వుతో తలాడించింది.

"జలజా, టేక్ మిసెస్ సంధ్య విత్ యూ. ఐ వాంట్ కంప్లీట్ ఫిజికల్ చెకప్" డాక్టర్ జాన్ జలజకు ఫైల్ అందిస్తూ అన్నాడు.

వినయ్ డాక్టర్ జలజ వైపు చూశాడు. "డాక్టర్, సంధ్య అమెరికాకి పూర్తిగా కొత్త. అమెరికన్ ఇంగ్లీషు ఆమెకు బొత్తిగా అర్థంకాదు..?"

"నో ప్రాబ్లం...మన మాతృభాషలో మాట్లాడుకుందాం." డాక్టర్ జలజ నవ్వుతూ అంది. "సంధ్యా

"ఆ..ఇద్దరం కలిసి తిరిగాం."

"ఆమెను ఒక్కసారి గానీ, ఎక్కువసార్లు కానీ కౌగిలించుకున్నారా? పెళ్ళికి ముందు.."

"ఒక్కసారి కూడా లేదు."

"ఆమెను ముద్దు పెట్టుకున్నారా?"

"లేదు.."

"ముద్దు కూడా పెట్టుకోలేదా?" డాక్టర్ జాన్ డేవిడ్ ఆశ్చర్యాన్ని దాచుకోకుండా అడిగాడు.

"లేదు.."

"ఓకే..ఆమెను ముట్టుకున్నారా?"

"అప్పుడప్పుడు చేయి పట్టుకున్నాను."

"ఇప్పుడు చెప్పండి; పెళ్ళయ్యాక కౌగిలింత?"

"లేదు.

"ముద్దు"

"లేదు"

"బలవంతంగా ఆమెను లొంగదీసుకునే ప్రయత్నం చేశారా?"

"నెవర్!"

"ఓకే... నిద్రలో ఉన్నప్పుడు, ఎప్పుడైనా ఆమెను శారీరకంగా పొందే ప్రయత్నం చేశారా?"

"లేదు."

"మిస్టర్ వినయ్, మిమ్మల్ని ఎప్పుడైనా మీ భార్య




రండి!"

సంధ్య లేచి డాక్టర్ జలజ వెంట నడిచింది. డాక్టర్ జాన్ డేవిడ్ సంధ్యనే చూస్తూ ఉండిపోయాడు. తలుపు మూసుకున్నాక వినయ్ వైపు చిరునవ్వు నవ్వాడు.

"యువర్ వైఫ్ ఈజే రియల్ బ్యూటీ"

"థాంక్స్ డాక్టర్."

"మిస్టర్ వినయ్.. ఐవిల్ క్వశ్చన్. యూవిల్ ఆన్సర్" అంటూ ఫైల్‌ని ముందుకు లాగి తెరిచాడు. బాల్ పాయింట్ పెన్ అందుకున్నాడు.

"మీ వయసెంత?" డాక్టర్ జాన్ డేవిడ్ ఆంగ్లంలో ప్రశ్నించాడు.

"ఇరవై తొమ్మిది"

"మీది లవ్ మ్యారేజా?" ఫైల్లో రాసుకుని ప్రశ్నించాడు డాక్టర్.

"కాదు. అరేంజెడ్ మ్యారేజ్"

"పెళ్ళికి ముందు మీరు సంధ్యతో కలిసి తిరిగారా?"

నగ్నంగా ఉన్నప్పుడు చూశారా?"

"లేదు."

"మీరెప్పుడైనా ఆమెను నగ్నంగా చూశారా?"

"పదిహేను రోజులప్పుడు బాత్‌రూమ్‌లో చూశాను. అదే మొదటిసారి. అదే చివరిసారి."

"ఆమె ఎలా రియాక్టయ్యింది?"

"సిగ్గుపడింది. కోప్పడింది."

"మిస్టర్ వినయ్, ఫస్ట్ నైట్ నుండీ నిన్నటిదాకా ఏం జరిగిందో, మీ ఇద్దరి మధ్యా ఏం జరిగిందో వివరంగా ఏదీ దాచకుండా వరసగా చెప్పండి. ఎంత చిన్న విషయం అయినా సరే, చిన్న సంఘటన అయినా సరే, వదలకుండా చెప్పండి" డాక్టర్ జాన్ డేవిడ్ కుర్చీలో వెనక్కి వాలుతూ అన్నాడు.

వినయ్ ఆంగ్లంలో చెప్పడం ప్రారంభించాడు.

***

డాక్టర్ జలజ తలుపు మూసి గొళ్ళెం బిగించింది. చిరునవ్వుతో సంధ్య వైపు చూసింది. "సంధ్యా, దుస్తుల్ని తీసేసి, హ్యాంగర్స్‌కి తగిలించండి."

సంధ్య కంగారుగా చూసింది. "ఏ దుస్తులు?"

"అన్నీ!" డాక్టర్ జలజ అంది. "తీసేశాక టేబుల్ మీద వెల్లకిలా పడుకోండి."

"ఎ... ఎందుకు, డాక్టర్?" సంధ్య కంగారుగా అడిగింది.

"ఫిజికల్ ఎగ్జామినేషన్" డాక్టర్ జలజ వివరించింది. "కంగారేం లేదు. ఇక్కడికి ఎవ్వరూ రారు." డాక్టర్ జలజ చేతులకి గ్లవ్స్ తొడుక్కుంది.

సంధ్య సిగ్గుపడుతూ ఒక్కొక్కటిగా దుస్తులన్నింటినీ తీసివేసింది. నేలచూపులు చూస్తూ టేబుల్ మీద కూచుంది. నెమ్మదిగా వెల్లకిలా పడుకుంది. టేబుల్ పైన స్టాండ్‌కి ఉన్న లైట్స్ వెలిగాయి.

డాక్టర్ జలజ టేబుల్ దగ్గరగా వచ్చింది. పక్కనే బల్లమీద ట్రేలో ఉన్న ఎన్నో పరికరాల్లోంచి ఒక పరికరాన్ని తీసుకుంది. చిరునవ్వుతో సంధ్య మొహంలోకి చూసింది.

"సంధ్యా, కాళ్ళని మోకాళ్ళ దగ్గర ముడుచుకోండి. మీకేమీకాదు. జస్ట్ రిలాక్స్."

సంధ్య కాళ్ళు ముడిచి, కళ్ళు మూసుకుంది. డాక్టర్ జలజ చెయ్యి సంధ్య మోకాలి మీద వాలింది.

***

"ఓకే మిస్టర్ వినయ్. ఫిజికల్ ఎగ్జామినేషన్ అయ్యాక మీ భార్యను ప్రశ్నిస్తాం. పరిస్థితిని బేరీజు వేస్తాం. సైకో అనాలిసిస్ అంటారు దాన్ని. ఇప్పుడు రెండు గంటల పాటు ప్రశ్నిస్తూ ఆమెను స్టడీ చేస్తాం. అన్నింటినీ పరిగణనలోకి తీసుకుని, డీటెయిల్డ్ ఫైల్ తయారు చేస్తాం. డాక్టర్ జలజా, నేనూ అప్పుడు అవసరాన్ని బట్టి శారీరకంగా లేదా మానసికంగా చికిత్స నిర్దేశిస్తాం. ఎల్లుండి సోమవారం సాయంత్రం ఆరు గంటలకి రండి. అన్నీ తెలుస్తాయి" డాక్టర్ జాన్ డేవిడ్ ఆంగ్లంలో వివరించాడు.

"అలాగే డాక్టర్"

"మీ భార్య అనాలిసిస్ అయ్యేదాకా బైట గదిలో వెయిట్ చెయ్యండి" డాక్టర్ జాన్ డేవిడ్ అన్నాడు.

"థాంక్యూ డాక్టర్" అంటూ వినయ్ కుర్చీలోంచి లేచాడు.

***

"ఓకే... అయిపోయింది" డాక్టర్ జలజ సంధ్యను చూస్తూ అంది.

"లేచి డ్రెస్ చేసుకోండి."

సంధ్య తేలిగ్గా ఊపిరి పీల్చుకుని కిందికి దిగింది. కర్టెన్ వెనక్కి వెళ్ళింది. రెండు నిమిషాల్లో డ్రెస్ చేసుకుని ఇవతలకి వచ్చింది.

"డాక్టర్, నేను వెళ్ళొచ్చా?"

ఫైల్లో రాయడం ముగించి, డాక్టర్ జలజ సంధ్య వైపు తలెత్తి చూసింది. "డాక్టర్ జాన్ డేవిడ్ గారితో క్వశ్చన్ అండ్ ఆన్సర్ సెషన్ ఉంది. ఆయన మాటల్ని నేను తెలుగులో అనువదిస్తాను. మీ సమాధానాల్ని ఆయన కోసం ఇంగ్లీషులోకి అనువాదం చేస్తాను.."

"ఓహ్.."

"కాసేపు ఆ కుర్చీలో కూర్చోండి. తరువాత పిలుస్తాం." డాక్టర్ జలజ ఫైల్ తీసుకుని, తలుపు తెరుచుకుని అవతలికెళ్ళింది.

**(ఇంకా వుంది)**

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## PCOD సమస్యకు సరైన పరిష్కారం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



ప్రస్తుత కాలంలో ఆధునికతతో ముందుకు సాగుతున్న నేపథ్యంలో మానవుని జీవన విధానంలో ఎన్నో మార్పులు ఏర్పడుతున్నాయి. వీటి వలన సరైన ఆహార నియమాలు పాటించకపోవడం, అధిక మానసిక ఒత్తిడికి లోనవడం, వ్యాయామాలు చేయకపోవడం వంటి అంశాల కారణంగా – నేడు ఎక్కువ మంది ఎన్నో రకాల ఆరోగ్య సమస్యలకు గురవుతున్నారు. వీటిలో ఎక్కువ శాతం స్త్రీలను వేధిస్తున్న సమస్యలలో పీ.సీ.ఓ.డి. సమస్య ఒకటి. ఈ PCOD సమస్యను ఎదుర్కొంటున్న మహిళలలో హార్మోన్‌ల అసమతుల్యత ఏర్పడటం జరుగుతుంది. దీని వలన ఋతుచక్ర సమస్యలు కలుగుతాయి. యుక్తవయస్సు వారిలో ఇది తొలుత – మొటిమలను, అవాంఛిత రోమాలను మరియు అధిక బరువును కలుగజేస్తే – వివాహిత మహిళలలో 'సంతానలేమి'కి దారితీస్తుంది. ఈ సమస్యకు సరైన చికిత్స అందించకుండా నిర్లక్ష్యం వహిస్తే ఇది డయాబెటిస్ మరియు గుండె సంబంధిత వ్యాధులకు దారితీసే అవకాశం ఉంటుంది.

**'పీ.సీ.ఓ.డి.' అంటే:-** అపరిపక్వమైన అండం (ఇమ్మెచ్యూర్ ఫాలికల్) నీటి బుడగల వలె మారి అండాశయపు గోడలపై ఉండిపోవటాన్ని పాలిసిస్టిక్ ఒవేరియన్ డిసీజ్ (PCOD) అంటారు. సాధారణంగా ఋతుచక్రము ఉన్న మహిళలలో నెలసరి అయిన 11–14 రోజుల మధ్యన రెండు అండాశయాలలో – ఒక అండాశయం నుండి అండం విడుదల అవుతుంది. ఈ విధంగా ప్రతి నెలలో ఎడమ వైపున లేదా కుడి వైపున ఉన్న అండాశయం నుండి ఒక అండం విడుదల అయి ఫలదీకరణకు సిద్ధంగా ఉంటుంది. కానీ పీ.సీ.ఓ.డి. ఉన్న మహిళలలో అండం విడుదల కాకుండా, అపరిపక్వత చెందిన అండాలు నీటిబుడగల వలె మారి అండాశయపు గోడలపై కనిపిస్తాయి. ఇలా రెండు అండాశయాలపై గనక కనిపిస్తే – దీనిని వైద్యపరిభాషలో బైలేటరల్ పీ.సీ.ఓ.డి. అని అంటారు.




**కారణాలు:** ఈ సమస్యకు గల ఖచ్చితమైన కారణాలు తెలియరాలేదు. కానీ కొన్ని జన్యుపరమైన అంశాల వలన మరియు వంశపారంపర్యత వలన ఈ సమస్య తలెత్తే అవకాశం ఉంది. • F.S.H., L.H., ఈస్ట్రోజన్, టెస్టోస్టిరాన్ హార్మోన్‌ల అసమతుల్యత, సరైన జీవనశైలి లేకపోవడం అంటే – వ్యాయామం మరియు ఆహార నియమాలను పాటించకపోవడం, పిండిపదార్థాలు మరియు జంక్‌ఫుడ్స్ ఎక్కువగా తీసుకోవడం, • అధిక మానసిక ఒత్తిడికి లోనవడం వంటి అంశాల కారణంగా ఈ సమస్య ఏర్పడవచ్చు. • ఇన్సులిన్ రెసిస్టెన్స్: దీనివలన రక్తంలో ఇన్సులిన్ శాతం పెరిగి, టెస్టోస్టిరాన్ హార్మోన్ స్థాయిలు పెరుగుతాయి. ఇది స్థూలకాయానికి దారితీసి పీ.సీ.ఓ.డి. సమస్యను ప్రేరేపిస్తుంది.

**లక్షణాలు:** నెలసరి రాకపోవడం, నెలసరిలో ఎక్కువ లేదా తక్కువ రక్తస్రావం అవటం, నెలసరిలో రక్తస్రావం 4–5 రోజులకు మించి కొనసాగటం, రెండు ఋతుచక్రముల మధ్యలో రక్తస్రావం అవడం • నెలసరి సరిగా వచ్చినా కూడా, అండాశయం నుండి అండం విడుదల కాకపోవడం • ముఖం మరియు వీపు భాగంలో మొటిమలు రావడం • చర్మపు మడతలలో, మెడ భాగంలో చర్మం మందంగా మరియు నల్లగా మారటం • 'సంతానలేమి' సమస్యను ఎదుర్కోవడం • తలనొప్పి, బరువు పెరగడం, తల వెంట్రుకలు ఎక్కువగా రాలిపోవడం • కొందరిలో బరువు సాధారణంగా ఉండటం మరియు మరికొందరిలో బరువు తగ్గటం • ముఖం మరియు ఛాతీపై మగవారికి మాదిరిగా వెంట్రుకలు రావడం • మానసిక కల్లోలం (mood swings) వంటి లక్షణాలు కనిపిస్తాయి.

**దుష్ప్రభావాలు:** టైప్–II డయాబెటిస్, గుండె జబ్బులు, కొలెస్టిరాల్ సమస్యలు, అధిక రక్తపోటు, ఎండోమెట్రియల్ క్యాన్సర్ వంటి సమస్యలకు పీ.సీ.ఓ.డి. దారితీస్తుంది.

**తీసుకోవలసిన జాగ్రత్తలు:** జీవన శైలి మార్చుకుంటూ – ముఖ్యంగా ఒత్తిడి తగ్గించుకోవాలి. క్రమం తప్పకుండా వ్యాయామం చేయాలి. • బరువును అదుపులో ఉంచుకోవడం ద్వారా డయాబెటిస్, అధిక రక్తపోటు, కొలెస్టిరాల్ వంటి సమస్యలకు దూరంగా ఉండవచ్చు. • అధిక కొవ్వు పదార్థాలు మరియు జంక్ ఫుడ్స్ తీసుకోకపోవడం వంటి జాగ్రత్తల ద్వారా పీ.సీ.ఓ.డి. సమస్యను కొంతవరకు నియంత్రణలో ఉంచవచ్చును.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హార్మోన్‌ల అసమతుల్యత వలన తలెత్తే ఎలాంటి వ్యాధులనైనా హోమియోపతి మందుల ద్వారా పూర్తిగా నయం చేయవచ్చు. 'హోమియోకేర్ ఇంటర్‌నేషనల్'లో అందించబడే జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ చికిత్సా విధానం ద్వారా ఎలాంటి దుష్ప్రభావాలు లేకుండా 'పీ.సీ.ఓ.డి.'ని పూర్తిగా నయం చేయడమే కాకుండా, ఎలాంటి కాంప్లికేషన్‌లు ఉన్నా వాటిని తప్పక తగ్గించవచ్చు. యుక్తవయస్సులోనే దీనికి సరైన చికిత్సను తీసుకోవడం వలన సంతానలేమి, ఒబేసిటీ వంటి దుష్ప్రభావాల నుండి మనల్ని మనం కాపాడుకోవచ్చు.

టోల్ ఫ్రీ 1800 108 1212

కన్సల్టేషన్ ఉచితం
955 000 1199

www.homeocare.in



# జీవితమే ఒక ప్రతిఘటన

## (కోట శ్రీనివాసరావు కథాకథనం) 34

(గతవారం తరువాయి)

**శాసనసభ్యునిగా గెలిచాక విజయవాడలో ఆఫీస్ పెట్టాను. విద్య, వైద్యం, రహదారులు, కరెంటు, నీరు లాంటి 12 నిత్యావసరాల జాబితా రాసి.. 'వీటి నిమిత్తమే తన ఆఫీసుకు రావాలని పేర్కొంటూ 'మిగిలిన వాటికి దయచేసి నన్ను సంప్రదించకండి' అనే వాక్యం జోడించాను. హెడ్మాస్టర్‌తో ఫోనులో మాట్లాడి పేద విద్యార్థుల ఏడాది ఫీజులు కట్టి, పుస్తకాలు కొనిచ్చేవాణ్ణి ఇన్ని చేసినాగానీ, నాకు ఆత్మసంతృప్తినిచ్చింది మాత్రం ఒకే ఒక్క పని. అదేమిటంటే ...**

## అలా ప్రశ్నించేవాడిని

ఇరవైఏళ్ళ క్రితం పోలియో బాధితులు కనిపించేవారు. పోలియోవల్ల కాళ్లు బలహీనపడి, చేతులు సన్నగా ఉండి.. రకరకాల ఇబ్బందులున్నవాళ్ళు తారసపడేవారు. వాళ్ళకి చదువుమీద చచ్చేంత ప్రేమ ఉంటుంది. కానీ చదువుకోవడానికి వెళ్ళేందుకు ప్రయాణ సదుపాయాలు మాత్రం శూన్యం. ఎప్పుడూ ఆ విషయం నా మనసులో ఉండేది. అందుకే అలాంటివాళ్ళు ఎవరు కనిపించినా 'బాబూ ఎంత వరకు చదివావు' అని అడిగేవాణ్ణి.

'తొమ్మిది వరకు సార్.. మా పక్కనే బళ్లో తొమ్మిదే ఉంది. మా అమ్మ చంకన ఎత్తుకుని తీసుకెళ్ళి చదివించింది. పదోతరగతికి కాస్త దూరం వెళ్ళాలి. బస్సుల్లో వెళ్ళలేను. పెద్దోణ్ణి అయ్యాను కదా మా అమ్మ ఎత్తుకుని తీసుకెళ్ళలేకపోతోంది' అనేవారు. వినగానే చాలా బాధగా అనిపించేది. వెంటనే ఏదో చేయాలనిపించేది. ఒకసారి మా ఇంట్లో వాళ్ళతో మాట్లాడుతుంటే 'స్పెషల్‌గా ట్రై సైకిల్స్ చేయిద్దాం నాన్నగారూ.. వాళ్ళ అవయవాల పుష్టినిబట్టి వీటిని తయారు చేయిద్దాం' అని మా అబ్బాయి సలహా చెప్పాడు. బేషుగ్గా అనిపించింది.

వెంటనే ఓ కంపెనీతో మాట్లాడి వాళ్ళను చూపించి వాళ్ళ అవసరాలకు తగ్గట్టు ట్రై సైకిల్స్ చేయించాను. అలా దాదాపు పాతిక దాకా బండ్లు చేయించాను. అప్పట్లో అవి 2,500 రూపాయలు ఖరీదు ఉండేవి.

### చంద్రబాబు షేక్‌హ్యాండ్!

ట్రై సైకిల్స్ కూడా పోలీస్ కమిషనర్‌చేత ఇప్పించేవాణ్ణి. వాళ్ళను చూసి పిల్లలు స్ఫూర్తి పొందాలని, చదువుకుని ఉన్నత స్థానాలకు వెళ్ళాలని నా ఉద్దేశం. ఒకసారి విజయవాడలో ఒక పోలీస్ ఆఫీస్ కట్టారు. ప్రారంభోత్సవానికి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడుగారు కూడా వచ్చారు. లోకల్ ఎమ్మెల్యేగా నేను కూడా అక్కడే ఉన్నా. కార్యక్రమం పూర్తయి చంద్రబాబునాయుడు వెళ్ళిపోతూ ఉండంగా, ఆ కమిషనర్ ఆఫ్ పోలీస్ కలగజేసుకుని 'ఒక్క నిమిషం సార్' అని ఆపాడు. వెంటనే నన్ను పిలిచి 'ఏం లేదండీ.. నా సర్వీసులో నేను చాలా మంది ఎమ్మెల్యేలను చూశాను. కానీ కోటగారు ఎమ్మెల్యే అయి ఇన్నాళ్ళవుతోంది.. ఇన్ని రోజుల్లో నాకు ఎప్పుడూ ఈయన ఆఫీస్ నుంచి ఆబ్లిగేషన్ మీద ఒక్క ఫోన్ కూడా రాలేదు' అన్నారు. లారీలు విడిపించమనో, ఎవర్నో పట్టుకుంటే విడిపించమనో ఎమ్మెల్యేలనుంచి పోలీసులకు ఫోన్లు వచ్చేవట. కానీ నేను ఎప్పుడూ ఆ పని చేయలేదు. ఆయన మాటలు విని చంద్రబాబునాయుడుగారు షేక్‌హ్యాండ్ ఇచ్చి నవ్వి పలకరించి వెళ్ళిపోయారు.

అయితే ఆ తర్వాత మాత్రం ఒకసారి నేను ఓ పోలీసుకు ఫోన్ చేయాల్సివచ్చింది. మాకు తెలిసిన వాళ్ళొకరు లారీపైన ఎత్తుగా సామాన్లు అవీ వేసి కట్టుకుని తీసుకెళ్తున్నారట. మధ్యలో ఒక చోట పోలీసులు ఆపి 'వాటిని విప్పి చూస్తాం' అన్నారట. మావాళ్ళేమో నాకు ఫోన్ చేసి 'ఇట్లా సంగతి. ఇప్పుడు విప్పితే కట్టడం కష్టమవుతుంది. నడిరోడ్డు మీద ఉన్నాం' అన్నారు. సరే జెన్యూనే కదా అని నేను ఆ పోలీస్ ఆయన నెంబరు కనుక్కుని ఫోన్ చేశా. అవతల పక్కన ఆయన కూడా చాలా సానుకూలంగా స్పందించారు. 'అయ్యో మీరు ఫోన్ చేయడమెందుకు సార్.. ఆల్రెడీ ఇక్కడున్నవాళ్ళు మాకు వివరించారు. ఏదో రాంగ్ ఇన్ఫర్మేషన్' అని వాళ్ళని వదిలేశారు.

### వ్యాపారస్థుల హర్షం!

విజయవాడలో బందర్‌రోడ్డు వంద అడుగుల రోడ్డు. ఏలూరు రోడ్డును కూడా అంతే వెడల్పు చేయాలనే ఓ విషయాన్ని మున్సిపల్ కమిషనర్ అందరి ముందు పెట్టారు. దాంతో ఆందోళన చెందిన వ్యాపారులు నా దగ్గరికి రిప్రజెంటేషన్‌తో వచ్చారు.. 'మా షాప్ ఉన్నదే 20 అడుగులండీ.. దాన్ని కొట్టేస్తే కష్టమండీ' అని ఒకరంటే 'మాది ఉన్నదే 18 అడుగులండీ.. 11 అడుగులు పోతుందండీ'.. అని చాలా మంది ఇలా బాధలు చెప్పుకొచ్చారు. వాళ్ళల్లో జెన్యూన్‌గా ఉన్నవాళ్లు ఎక్కువ మందే ఉన్నారనిపించింది. బతుకుదెరువుమీద దెబ్బ



కొట్టడం ఎందుకని మున్సిపల్ కమిషనర్‌తో మాట్లాడాను. కనీసం 80 అడుగులు రోడ్డయితే మాకు కొంతలో కొంత లాభమండీ అని వ్యాపారులు అనడంతో గట్టిగా నిలబడి దానికే ఒప్పించగలిగా. అప్పట్లో నేనేం అంత పెద్ద పని చేశానని అనుకోలేదు. కానీ ఆ తర్వాత వచ్చిన ఫోన్లు బట్టి నేను చేసింది చాలా మంచిపనేననిపించింది. దేవినేని రాజశేఖర్ నెహ్రూ ఆ రోడ్డులో అంతకు ముందే కొన్ని కోట్లుపెట్టి ఓ స్థలం కొన్నారట. నిజంగా రోడ్ వైడెన్ చేస్తే ఆయనకి చాలా నష్టం వచ్చేదట. 'చాలా మంచిపని చేశావ్ శ్రీనివాసరావు' అని మెచ్చుకున్నారాయన. హోటల్ వ్యాపారస్థులు కూడా చాలామంది ఫోన్లు చేశారు. వచ్చి కలుస్తామని కూడా అడిగారు. కానీ నేను 'ఈ పనికోసమైతే అవసరం లేదులెండి' అని చెప్పా.

### గట్టిగా నిలదీశా!

ఎమ్మెల్యేగా ఉన్నప్పుడు వెస్టిండీస్ – ఇండియా మ్యాచ్ బెజవాడలో జరిగింది. ప్రైవేట్‌వాళ్ళెవరో కండక్ట్ చేసి టిక్కెట్లు పెట్టి సంపాదించడమో ఏదో మొత్తానికి చేశారు. వెస్టిండీస్ టీమ్ వస్తున్నారని మున్సిపల్ కమిషనర్ రోడ్లు వేయించారు. నేను ఎప్పుడూ ఏ సమస్యనూ ఓవర్‌లుక్ చేసేవాణ్ణి కాదు. ప్రతిదీ క్షుణ్ణంగా గమనించేవాణ్ణి. రోడ్ల దుస్థితి గురించి ఫొటోలు తీసి మున్సిపల్ కమిషనర్‌కు ఓ సారి ఇచ్చాను. 'ఓకే' అన్నారు నాతో. కానీ నా ముందే పక్కన పడేశాడు. 'ఏమిటి ఈయన ఇంత నిర్లక్ష్యంగా ఉన్నాడు. ఎమ్మెల్యేని వచ్చాను. కూర్చోండి అని కూడా అనలేదు. వాళ్ళేదో గవర్నమెంట్ ఆఫీసర్లు.. ఎప్పుడూ ఉండేవారు. నాదేముంది?.. ఐదేళ్ళుండే ఎమ్మెల్యేని అనుకున్నా..' అలా ఒకటీ రెండు సార్లు కాదు.. చాలా సార్లు గమనించా. ఎప్పుడూ యారొగెంట్‌గానే ఉండేవాడు. ఆయన పరిధిలో ఆయనకు పవర్ ఉందని వెస్టిండీస్ టీమ్ దిగిన హోటల్ దగ్గర నుంచి స్టేడియందాకా రోడ్డు డివైడర్లు వేయించడం, షాపులు బాగు చేయించడం, తొమ్మిది లక్షలు ఖర్చుపెట్టి స్టేడియంకు రిపేర్లు చేసి.. మొత్తానికి రూ.30 లక్షల దాకా ఖర్చుపెట్టించారు. అప్పుడు నేను ఆయన్ని అడిగా.. 'ఇంత కార్పొరేషన్ డబ్బు ఎలా ఖర్చుపెట్టారు? పోనీ నేను ఇంతకుముందు ఎన్నిసార్లు రిప్రజెంట్ చేసినా నన్ను పట్టించుకునేవాళ్ళు కాదు. ఇప్పుడు ఈ ఖర్చుకు ఎవరిదగ్గరైనా డొనేషన్లు తీసుకున్నారా?' అని.

'లేదండీ.. వెస్టిండీస్ వాళ్లు మన బెజవాడలో ఆడుతుంటే మనకెంత గౌరవం. అందుకే మేమే ఖర్చుపెట్టాం' అన్నాడు.

'వాళ్ళని ఇక్కడికొచ్చి ఆడమని నువ్వేమన్నా పిలిచావా.. పోనీ అక్కడి కార్పొరేషన్ వాళ్ళేమైనా వస్తున్నారా?' అని నిలదీశా.

'లేదండీ. ఆయన అంత గొప్పగా..' అని ఏదో చెప్పబోయాడు.

'ఆయన ఎవడో ప్రోగ్రామ్ పెట్టాడు. అదేమైనా సేవా కార్యక్రమమా? టిక్కెట్లు పెట్టాడు. అమ్మాడు. ఇంత ఖర్చుపెట్టినందుకు ఆయన దగ్గర నువ్వెందుకు వసూలు చేయలేదు' అని అడిగా. నీళ్ళు నమిలాడు అతను.

ఇదిలా ఉంటే ఓ దఫా దుర్గగుడి ఉత్సవాలు జరిగాయి. భక్తుల సౌకర్యార్థం చాలా మంది పోలీసులు డ్యూటీలు చేశారు. పోలీసులకు దేవస్థానం నుంచి బేటాలు ఇచ్చారు. అది గమనించిన నేను పోలీస్ కమిషనర్‌ని పిలిచి 'ఏవండీ.. అమ్మవారి ఉత్సవాలు జరుగుతున్నాయి.. దానికి సహకరించాల్సింది పోయి పోలీసులు డబ్బులు తీసుకోవడమేంటండీ..' అన్నా. దానికి ఆయన 'కాదులెండి. ఇవ్వాలి. ఎంత కష్టపడతారు' అని ఆయన ధోరణిలో చెప్పుకొచ్చారు. అప్పుడు నేను అందుకున్నా.. 'మరి ఈ మధ్య మ్యాచ్ జరగడానికి ఇంత మంది పోలీస్ సిబ్బందిని ఏర్పాటుచేశారు కదా.. ఆయన దగ్గర ఎన్ని లక్షలు తీసుకున్నారు?.. తీసుకోవాలి కదా.. అమ్మవారి విషయంలోనే వదలకపోతే, ఇది ప్రైవేటు వ్యవహారం. ఎందుకు వదలాలి?' అని అడిగా. ఆయనేమీ మాట్లాడలేదు.

మ్యాచ్ పెట్టిన పెద్దమనిషి స్థానిక ఎమ్మెల్యేకు కనీసం పాసులు కూడా పంపలేదు. ప్రోటోకాల్ పట్టించుకోలేదని నాకూ కోపం వచ్చింది. ఆయన మీదా కేకలేశా.. 'ఎమ్మెల్యేగారిని పిలిచి ఆయన ఎంత మందితో వస్తే అంతమందిని కూర్చోపెట్టండి' అని ఆ నిర్వాహకుడు అన్నాడట. సరే నేను కూడా ఏవీ మనసులో పెట్టుకోకుండా మా మేనళ్ళుళ్ళతో వెళ్లి చూశాననుకోండి.. అదే వేరే విషయం. ఇలా నేను ఎమ్మెల్యేగా ఉన్నప్పుడు అడిగినవన్నీ జెన్యూన్ విషయాలే. అయితే అవి వివాదాస్పదం అయ్యేవి. ఆ ఐదేళ్ళలో ప్రజల్ని, ఇతర విషయాలను బాగా గమనించా. అందుకే ఆ తర్వాత నేను మళ్ళీ పోటీ చేయలేదు. ఎందుకంటే తర్వాతి ఎన్నికల్లో కనీసం పాతిక లక్షలు ఖర్చుపెట్టాల్సి వచ్చింది. నా దగ్గర అంత డబ్బు లేదు. పైగా కుల ప్రాతిపదికన ఓటింగులు.. అవీ మొదలయ్యాయి. పోటీచేసి ఎందుకు ఓడిపోవాలి? అని పరిస్థితుల్ని అర్థం చేసుకుని వదిలేశా. దానికి తోడు నా ప్రొఫెషన్ కూడా దెబ్బతింటుందని కాస్త భయమేసింది.

**(ఇంకా ఉంది)**

**–డా.చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**

**ఒక ఎమ్మెల్యేగా ప్రజలకు సంబంధించిన జెన్యూన్ విషయాలపై ఎంతటి అధికారినైనా గట్టిగా నిలదీసేవారు కోట శ్రీనివాసరావు. స్వలాభం కోసం ప్రైవేటు వ్యక్తులు నిర్వహించిన ఓ కార్యక్రమానికి నిధులు ఖర్చుపెట్టిన మున్సిపల్ కమిషనర్‌ని కూడా నిలదీశారాయన. పోలియో బాధిత విద్యార్థులకు ప్రత్యేకంగా ట్రై సైకిళ్ళు తయారు చేయించి ఇచ్చారు. ఇలా ఎన్నో చేశారు. కానీ ఎన్నికల్లో ఆయన మళ్ళీ ఎందుకు పోటీ చేయలేదంటే....**

## మెల్లిగా జారుకుంది!



ఎమ్మెల్యేగా చేస్తున్న రోజుల్లో బెజవాడలో ఒకసారి మురికివాడకు వెళ్ళా. మగవాళ్లందరూ చేతులు కట్టుకుని వెనకాల ఉన్నారు. ఆడవాళ్లు ముందుకు వచ్చారు. ఒకావిడ నన్ను నిలదీసి 'నాకు నలుగురు పిల్లలు. ఎలా బతకాలి? ఓట్ల కోసం వచ్చావ్... గెలిచావ్... అయిపోయింది. ఇప్పుడొస్తున్నావ్..' అని బాగా దుమ్ముదులిపింది. చుట్టూ 300–400 మంది జనం చేరారు. ఎలా సమాధానం చెప్పాలా? అని రెండు నిమిషాలు మౌనంగానే ఉన్నా. చూస్తే ఆవిడ ఇంటిమీద వేరే పార్టీ జెండా ఎగురుతోంది. 'అమ్మా నేను రెండు ప్రశ్నలు అడుగుతాను' అన్నా. 'అడుగు' అంది రోషంగా.. 'నేను ఎమ్మెల్యేనే కానీ, నౌకరును కాదు. సేవ చేయాలి. చేస్తూనే ఉన్నా.. నువ్వడిగిన వాటికి అన్నిటికీ నేను కారణం కాదు..' అన్నా. చిరాగ్గా చూసింది. 'ఓట్లు వేయించుకోవడానికి వచ్చావు అన్నావు. నీ ఇంటిమీద వేరే పార్టీ జెండా ఉంది.. నువ్వు నాకు ఓటు వేశావంటే ఎలా నమ్ముతాను..' అన్నా. వెంటనే ఆమెలో ఊపు కాస్త తగ్గింది. 'ఇలా అంటున్నానని ఏమనుకోకమ్మా... ఓ ఎమ్మెల్యేని నడిరోడ్డున నిలబెట్టి ఇంతగా ఉతికేస్తున్నావు.. ఇన్ని తెలివి తేటలున్న నీకు నలుగురు పిల్లల్ని కనకూడదని తెలియదా? ప్రభుత్వం ఇద్దరితో ఆపమని నెత్తీనోరూ బాదుకుని చెప్తోంది కదా' అన్నా.. అంతే అక్కడి నుంచి మెల్లగా జారుకుంది. ఇలాంటి అనుభవాలు చాలానే ఉన్నాయి.




**బావ, బావమరిది మంచానికి నవ్వారు బిగిస్తున్నారు ఆరుబయట చెట్టుకింద. ఎన్నికల వేడిలో ప్రచారాలు ఉడుకుతున్నాయి ఊళ్ళో!**

**వేలు నలిగి నొప్పిని దులుపుతున్నాడు బామ్మర్ది. "పనిమీద శ్రద్ధ లేకపోతే ఇలాగే ఉంటుంది. నీ మెదడెక్కడ ఏడుస్తున్నదిరా" అన్నాడు బావ.**

"రాజకీయాల్లో, విలువలు గంతులు వేస్తున్నాయి. గల్లంతులు చేస్తున్నాయెందుకో అని బుర్ర పక్కకు జారింది బావా" చెప్పాడు బామ్మర్ది.

"అవ్వే వెధవ ఆలోచనలంటే" అన్నాడు బావ.

"వెధవ నేనా, నా ఆలోచనా, నేను ఆలోచించే విషయమా".

అదేదో నువ్వే తేల్చుకో అని బావ అంటుంటే, చినిగిన విస్తరికే మీ ఓటు, చినిగిన విస్తరికే మీ ఓటు! అనే కేకలు వీళ్ల దగ్గర వాలాయి!

ఆ గుంపులో ముందు ఉన్నతని చేతులు దండం పెడుతూ అతుక్కుపోయినట్లుగా ఉన్నాయి. మెళ్లో ప్లాస్టిక్ పూలదండ మెరుస్తున్నది. ఏ ప్రశ్న అడిగినా అనుచరుడు (అచ) జవాబు చెబుతున్నాడు.

"వాలకం చూస్తే ఆయన నాయకుడిలా ఉన్నాడు. "నోరేమో నువ్విప్పుతున్నావు, ఆయన మూగా?" అడిగాడు బావ.

"మా నాయకుడు మాటలమనిషి కాదు, చేతల మనిషి. ఆయన భాషే చేతలు" చెప్పాడు అచ.

"సరె సర్లే! ఆ గుర్తేవిటి చిత్రంగా ఉంది" అన్నాడు బావ.

"మా నాయకుడు, అన్నదానాలు చేసీ చేసీ అలసిపోయినందుకు గుర్తుగా ఆ గుర్తులెండి" చెప్పాడు అచ.

"నేనెప్పుడూ ఆ అన్నం తిన్నట్లు లేదే" అన్నాడు బావ.

"తిన్నది అరగని వాళ్ళకు కాదండీ, అరగడానికి తిండిలేని వాళ్ళకు లెండి" జనం లోంచి జవాబు మోగింది.

"అది సరే, అలసిపోవటమేంటి" అడిగాడు బావ.

"అన్నదానాలు చేసిందానికంటే చేస్తున్నామని చెప్పే ఫ్లెక్సీల ఖర్చే తడిసి మోపెడైంది మరి" చెప్పాడు అచ దిగులుగా.

"అవి కూడా ఎక్కడా వేళ్ళాడుతున్నట్లు నేను చూళ్ళేదే" అడిగాడు బావ.

"వేసింది వేసినట్లు అవతలి పార్టీవాళ్ళు లాక్కెళ్ళారండీ బాబో" బావురుమన్నాడు అచ.

"అయితే, మీరెలా ఊరుకున్నారు" యువతావేశంగా మాట వేశాడు బామ్మర్ది.

"ఊరుకోలే... చేతులు చేసుకున్నాం" చెప్పాడు అచ, ఓపిక సన్నగిల్లుతూ.

"చేతులు బాగానే ఉన్నాయిగా" అన్నాడు బావ.

"విరిగిన చేతులూ, విరగ్గొట్టిన చేతులూ కటకటాలవెనక కిటకిటలాడుతున్నాయి లెండి" జనగళం మోగింది.




"వీళ్ళంతా ఎవరు, ఓటరు మహాశయులేనా" అడిగాడు బావ జనాన్ని కలియజూసి.

"పెగ్గుకీ, లెగ్గుకీ ఆశపడి వచ్చినవాళ్ళయినా ఆ విషయంలో ఒక్కొక్కడూ వందమందితో సమానం" చెప్పి నాలుక్కరుచుకున్నాడు అచ.

"ఏవిటేమిటీ!" ఉత్సుకతగా అడిగాడు బామ్మర్ది.

"ఈయనెవరండీ" అడిగాడు అచ మాట మారుస్తూ.

"నా బామ్మర్దిలెండి. అక్కను పంపించి నేను రాలేదని పండక్కి తీసికెళ్ళడానికి వచ్చాడు. అయినా, వాడికిక్కడ ఓటు లేదులెండి" చెప్పాడు బావ.

"ఫరవాలేదు, మేం చూసుకుంటాం. ఇక్కడే ఉండమనండి. ఏమో చెప్పలేం. ఒక్కడి ఓటుతో ఫలితాలు తారుమారు కావొచ్చు. ఆ ఒక్కడూ యీ ఒక్కడే కావచ్చు" అన్నాడు అచ.

"ఉండమనకుండానే ఉంటా. అయితే నాకేంటటా..." దీర్ఘం తీశాడు బామ్మర్ది.

"విస్తళ్ల కట్ట!!" జనం ధ్వనించింది.

అచకు కోపం వచ్చింది. జనంలోకి వెళ్ళాడు. "మిమ్మల్నెవర్రా, వాగ్దానాలు చేయమంది" అరిచాడు.

"ఎలాగూ యిచ్చేది లేదుగా, కట్టంటే కట్టలు తెంచుకుని ఓటేస్తాడని" ఒకడన్నాడు. అచ విరుచుకు పడ్డాడు. మాటలు తిట్లయ్యాయి. తిట్లు కొట్లాటలయ్యాయి. పరిస్థితి చేయి దాటింది.

"ఏవిటో గొడవ పడుతున్నట్లున్నారే" అన్నాడు బావ.

"ఆc ఏం లేదులెండి, పార్టీలో క్రమశిక్షణ కొంచెం ఎక్కువైంది. అదంతేలే కానీండి. మీ ఓటు నాకే" అంటూ నాయకుడు దండం ముద్రతో కదిలాడు.

***

మంచంమీద వంగి నొప్పిగా కూర్చున్నాడు బావ. నడుం ఒత్తుతున్నాడు బామ్మర్ది.

"ఈ ఒళ్లొత్తే వైద్యంలో సుఖం అంతాయింతా కాదురా. ఎక్కడ నేర్చుకున్నావురా ఈ కళ" అన్నాడు బావ.

"అక్క పెళ్ళి కాకముందు హాయిగా చేతులూపుకుంటూ తిరిగేవాణ్ణి. ఆ తర్వాతే మొదలైంది... " చెబుతూ ఆపి "బావో! బావో! ఏవో తాబేళ్ల వడి వడిగా వస్తున్నాయి" అని కేకతో నించున్నాడు బామ్మర్ది.

మోచేతులు నేలకు ఆనిన దండాలతో పదిమందికి పైగా వచ్చారు.

"పగిలిన బండ గుర్తుకే మీ ఓటు" కోరస్ పాడారు.

"తప్పకుండా వేస్తాం గాని ఆ పాకుడు దండాలాపి కాస్త లేచి నించోండయ్యా. మీ గురించి నేను వంగలేక పోతున్నాను" అన్నాడు బావ.

"లేవం, ఇది మా ప్రచారశైలి".

"పోన్లే! పగిలిన బండా!" సందేహంగా చూశాడు బావ.

"కువారీ! కువారీ!"

"క్వారీ బావా" బామ్మర్ది చెప్పాడు.

"సహజసిద్ధమైన సౌందర్యాలు! కొండల్ని పిండి చేసి పడేస్తున్న గుండా కండలు అని టీవీల్లో పదే పదే చూపించారు. ఆ కండలు మీ కండలేనా ఏంటి, మీ బండ పగల" అన్నాడు బావ.

"టీవీలు మగవాళ్లు చూడడం ఏంటిసార్ మరీ విడ్డూరం. మీ ఇంట్లో ఆడవాళ్లు లేరా".

"లేకేం ఉన్నదే వాళ్ళు" అన్నాడు బామ్మర్ది.

"మహిళా ఓటర్లతోనే రాజకీయ భవిష్యత్తులున్నాయి. బతుకులున్నాయి. ఇంతకీ మీ దగ్గర ఎన్ని ఓట్లున్నాయి సార్".

"మా ఇంట్లో మా చుట్టుపక్కల వాళ్ళింట్లో అద్దెకుండేవాళ్ళతో సహా ఎనభైమంది" చెప్పాడు బామ్మర్ది బావకు నిజం చెప్పే తావివ్వకుండా.

ఒక్కసారే అందరూ లేచి బామ్మర్దిని భుజాల

**పండక్కి బావని తీసుకెళ్ళడానికొచ్చాడు బామ్మర్ది. అంతలో అక్కడ ఎన్నికల సందడి మొదలైంది. చినిగిన విస్తరికే మీ ఓటు అంటూ వచ్చారు కొందరు. వాళ్ళెళ్ళాక పగిలిన బండ గుర్తుకే మీ ఓటు అంటూ మరో పార్టీ దిగబడింది. ఈకలు పీకిన కోడిగుర్తుకే మీ ఓటు బాబూ అంటూ అంతలోనే ఊడిపడ్డాడు మరో మహానుభావుడు. ఈ సందట్లో బామ్మర్ది తప్పులో కాలేశాడు. ఇంకేముందీ? కొంపకూలి నేలమట్టమైంది.**

మీదికి ఎత్తుకున్నారు.

"ఆ ఇంట్లో ఉన్నదే రెండు ఓట్లు. అక్కడే ఇంత సేపూ పడున్నారేంట్రా ఎదవల్లారా, లిస్టు చూడ డం కూడా రాదొక్కఛంటకే" అని దూరం నుంచి నాయకుడి కేక విని అందరూ వెళ్ళిపోయారు.

***

"బావా ఎవరో పెద్దమనిషి ఉలిపికట్టెలా వస్తు న్నాడు" అన్నాడు బామ్మర్ది.

"ఆ సంగతేంటో నువ్వే చూడరా, నాకిప్పుడు ఓపిక లేదు" అంటూ పక్కకు తిరిగి పడుకున్నాడు బావ. బావమరిది బయటికివచ్చి చూసేసరికి, ఉలిపి కట్టె చినిగిన బట్టలతో చిత్రంగా ఉన్నాడు.

"అయ్యో! మీ ఓటు నా ఈకలు పీకిన కోడి గుర్తుకే వేయాలి"

"ఒక్కడివే వచ్చావు. నీకో పార్టీ దానికో లక్ష్యం. మేనిఫెస్టో గట్రా ఏంలేదా" అడిగాడు బామ్మర్ది.

"నేను సర్వస్వతంత్ర అభ్యర్థిని. నాకెందుకు అవన్నీ".

"మహామహా పార్టీలే మల్లగుల్లాలు పడుతు న్నాయి. నీ ఒక్కడివల్ల ఏమవుతుందయ్యా".

"ఏమవుతుందో నీవు నాకు ఓటేసి గెలిపించిన తరువాత చెబుతా" అతని వాలకంలో ఏదో తేడా ఉందని గమనించి "నీకు వందేమాతరం పాటొచ్చా" అడిగాడు బామ్మర్ది. ఏదో పిచ్చి కర్రతో సాము చేస్తూ జంపక్ జపాంగ్, జంపింగ్ జపాంగ్ అని పాడుతూ పారిపోయాడతను. మూడుసార్లు ఇండి పెండెంట్ అభ్యర్థిగా పోటీచేసి ఓడిపోయి మతిభ్రమిం చినవాడని తర్వాత తెలుసుకున్నాడు బామ్మర్ది.

***

"కొంపకూలి నేలమట్టమైంది బావో".

"ఏమైందిరా! అంతా సవ్యంగానే ఉందిగా".

"లేదు బావా లేదు! పండగ ఏ రోజన్నది నీకు తప్పు చెప్పా బావో".

"ఉన్నట్టుండి తప్పు అని ఎలా తెలుసుకున్నావురా".

"ఇదిగో అక్క నుండి వచ్చిన ఉత్తరం చదివితే నీకే తెలుస్తుంది".

"...మిమ్మల్ని వెంట బెట్టుకుని రావడానికొచ్చిన వాడి మెదడుకి చెద ఎలా పట్టిందో, అందులో మీ నిర్వాకం ఏంటో, ఎంతో తెలుసుకుని తగిన చికిత్స చేయడానికీ, మీకోసం వండిన పిండి వంటల్ని ఎండబెట్టి రీసైక్లింగ్ చేసి అల్లారుముద్దుగా ముద్దగా తినిపించడానికీ, మీ కోసం తీసుకున్న తుండు గుడ్డల్ని పీలికలుచేసి మీకు అలంకరించి మీతో అందాల పోటీ పిల్లి నడకలు నడిపించడానికీ ఇక్కడ మీ అభిమాన సంఘాలు తహతహలాడు తున్నాయి..."

"నీ తప్పుకి నా మీద పడింది కదరా పిడుగు".

"తప్పంతా నీదే బావా! లేకపోతే కిందటేడు క్యాలెండర్ని గోడకి తగిలించి అలాగే ఉంచుతాడా ఎవడన్నా".

"పాతదేదో కొత్తదేదో తెలుసుకోలేక పోవడం నీదే తప్పుకదరా".

"తప్పెవరిదో తర్వాతి సంగతి. శిక్ష ఇద్దరం అనుభ వించాల్సిందే. బయల్దేరు బావా".

***




తీరావెళ్తే అత్తగారింట్లో వాతావరణం అనుకున్నదా నికి పూర్తి భిన్నంగా ఉంది. "ఏవిటిక్కడ? అనుకున్నట్లు లేదే! మీరు అట్లా అంటే మేం ఇట్లా అందామనుకున్నాం. ఇట్లా అంటే అట్లా అందామ నుకున్నాం" అన్నాడు బావ భార్య వనస్పతితో.

"అట్లా అనుకోవడాలు ఎప్పుడన్నా ఉన్నాయండీ. ఎస్సెమ్మెస్లూ, వాట్సప్పులూ, ఫేసుబుక్కుల రోజుల్లో ఏదో మీకు సరదాగా ఉత్తరం రాయాలనిపించింది, రాశా నంతే" అంది వనస్పతి.

"ఇంతకీ పండగేంటి? క్యాలెండర్ ఎంత వెతికినా మాకు ఏ పండగా దొరక లేదు".

"మీరు రావడమే పండగ" అంది అత్తగారు.

"అదో ముచ్చటనుకోండి. ఏదో విశేషమైనా ఉండాలిగా. నిప్పులేందే పొగరాదు. పండగ లేందే అల్లుడికి పిలుపురాదు అంటారు".

"చాల్లెండి. మీరు కనిపెట్టి కట్టే సామెతలు" అంది వనస్పతి.

"ఇప్పుడు గుర్తొచ్చింది బావా, కొరికీ కొరక కుండా ఏదో పిండి వంటని కుక్కలకు వేస్తారే ఆ పండగ" అన్నాడు బామ్మర్ది.

"ఓహో కోర్ల పౌర్ణమి అంటారు అదేగా" అన్నాడు బావ.

"బావకు అన్నీ తెలుసురా. ఇదే పండగ మా పెళ్ళైన కొత్తరోజుల్లో వస్తే మూగజీవాలకు ఎంగిలి తిండేవిటని కొరక్కుండానే అరటిలో తప్పాల చెక్కలు కనపడ్డ కుక్కకు విసిరేశారు" అంది వనస్పతి.

## కృతజ్ఞతలు

'సరదా కథలు' శీర్షికన వెలువడిన నా కథల్ని విశేషంగా ఆదరించిన నవ్య వీక్లీ పాఠకులకు కృతజ్ఞతలు. నన్ను ప్రోత్సహించిన సంపాదకవర్గానికీ, ఆంధ్రజ్యోతి యాజమాన్యానికీ నా ధన్యవాదాలు.

—రాంపా

"ఆ మర్నాడేగా బావ కాలుని ఓ కుక్క కొరి కింది. పళ్లతో ఓ రక్తపుబొట్టుని కళ్ళ చూసింది".

"ఈ ముచ్చట్లు యిక చాలు. బావగారికి అసలు సంగతి చెప్పావా లేదా? మీ బావమరిదికి పెళ్ళిచూపులండీ ఎల్లుండి" అంది అత్త గారు.

"ఎల్లుండే మా ఊళ్ళో మున్సిపల్ ఎన్నికల పండగే, మరి! గూగుల్లో మా ఉనికిని పట్టి లాక్కెళ్ళి వేలుమీద బొట్టు పెడతారు వాళ్ళు" అన్నాడు బావ.

"దాందేముందిలెండి, ఆ తర్వాత ఓ మంచి రోజు చూసుకుందాం" అంది అత్తగారు.

***

"అరేయ్! నువ్వు నీ బీటెక్ని పక్కనబెట్టి దిష్టి బొమ్మల వ్యాపారం చేస్తా, చదువుకీ సంపాదనకీ పొంతన లేని రోజులు. ఎవరో ఓ రాజకీయనాయ కుడి ఎఫిజీని ఎవరోఒకరు కాలుస్తూనే ఉంటారు. తరగని డిమాండంటావు. నీక్కాబోయే భార్యేమో డాక్టరు చదివింది. పెద్ద సైకాలజిస్టు! నీ ఆలోచనలు దారి మళ్ళాలిరా" అన్నాడు బావ.

"అదేమోగాని! నీ భార్యతో అవసరం మీ బావకే ఎక్కువ ఉందిరా" అంది వనస్పతి.

"అదేవిటే! బావ మేధావివర్గానికి చెందినవాడు కదే".

"అది నిజమేననుకో! నువ్వు చెప్పిన ఉలిపికట్టె ఎవరోకాదు. మీ బావకు సొంత పెద్ద అన్నయ్య! ఎన్నికల మోత వింటే అలా అవుతారు. లేకపోతే కొంత బాగానే ఉంటారు" చెప్పింది వనస్పతి.

"అందుకేనా! ఆయన వచ్చినప్పుడు నన్ను బయటికినెట్టాడు బావ" ఆశ్చర్యపోయాడు బామ్మర్ది.

**(అయిపోయింది)**



# వెండితెరమీద
# హాజీమస్తాన్

**దావూద్ ఇబ్రహీం చావు బతుకుల్లో ఉన్నా, ఛోటా రాజన్ జైలుకెళ్లినా...'అండర్ వరల్డ్' ఇంకా చేతనంగానే ఉందని సూపర్ స్టార్ రజనీకాంత్‌కు హాజీ మస్తాన్ పెంపుడు కొడుకు పంపిన బెదిరింపు లేఖతో రుజువైంది. ఎన్ని స్మగ్లింగులు, అండర్ వరల్డ్ కార్యకలాపాలకు పాల్పడినా ఒక్క నేరం కూడా రుజువు కాని హాజీ మస్తాన్ కథ 'తలైవర్ 161'తో తెరకెక్కబోతున్న సందర్భంగా ఆ అండర్ వరల్డ్ డాన్ జీవితంలోకి ఓసారి తొంగిచూసే ప్రయత్నం చేద్దాం!**

### అరుదైన వ్యక్తిత్వం

హాజీ మస్తాన్ నిజ జీవితం వెండి తెరకెక్కటం ఇది మొదటిసారేం కాదు. 'దీవార్' సినిమాలో అమితాబ్ బచ్చన్ పోషించిన పాత్ర ఆయనదే! ముకద్దర్ కా సికందర్ అతని జీవితం ఆధారంగా రూపొందిన సినిమానే! 'వన్స్ అపాన్ ఎ టైమ్ ఇన్ ముంబయి' సినిమాలోనైతే దావూద్ ఇబ్రహీం, హాజీ మస్తాన్‌ల మధ్య అనుబంధాన్ని కళ్లకు కట్టినట్టు చూపించారు. హాజీ మస్తాన్ శకం వేరు, ఆయన కథ వేరు. వెండితెర మీద చూపించినట్టు తుపాకీ గుళ్లను గుండెల్లో దింపటం, కిడ్నాప్‌లు, గ్యాంగ్ వార్‌లు, వీధి పోరాటాలు...వీటన్నిటికీ భిన్నమైన, అతీతమైన జీవితం అతనిది. స్మగ్లింగ్‌లతో కోట్లు గడించినా ఆ క్రమంలో ఒక్కరి ప్రాణాలనూ తీయని పక్కా వ్యక్తిత్వం ఉన్న వ్యక్తి అతను. హాజీకి జీవితం విలువ తెలుసు. దాన్ని స్మగ్లింగ్‌లాంటి తుచ్ఛమైన పని కోసం వృథా చేయటం సరికాదనీ అతనికి తెలుసు. ఇక పేదలు, అణగారిన వర్గాల పట్ల అతనిది విశాల హృదయం. నైతిక విలువలు తెలిసిన ఎథికల్ డాన్ అతను. కాబట్టే 1970లలో దుబాయి నుంచి ముంబయికి, ఇతర దేశాలకు బంగారాన్ని అక్రమ రవాణా చేసిన ఈ స్మగ్లర్‌ను ప్రేమగా 'సుల్తాన్ మీర్జా' అని కూడా అప్పట్లో పిలుచుకునేవారు. తమిళనాడులో పుట్టి ముంబయితో ప్రేమలో పడి సామాజిక కార్యక్రమాలు, స్వచ్ఛంద సేవలతో ఇప్పటికీ ముంబయిలోని కొన్ని ప్రాంతాల్లోని పేదలు తనను తలచుకునేలా ముద్ర వేసుకోగలిగిన అరుదైన వ్యక్తి అతను.

### డాన్‌ల గాడ్ ఫాదర్

ముంబయి పోలీసుల వెన్నులో వణుకు పుట్టించిన 'ఛోటా రాజన్, ఛోటా షకీల్, అరుణ్ గావ్లి... వీళ్లందరూ హాజీ మస్తాన్ శిష్యులే! అయితే తాను వేసిన పునాదుల మీద నిలబడిన వీళ్లంతా తర్వాత నరరూప రాక్షసులుగా ఎదిగి మారణహోమాలు సృష్టిస్తారని ఆయన ఊహించలేకపోయాడు. తనకు పట్టున్న అంతర్జాతీయ స్మగ్లింగ్‌లో శిష్యులందరికీ మెలకువలు నేర్పించిన హాజీ స్మగ్లింగ్ లోతుపాతులు వాళ్ల మెదళ్లలో ఇంకేట్లు శిక్షణ ఇచ్చాడు. అయితే డ్రగ్స్, ఆయుధాలు, ఇతరత్రా మనుషుల ప్రాణాలు బలిగొనే వీలున్న వాటన్నిటికీ దూరంగా ఉండాలని కూడా వాళ్లకు శిక్షణలో భాగంగా చెప్పేవాడు. అయితే ఆయన ఆదేశానుసారమే నడుచుకుని రహస్యంగా స్వతంత్ర సామ్రాజ్యాలను స్థాపించుకున్నా నేరుగా హత్యలు చేయటానికి వాళ్లకి చావు భయం అడ్డొచ్చింది. అందుకోసం అనుచరులను తయారుచేసుకుని తమ సామ్రాజ్యాన్ని విస్తరించుకున్నారు. ఇలా శాఖోపశాఖలుగా అండర్ వరల్డ్ మాఫియా విస్తరించటానికి మూలమైన హాజీ మస్తాన్ తాను పుట్టిన తమిళనాడులోనే ఉండిపోయి ఉంటే కథ ఇంత దూరం వచ్చి ఉండేది కాదు. తమిళనాడు నుంచి ముంబయికి వలస వచ్చి అక్కడ డాన్‌గా హాజీ ఎదిగిన వైనం ఆద్యంతం ఎంతో ఆసక్తి కలిగిస్తుంది.

### చెన్నై నుంచి ముంబయికి

చెన్నై తీర ప్రాంతం కడలూరు దగ్గరున్న పన్నాయ్‌కుళంలో 1926లో పుట్టిన హాజీ మస్తాన్ అసలు పేరు 'మస్తాన్ హైదర్ మీర్జా'. ఇతని తండ్రి హైదర్ మీర్జా. కుటుంబ పోషణ కోసం 8 ఏళ్ల వయసులో తండ్రితో కలిసి ముంబయికి వలసవెళ్లిన హాజీ అక్కడి చార్నీ రోడ్‌లోని ఓ చిన్న సైకిల్ రిపెయిర్ షాపులో రెక్కలు ముక్కలు చేసుకునేవాడు. రాత్రి పని ముగించుకుని ఇంటికి వస్తూ దారిలో సముద్ర తీరాన లైట్ హౌసుల్లా వెలిగిపోయే ఎత్తైన భవంతులను చూసి తెగ మురిసిపోయేవాడు. ఏదో ఒకరోజు తానూ అలాంటి ఓ భవంతికి యజమాని నవ్వాలని అప్పుడే కలలు కనటం మొదలుపెట్టాడు. అప్పటికి హాజీకి 20 ఏళ్లు. సైకిల్ షాప్‌లో వచ్చే జీతం ఇంటి ఖర్చులకు సరిపోక 1944లో ఓడరేవులో కూలీగా చేరాడు. అక్కడే కస్టమ్స్ కళ్లబడకుండా బంగారం బిస్కెట్లను అక్రమంగా తరలించే ఓ అరబ్ వ్యాపారితో పరిచయమైంది. అప్పట్లో విదేశాల నుంచి దిగుమతి చేసుకునే బంగారం, వెండి, ఎలక్ట్రానిక్ ఐటమ్స్ మీద సుంకం భారీగా ఉండేది. ఆ సుంకాన్ని తప్పించుకోవటం కోసం స్మగ్లింగ్‌లు మొదలయ్యాయి. అలా ఆ అరబ్ కళ్లలో పడ్డ హాజీ అతనికి నమ్మకస్తుడిగా మారాడు. ఆ తర్వాత హాజీ అతను తరలించే బంగారం బిస్కెట్లను దుస్తుల్లో దాచుకుని ఓడరేవు దాటించటం మొదలుపెట్టాడు. ఫలితంగా పెద్ద మొత్తాల్లో డబ్బు ముట్టేది. క్రమంగా పరిచయాలు పెరిగాయి. సుక్కుర్ నారాయణ్ భాటియా అనే పేరు మోసిన స్మగ్లర్‌తో కలిసి గల్ఫ్ దేశాల నుంచి ముంబయి, డామన్‌కు స్మగ్లింగ్‌లు చేయటం మొదలుపెట్టాడు. అలా తక్కువ సమయంలోనే సముద్ర తీరాన పెద్దార్ రోడ్‌లో భవంతి కట్టుకోవాలనే కలనూ నిజం చేసుకున్నాడు. అంత



పెద్ద భవంతి కట్టుకున్న హాజీ దాని పైన చిన్న పెంట్‌హౌస్‌లోనే ఉండేవాడు.

### సినిమా సంబంధాలు

ముంబయి ఫిల్మ్ ఇండస్ట్రీ మీద హాజీ కన్ను పడింది. సినీ నిర్మాతలు డబ్బు కోసం పడే ఇబ్బందులు తెలుసుకున్న అతను ఫిల్మ్ ఫైనాన్సింగ్ మొదలు పెట్టాడు. అతనికి దీంతోపాటు రియల్ ఎస్టేట్, ఎలక్ట్రానిక్ గూడ్స్, హోటళ్ల మీద కూడా విపరీతమైన ఆసక్తి. ముంబయిలోని మహమ్మదాలీ రోడ్‌లో ఉన్న మనీష్ మార్కెట్‌లో ఎలక్ట్రానిక్ షాపుల్లో ఎక్కువ శాతం హాజీవే! అప్పట్లో మస్తాన్ గ్యాంగ్ లీడర్స్‌తో కూడా సన్నిహితంగా మెలిగేవాడు. అప్పట్లో ముంబయిలో గ్యాంగ్‌ల మధ్య వైరం తలెత్తితే అందరినీ ఒక చోటకి చేర్చి వాళ్లకి మధ్యవర్తిగా వ్యవహరించేవాడు హాజీ. ఒకరికొకరు పోటీగా భావించకుండా ముంబయిని సమంగా పరిపాలించుకునేలా ప్రాంతాలను విభజించి పంచేవాడు. ఇంత చేసినా హాజీకి సొంత గ్యాంగ్ అంటూ లేదు. అలాంటి అవసరం పడితే కరీమ్ లాలా, వరదరాజన్ మొదలియార్‌ల నుంచి సహాయం పొందేవాడు. మరీముఖ్యంగా వరదరాజన్ మొదలియార్ అంటే హాజీ మస్తాన్‌కు ప్రత్యేకమైన అభిమానం. తన ప్రాంతంవాడు కావటంతో వరదరాజన్‌తో ఎంతో సఖ్యంగా మెలిగేవాడు హాజీ. చివరి రోజుల్లో పేదరికంలో చనిపోయిన మొదలియార్ భౌతిక కాయాన్ని చెన్నై నుంచి ముంబయికి తరలించటం కోసం తనే ఓ ప్రైవేట్ చార్టర్డ్ ప్లేన్‌ను అద్దెకు తీసుకున్నాడు. హాజీ మస్తాన్‌కు బాలీవుడ్‌లో ఎంతో మంది ప్రముఖ స్నేహితులున్నారు. దిలీప్ కుమార్, రాజ్‌కపూర్, ధర్మేంద్ర, ఫిరోజ్ ఖాన్, సంజీవ్ కుమార్ హాజీకి సఖ్యులు.

### పలుకుబడీ పెద్దదే!

కొమ్ములు తిరిగిన స్మగ్లర్‌గా పేరు గడించిన హాజీకి ముంబయిలోని ముస్లింల మద్దతు ఉండేది. దాంతో రాజకీయ నేతలూ హాజీ జపం చేసేవారు. రాజకీయ నాయకులకు అతని పట్ల గౌరవం ఎంతటిదంటే ముంబయి విచ్చేసిన ప్రతిసారీ సంజయ్ గాంధీ హాజీని కలవకుండా తిరిగి వెళ్లేవాడు కాదు. అలా చట్టానికి ఏ రకంగానూ చిక్కకుండా తన స్మగ్లింగ్ సామ్రాజ్యాన్ని ఏలేవాడు. అయితే ఓ నిజాయితీ కస్టమ్స్ ఆఫీసర్ హాజీకి చుక్కలు చూపించటం మొదలుపెట్టాడు. అప్పుడు హాజీ అతన్ని వేరే ఊరికి ట్రాన్స్‌ఫర్ చేయించి, అతను విమానం ఎక్కిన తర్వాత పరిగెత్తుకుంటూ వెళ్లి, విమానం నిచ్చెన మీద నిలబడి లోపలున్న ఆ కస్టమ్స్ ఆఫీసర్‌కి నవ్వుతూ చెయ్యి ఊపి సాగనంపాడట. ఇక ఎమర్జెన్సీ సమయంలో అరెస్టయినప్పుడు అతన్ని కొల్హాపూర్‌లోని జైల్లో ఓ రాత్రి ఉంచాల్సి వచ్చింది. అప్పుడు అక్కడి పోలీసులు హాజీకి జైల్లో రాజభోగం అందించారట. తెల్లని దుస్తుల్లో, డ్రై ఫ్రూట్స్ తింటూ జైల్లో సేదతీరుతున్న హాజీ విడుదల కోసం అప్పటి రాష్ట్ర ఆర్థిక మంత్రి ఢిల్లీలో ధర్నా చేయటాన్ని బట్టి హాజీకున్న పలుకుబడి అర్థం చేసుకోవచ్చు.

### జైలు జీవితం తెచ్చిన మార్పు

ఎమర్జెన్సీ సమయంలో జైల్లో గడిపిన 18 నెలల కాలం హాజీలో ఊహించని మార్పు తీసుకొచ్చింది. చట్టం అంటే భయం మొదలైంది. జైలు నుంచి విడుదలయ్యాక జనతా పార్టీ నేత జయప్రకాష్ నారాయణ్ ముందు లొంగిపోయి స్మగ్లింగ్‌కు స్వస్తి చెప్పేశాడు. ఆ తర్వాత హజ్‌కి వెళ్లి వచ్చి అప్పటినుంచి తన పేరు మస్తాన్ ముందు 'హాజీ' (అంకిత భావమున్న ముస్లిం) పెట్టుకున్నాడు. అలా 1970 చివర్లో తన ఇంటి దగ్గరే జనతా దర్బార్‌లు ఏర్పాటు చేసి ప్రజలకు తీర్పులిచ్చేవాడు. అవసరమైనవారికి ఆర్థిక సహాయం చేస్తూ, తన పలుకుబడితో పైరవీలు చేస్తూ, అవస్థల్లో ఉన్నవారికి సాయపడుతూ జీవితం కొనసాగించాడు. అప్పట్లో అతని ఇంటి ముందు ఆహారం కోసం ప్రజలు క్యూ కట్టేవారు. 1980లో దళిత నేత జోగేంద్ర కవాడేతో కలిసి 'దళిత ముస్లిం సురక్షా మహాసంఘ్'ను ఏర్పాటు చేశాడు. కానీ అదీ అతని సినిమాల్లాగే సక్సెస్ కాలేకపోయింది. అలా చివరి రోజులను ప్రజల సేవలో గడుపుతూ 1994లో హాజీ మస్తాన్ గుండెపోటుతో మరణించాడు.

–గోగుమళ్ల కవిత

## పెంపుడు కొడుకు 'సుందర్ శేఖర్'



హాజీకి 'కమ్రున్నీసా, మెహరున్నీసా, షంషాద్' ముగ్గురు కూతుళ్లు. కమురున్నీసా, షంషాద్ ముంబయిలోనే స్థిరపడితే మెహరున్నీసా లండన్ వలస వెళ్లిపోయింది. పెంపుడు కొడుకుగా చెప్పుకుంటున్న సుందర్ శేఖర్‌ది చెన్నై. ఇతను పుట్టక ముందే తండ్రిని, పుడుతూనే తల్లిని పోగొట్టుకున్నాడు. బంధువుల దగ్గర పెరుగుతూ చిల్లర దొంగగా మారి ముంబయి చేరుకుని అలా హాజీ కళ్లలో పడ్డాడు. ఇద్దరి మాతృభాష ఒకటే కావటంతో ఇద్దరి మధ్యా అనుబంధం ఏర్పడింది. తర్వాత హాజీ అతన్ని దత్త పుత్రుడుగా చేసుకుని తన పార్టీ కార్యకలాపాలను అప్పగించాడు. సుందర్‌ను హాజీ ముద్దుగా 'సులేమాన్ మీర్జా' అని పిలుచుకునేవాడు.

హాజీ చనిపోయినప్పుడు అంతిమ సంస్కారాలను సుందర్ పూర్తి చేశాడు. తన తండ్రి గురించిన చిన్ననాటి జ్ఞాపకాలు సుందర్ గుర్తు చేసుకుంటూ.... 'మా నాన్న దుబాయ్ స్మగ్లర్ల నమ్మకాన్ని చూరగొనటానికి ఓ సంఘటన తోడ్పడింది. ఓసారి స్మగ్లింగ్ చేస్తూ దుబాయ్ వ్యాపారి దొరికిపోయి జైలుకి వెళ్లాడు. అతని బంగారాన్ని జాగ్రత్తగా రేవు దాటించిన నాన్న అతను శిక్ష ముగించుకుని బయటకొచ్చాక తిరిగి ఆ బంగారాన్ని జాగ్రత్తగా అతనికి అప్పగించేశాడు. దాంతో అతనికి నాన్న మీద అపార నమ్మకం ఏర్పడింది. అప్పట్నుంచి నాన్నకు పని పెరిగింది. దాంతో సంపాదనా పెరిగింది.' అని చెప్పాడు సుందర్. తనను పెంచి పెద్ద చేసిన హాజీ గురించి సుందర్ ఇంతగా చెప్పుకుంటుంటే హాజీ కూతుళ్లు మాత్రం అతనికీ తమకీ ఎటువంటి సంబంధం లేదంటూ వాదిస్తున్నారు. 'అతను నాన్నకు పుట్టినవాడు కాదు.పెంపుడు కొడుకు అంతకంటే కాదు. అతన్నెప్పుడూ నాన్న తన పెంపుడు కొడుకుగా సమాజానికి పరిచయం చేయలేదు.

నాన్న పేరును వాడుకుని లబ్ధి పొందాలనుకుంటే మేం ఊరుకోం. అతనికి నాన్న ఆస్థి మీద, ఆయన స్థాపించిన సంస్థల మీదా ఎటువంటి హక్కూ లేదు' అంటూ సుందర్ మీద విరుచుకుపడటమే కాదు న్యాయ పోరాటం కూడా మొదలు పెట్టారు.

## హాజీ ఆహార్యం

బాలీవుడ్ నటి సోనాను ప్రేమించి పెళ్లి చేసుకున్న హాజీ ఆమె సినిమాలకు ఫైనాన్స్ చేయటమే కాకుండా జుహులోని దేవానంద్ ఇంటి పక్కనే ఆమెకో పెద్ద బంగళా కట్టించాడు. అయితే ఆయన నిర్మించిన సినిమాల్లాగే సోనా కూడా హీరోయిన్‌గా సక్సెస్ కాలేకపోయింది. అయినా హాజీ సినీతారల తళుకు బెళుకులకు, డాబు దర్పాలకు ఎంతో ఆకర్షితుడయ్యాడు. పేదరికంలో పుట్టిన హాజీ జీవితాన్ని ఆడంబరంగా గడపడానికే ఇష్టపడేవాడు. డిజైనర్ సూట్లు, టైలు ధరించేవాడు. జుట్టును నీట్‌గా వెనక్కి దువ్వేవాడు. టీవీ, రేడియో సౌకర్యాలుండే మెర్సిడెస్ బెంజ్‌లో తిరిగేవాడు. ట్రిపుల్ ఫైవ్ సిగరెట్లు కాల్చేవాడు. ఎవరైనా తనతో ఇంగ్లీషులో మాట్లాడితే 'యా...యా!' అని మాత్రమే సమాధానమిచ్చేవాడు.



# ప్రయాణం

3

(రాచెల్ కలోఫ్ ఆత్మకథ)

-బాలి

సెల్: 98499 63082

**ఛాయ ఇంటి దగ్గర్నుండే నా ప్రయాణం మొదలు పెట్టాలి. అక్కడ గ్రేట్ అంకుల్ దగ్గర్నుండీ బంధువులందరూ వచ్చారు. అందులో కొందరు అబ్రహం చుట్టాలూ ఉన్నారు. ఛాయ ఇంటి నుండి పద్దెనిమిది మైళ్ళు వెళ్తే రైల్వేస్టేషన్ వస్తుంది. అక్కడ బహుశా నన్ను షిప్ ఎక్కించే ఏజెంట్ బ్రెస్కోటోవస్కీ రావచ్చు. అదే జరిగింది.**

ఛాయ ఉత్తరాల్లో ముందుగానే రాసినట్టు స్టేషన్ వెయిటింగ్ రూంలో మేము కూచుని ఉంటే ఆయన వచ్చాడు. నన్ను ఆప్యాయంగా, గౌరవం గానే పిలుస్తున్నాడు. వయస్సులో చాలా పెద్దవాడు. ధైర్యాన్ని కూడగట్టుకొని ఇంతవరకూ వచ్చిన ఇద్దరు ముగ్గురు బంధువుల దగ్గర సెలవు తీసుకుని బండి ఎక్కాను. ఆ బండి పగలూ, రాత్రీ మూడురోజులు ప్రయాణం చేసి రష్యా, పోలెండ్ బోర్డర్‌కి చేరు కుంది. ఆ ఊరి పేరు 'బ్రెస్ట్–లిటోవస్క్'. అది బాగా పెద్ద స్టేషన్. జనం కూడా హడావుడిగా అటూ ఇటూ తిరుగుతున్నారు. దిగినవారు పెద్ద పెద్ద పెట్టెలు మోసుకుంటూ, టాక్సీలు బేరమాడుకుని వెళ్ళిపోతున్నారు. ఇక్కడ వరకూ నన్ను తీసుకొచ్చిన ఏజెంట్ బ్రెస్కోటోవస్కీ నా చేతిలో యాభై డాలర్లు పెట్టి జాగ్రత్తగా ఖర్చు చెయ్యమని, మరో కొత్త వ్యక్తిని పరిచయం చేసి ఆయనతో వెళ్ళమన్నారు. ఆయన పేరు 'సార్వెన్'. ఈ సార్వెన్ నన్ను పోలెండ్, జర్మనీ బోర్డర్ దాటిస్తాడనీ అబ్రహం పంపిన ట్రావెల్ పాస్ నాకందజేస్తాడనీ, ఆ పాస్‌పోర్టు మన బ్యాగ్‌లో ఎప్పుడూ ఉండాలనీ అవసరమైన ప్పుడు ఆఫీసర్లకు చూపాలనీ, పోతే చిన్న చిన్న విష యాలు ఆయనే చూసుకుంటాడనీ, తాను వెనక్కు వెళుతున్నాననీ చెప్పాడు. సార్వెన్ మంచివాడిలాగే కనిపిస్తున్నాడు. నన్ను మర్యాదగానే పిలుస్తు న్నాడు. అయితే ఇక్కడ బోర్డర్ దాటి జర్మన్ దేశం లోకి అడుగుపెట్టాలంటే కొన్ని నిబంధనలు పాటిం చాలి. ఆ అవకాశం ఆదివారం ఒక్కరోజే ఉంటుంది. అప్పటివరకూ ఆయనింట్లో నేను అతిథిగా ఉండాలి. నాకిదంతా ఎంతో కంగారుగా ఉంది. అయినా చేసేదేం లేదు. తలవంచుకొని వారు చెప్పినది శ్రద్ధగా వినడమే!

అదృష్టవశాత్తు ఆ ఆదివారం నాలుగురోజులకే వచ్చింది. సార్వెన్‌గారి సహాయంతో జర్మనీలో అడుగు పెట్టాను. ఇక్కడే ఈయన ఇల్లు కూడా ఉంది. ఇంటికి తీసుకెళ్ళాడు. ఆ పూట కొంచెం అలసట తీరిన తరువాత అబ్రహం పంపాడనీ, జాగ్రత్తగా ఉంచమనీ ట్రావెల్ పాస్ చేతిలో పెట్టాడు. అందులో చదివి చూస్తే అది నా అసలు పేరుతో ఉంది. ఇలా రెండు రకాలుగా ఉంటే, ఆఫీసర్ల చెకింగ్‌లో నేను దొరికిపోతే నా గతి ఏమిటి? ఇప్పుడు నేను ఏమి చేయాలి? భయంతో నా ముఖాన్ని, వేలితో చూపు తున్న ఆ పేరును చూసి సార్వెన్ ఓ సలహా చెప్పారు. ఏదన్నా చెకింగ్ వస్తే డబ్బులున్న పర్స్, ట్రావెల్ పాస్ పోయాయని చెప్పు చాలు అన్నాడు చాలా మామూలుగా. భయంతో గుండె జల్లుమంది.

అతను చెప్పడం తేలికే!



కానీ చెకింగ్‌లో అక్షరం అక్షరం చెక్ చేస్తారని తెలిసింది. మేం మరో గంటలో బయలుదేరి హేంబర్గ్ రేవుకి ఆ సాయంకాలం చేరుకున్నాం. చేతిలో బట్టల సంచి, కాగితాలు పట్టుకుని షిప్ ఎక్కే క్యూలో నిలబడ్డాను.

అధికారులు అంతా చెక్ చేసి వెనక్కి పొమ్మంటే సార్వెన్‌నే ఆశ్రయించాలి. సార్వెన్ పక్కనే ఉన్నాడు. నన్ను షిప్ ఎక్కించే బాధ్యత అతనిది కదా!



## జరిగిన కథ

**రా**చెల్ కలోఫ్ ఉక్రెయిన్‌లో పుట్టి పెరిగింది. తరువాత అమెరికా చేరింది. ఆమె రాసుకున్న ఆత్మకథే ప్రయాణం. రాచెల్ చిన్నతనంలోనే తల్లి మరణించటంతో తండ్రి రెండోపెళ్లి చేసుకుంటాడు. ఆమెకు ఒక అన్న, అక్క, తమ్ముడు ఉంటారు. సవతితల్లి గొడవపడి ఇంట్లో నుంచి వెళ్ళిపోతుంది. దాంతో తండ్రి చిన్నగా పిల్లల్ని బంధువుల పంచనచేర్చి, అమెరికా వెళ్ళిపోతాడు. రాచెల్ తాతగారింటినుంచి మేనత్త ఇంటికి పనిమనిషిగా వెళుతుంది. అమెరికాలో ఉంటున్న తన బంధువు అబ్రహం కోసం పిల్లను వెతుకుతుంటుంది ఛాయ. రాచెల్‌కు బంధువైన గ్రేటంకుల్ ఆమెని ఛాయ దగ్గరికి తీసుకెళతాడు. రకరకాల పరీక్షలు పెట్టి సంతృప్తి చెందిన తరువాత అబ్రహంకి రాచెల్ తగిన ఈడూజోడుగా నిర్ణయిస్తుంది. రాచెల్‌ను అమెరికా పంపేందుకు ఏర్పాట్లు జరుగుతాయి. **ఆ తర్వాత.....**

నాలోని టెన్షన్ పోగొట్టడానికి కాబోలు ఆ కబురూ ఈ కబురూ చెబుతున్నాడు చాలా జోకీగా!!

అయితే తమాషాగా మరో నలుగురి తరువాత నా పేరు పిలుస్తారన్న సమయంలో నన్ను క్యూలోంచి తప్పించి అక్కడ చెక్ చేసే అధికారితో ఏం చెప్పాడో గానీ, నా పాస్‌పోర్ట్ పుస్తకంలోని ట్రావెల్ పాస్ కాయితాన్ని మడత పెట్టి హడావుడిగా చూపించి, స్టాంప్ వేయించి డబ్బు కట్టి లోపలికి పంపేశాడు. ఆ అధికారి 'రాచెల్' పేరు ఒక్కటే చూసి ఉంటాడు. లేకపోతే ఏం జరిగిందో తెలియదు. అప్పటికి గండం గడిచింది. షిప్‌లో ఆఫీసర్లు వస్తారు. మరో మారు చెక్ చేస్తే ఏం చెప్పను?

పోనీ అమెరికాలో దిగవలసిన చోట చెక్ చేస్తారు, అప్పుడేం చెప్పను? నా మనసు పరిపరి విధాలుగా ఉంది. బట్టల సంచిలాంటి నా బట్టల మూటను తీసుకుని, మంచినీళ్ళ మగ్‌ను చేత్తో జాగ్రత్త చేసుకుంటూ షిప్ లోపలికి ప్రవేశించాను. లోపల చూస్తే ఇలా ఎక్కిన వారెవరికీ సరైన సీట్లు గానీ, స్థలాలుగానీ లేవు. గుంపులు గుంపులుగా దొరికిన చోట కూచుంటున్నారు. మేకులు బిగించిన బల్లలు అక్కడక్కడా ఉన్నాయి. గడుసువారు ముందే వాటిని ఆక్రమించుకుంటున్నారు. నేను ఓ గోడ పక్కకు చేరాను.

నా దగ్గరున్న డబ్బుల్తో చౌకగా బాగున్నదని హేంబర్గ్‌లో కొన్న చిన్న వెదురు బుట్ట, కొత్తగా కొన్న ఒక జత ఉన్ని సాక్సులు మడతపెట్టి అందులో సర్దుతూ, తీరికగా చేతిలోని పేపర్లు మొత్తం చూశాను. పాస్‌పోర్టు పుస్తకంలో నా ఫొటో అతికించి, దానికింద 'రాచెల్ ఛావెట్జ్' అని రాసినా బాగానే ఉందని అనిపించింది. కానీ ట్రావెల్ పాస్ పేపర్ చూస్తేనే భయంగా ఉంది. అందులో నా అసలు పేరు రాచెల్ బెల్లాకాన్ అనే పేరు కాకుండా, నా స్వదేశమూ మొత్తం వివరాలతో పాటూ



ఈ పేపర్‌ని ఎవరు ఇష్యూ చేశారో వాటి వివరాలు అన్నీ ఉన్నాయే! అధికారులు గుచ్చి గుచ్చి అడిగితే ఏం చెప్పను? పోనీ పెళ్ళయిపోయి భర్త దగ్గరకు వెళుతున్నాను... అందువలన సర్‌నేమ్‌లో తేడా ఉంది అంటే వారు నమ్మవచ్చు. మరి ఈ విషయాలన్నీ ఇందులో లేవే?

మనసు పరిపరి విధాలుగా పోతోంటే నా స్థలంలోనే కూచుని చుట్టూ చూస్తున్నానే గానీ నా ముఖంలో తట్టెడు దుఃఖం ఉంది.

షిప్ బయలుదేరింది. అందులో ఉన్న వారందరూ సైడ్ డెక్ మీదకు చేరుకొని దూరమవుతున్న ఒడ్డును చూస్తూ ఉంటే, కొంతమంది వారి వారి బంధుమిత్రులకు చేతులు ఊపుతున్నారు. ఇంచుమించు అందరూ సరదాగానే ఉన్నారు. నేను ఒంటరిదాన్ని. నా ముఖంలో ఆనందమే లేదు. ఆ మట్టినీ, పైన ఆకాశాన్నీ అలా చూస్తూ నిలబడ్డాను. కాసేపు బయటే గడిపి, పోయి నా పాత స్థలంలో కూచున్నాను. ఈ షిప్ జర్మనీలో హేంబర్గ్ రేవులో బయలుదేరి ఇంగ్లీష్ ఛానెల్ గుండా అంటే అటు ఫ్రాన్స్, ఇటు ఇంగ్లండ్ మధ్య నుండి అట్లాంటిక్ మహాసముద్రంలోకి వస్తుంది. దాని వేగమూ, కాలములను అనుసరించి ఇరవై రోజుల నుండి ఇరవై అయిదు రోజుల మధ్యలో అమెరికా (ఇల్లీస్ ఐలండ్, న్యూయార్క్) చేరుతుంది.

చుట్టూ ఉన్నవారు పరిచయమవుతున్నారు. 'పోలీష్', నా మాతృభాష అయిన 'యిద్దీష్' కూడా మాట్లాడుతున్నారు. ఇదొక కాలక్షేపం. షిప్ వెళుతూనే ఉంది. కొంచెం కదలిక. కింద కొంచెం వెచ్చగానే ఉంది. కాకపోతే ఇంజన్ నడుస్తున్న చప్పుడు, నల్లటి బొగ్గు గుండ. బొగ్గు కాలుతున్న వాసన.

మరుసటి రోజు ఈ ఓడ అట్లాంటిక్ సముద్రంలోకి ప్రవేశించిందని గుసగుసలు పోయారు. కొంతమంది డెక్ మీదకు వెళ్ళి వస్తున్నారు. నాకూ వెళ్ళాలనిపించి పైన డెక్ మీదకు వెళ్ళాను. అసలు ఓడ కదుల్తుందో లేదో తెలియడం లేదు. చుట్టూ అంతా నల్లని సముద్రం, విపరీతంగా గాల్లో కలుస్తున్న పొగ. నన్ను ఒక వ్యక్తి ఉదయం నుండీ గమనిస్తున్నట్లు నేను గుర్తించలేదు. ఇప్పుడు ఆయన కూడా డెక్ మీద ఉన్నాడు. మధ్య మధ్య ఇంటి విషయాలు, ప్రస్తుతం ఎదుర్కొంటున్న విషయమూ గుర్తొచ్చి, ఎంత తుడుచుకున్నా కళ్ళ వెంట నీళ్ళు కారుతున్నాయి. చుట్టూ చూస్తున్నా నా కళ్ళకేం కనపడ్డం లేదు. నన్నే గమనిస్తున్న ఆ పెద్దమనిషి నా దగ్గరకి వచ్చి ఎంతో చక్కగా పలకరించాడు. నాకింకా దుఃఖం పొర్లుకొచ్చింది. నేను ఒంటరి ప్రయాణికురాలినని తెలిసిపోతూనే ఉంది. "ఏం భయం లేదు. కన్నీళ్ళు తుడుచుకొని విషయం చెప్పమన్నాడు."

**పాస్‌పోర్టులో ఒకపేరు, ట్రావెల్ పేపర్లలో మరొక పేరు. ఏం చేయాలో పాలు పోలేదామెకి. షిప్ ఎక్కిందన్నమాటేగానీ భయపడుతూనే ఉంది. ఒకవేళ ఆఫీసర్లు వచ్చి చెక్ చేస్తే? షిప్‌లో తప్పించుకున్నా, అమెరికా వెళ్ళాక షిప్‌నుంచి బయటకు వచ్చేముందైనా చెక్ చేస్తారు కదా... అప్పుడేం చేయాలి? పరిపరివిధాలుగా ఆలోచిస్తోంది రాచెల్. ఆ పరిస్థితి నుంచి ఆమె ఎలా తప్పించుకుంది?**

నా మనసు తెలిసిన వ్యక్తి పరిచయమయ్యాడనిపించింది.

నా బతుకులోని విషాదమంతా చెప్పాను. చివరిలో నా పాస్‌పోర్ట్, ట్రావెల్ పేపర్లలోని తేడాలను, అందువల్ల నాలో ఏర్పడ్డ భయాన్ని చెప్పాను.

ఆయన తేలిగ్గా నవ్వేశాడు. ఇప్పుడే వాటిని పరిశీలించి, సాల్వ్ చేద్దామని కిందకు తీసుకెళ్ళాడు. నా పేపర్లూ, పాస్‌పోర్టూ జాగ్రత్తగా చెక్‌చేసి షిప్ ఆఫీస్‌లోకి వెళ్ళాడు. నేనూ ఆయన వెంట వెళ్ళాను. కిటికీ బయట నిలబడి లోపలికి చూస్తున్నాను. నా పాస్‌పోర్టులో ఉన్న పేపరుతోనే అన్ని పేపర్లను సరిచేయించి, వారితో సంతకాలు చేయించి, స్టాంప్ వేయించి తెచ్చాడు. "ఇక నీకేం ఫరవాలేదు. షిప్ దిగేదాకా నిన్ను ఆపేవారే లేరు" అన్నాడు నవ్వుతూ.

నేనూ హాయిగా ఆ క్షణంలో నవ్వాను. ఆయన నాకు ఆ క్షణంలో భగవంతుడు పంపిన దూతలా కనపడ్డాడు. నా ఆనందానికి అంతులేదు. ప్రయాణంలో ఉన్నన్ని రోజులూ ఆయన సలహా తీసుకుంటూ, నా ఆలోచనలు చెప్పుకుంటూ సాంత్వన పొందాను. ఉదయం నుంచీ సాయంకాలం వరకూ లేక నిద్రపోయే వరకూ ఒకరి ముఖాలు మరొకరికి కనపడే జైలు లాంటిదీ ప్రయాణం. కదుల్తుంది కాబట్టి ప్రయాణిస్తోంది అని తెలుస్తుంది.

ఈయనే ఏవన్నా తీసుకోవలసిన జాగ్రత్తలు చెప్పేవాడు. ముందుగానే నా బల్ల మీదకు బ్రెడ్డు, వెన్న, వేడి కాఫీ తెచ్చి ఇచ్చేవాడు. నాకు ధైర్యాన్ని చెబుతుంటే ఆ ఒంటరితనం నాలో మాయమయ్యింది.

ఒక వారం రోజులు ప్రయాణించేసరికి చాలామందిలో విసుగు మొదలైంది. దాంతో గొడవలు. పక్కవారితో మాట్లాడిందే మాట్లాడడం, పిచ్చాపాటీ, తోచకపోతే డెక్ మీదకు ఆ చలిలో, చీకట్లో వెళ్ళడం, అంతలోనే కిందకు రావడం, ఇంకెన్ని రోజులు ప్రయాణమని ఓడలోని పనివాళ్ళను ప్రశ్నించడం. ప్రయాణికులు మసిలేది చిన్న ప్రాంతం కాబట్టి చూసిన ముఖాలనే చూడవలసి రావడం దీనికి తోడు నల్లటి పొగలు... శుభ్రమైన బట్టలు క్షణాల్లో నల్లగా అయిపోవడం. శరీరమూ అంతే! ఇక ఇంజన్ చేసే రొద గురించి చెప్పనవసరం లేదు. పగలూ, రాత్రీ చెవులు బద్దలు కావలసిందే!

నేను ప్రయాణించిన కాలం మంచి కాలంలా ఉంది. సముద్రంలో వర్షాలూ, తుఫాన్‌లూ వంటివి లేవు. ఈ ఇరవై రోజుల ప్రయాణం సజావుగా సాగినట్టే.

"మనం సాయంకాలానికల్లా అమెరికా చేరుకుంటున్నాం" అన్నాడు ఓడలో పనిచేస్తున్న ఓ కళాసీ. అందరం ఆయన చుట్టూ చేరాం.

ఆనందం, కేరింతలు... ఆ మురికి గుడ్డలు దులిపి పెట్టెలో సర్దుకునేవారే ఎక్కువయ్యారు. డెక్ మీదకు చేరుకొని తీరం ఎటు వస్తుందా అని ఎదురు చూడ్డంతోనే సరిపోయింది. కొన్ని గంటల్లో న్యూయార్క్ చేరబోతున్నామని కెప్టెన్ అధికారి కంగా ప్రకటించాడు. అదిగో, ఇదిగో అంటున్నారందరూ. అందరం డెక్ మీదకు చేరుకుని మా కలల బంగారు భూమి ఎప్పుడు కనపడుతుందా? అని




## అమ్మకు చెప్పకురా

అమ్మకు చెప్పకురా కన్నా
నాన్నను అనాథాశ్రమంలో వదిలేశానని!

నీవు కడుపులో పడ్డప్పటి నుండే
నీతో ముచ్చట్లు నేకన్న కలలు

నేను పడ్డ అగచాట్లు తెలిసిన
ఏకైక ప్రాణి కదా తట్టుకోలేదేమో!

కడుపులోనే నీవడ్డం తిరిగితే
సిజేరియన్ కాన్పుకు కాడెద్దులు అమ్మేశా
కాన్వెంట్ క్లాసుకై ఎకరం తాకట్టు పెట్టా
పట్నం చదువుకై పదెకరాలు పోగొట్టా

నీకేకొదవా రాకూడదని రైతుకూలీనైనా
కట్టే పరీక్షఫీజ్ కోసం రక్తాన్ని విక్రయించా
టెక్నికల్ టూరంటే ట్యూబెక్టమీ చేయించా
ఉద్యోగం వచ్చినపుడు పుస్తెలమ్మి పంపించా



అన్నీ తెలిసిన అమ్మకు చెప్పక
వెన్ను విరిగి రెక్కలరిగిన నాన్నను
ఆసుపత్రిలో చేర్పించానని చెప్పు
గుండాగక ఇంకొన్నాళ్లైనా పాచిపని చేస్తుంది!

**—సురేంద్ర రొడ్డ, సెల్: 94915 23570**

కలియ చూస్తున్నాం. సాయంకాలానికి 'ఇల్లీస్ ఐలాండ్ (న్యూయార్క్) చేరుకున్నాం. ఈ రోజుతో కలిపి మొత్తం 21 రోజుల ప్రయాణం.

(ఆ రోజుల్లో ఇలా యూరప్ నుంచి వచ్చిన ప్రయాణికులను ఎన్నో ఆరోగ్య పరీక్షలు చేసి గానీ అమెరికా దేశంలోకి (న్యూయార్క్ పట్టణం గుండా ప్రవేశించాలి) అడుగు పెట్టనిచ్చేవారు కాదు. యూరప్ నుంచి నెలలు నెలలు మహా చలిలో సరైన తిండిలేక, నిద్రలేక 'సీ సిక్' అయిపోయి ప్రయాణం చేసి వచ్చేవారికి ఆ పరీక్షల్లో నెగ్గడం ఇంకా గొప్ప. నెగ్గకపోతే పిల్లలైనా, పెద్దలైనా వెనక్కు వెళ్ళవలసిందే! అనారోగ్యమైన పసిపిల్లలూ, ముసలివారూ, ఇక ఈ కొద్దిరోజుల్లో ఆరోగ్య వంతులు కాలేరు అని అనుకున్న ప్రయాణికులను న్యూయార్క్ చేరుకుంటున్న దశలో వారిని నిర్ధాక్షిణ్యంగా సముద్రంలోకి విసిరేసేవారట.)

నేను గబగబా సామాన్లు సర్దుకుని వీలైనంత శుభ్రంగా తయారయ్యాను. హేంబర్గ్‌లో కొన్న కొత్త సాక్సులు వేసుకొని, బూట్లు వేసుకొని పైన ఉన్ని కోటు వేసుకున్నాను. కొద్ది గంటల్లో నాక్కాబోయే భర్తను, అదే అబ్రహంను చూస్తాను కదా! షిప్‌లో నుండి రాతితో కట్టిన బ్రిడ్జి మీదకు ఇనుపరేకులు పరిచారు. గట్టిగా లంగరు తాళ్ళు ఇనుపరేకులకు కట్టారు. తుప్పు పట్టిన నల్లబారిన ఆ షిప్ యొక్క ఇనుప గేట్ల రేకుల మధ్య నుండి ఒక్కొక్కరం మా బరువులు చేతుల్లోకి తీసుకొని జైలునుండి వస్తున్న ఖైదీల్లా బయటపడుతున్నాం.

అయితే పూర్తిగా బయటకు కాదు.

మమ్మల్ని పరీక్షలు చేసే డాక్టర్లుండే హాల్లోకి మాత్రమే! అందర్నీ పరీక్షలు చేసి, మా చేతుల్లోని పేపర్లు చూశారు. నా ఆరోగ్యాన్ని పరీక్షించారు. సంతృప్తి పడ్డారు. ఇదొక గంటన్నర కార్యక్రమం. మరొక చోటికి వెళ్ళమన్నారు.

ఇలా పరీక్షలు అయిపోయిన వారందరూ ఈ ఐలాండ్‌లోనే ఓ గోడ పక్క నిలబడి ఉన్నారు. అక్కడ మళ్లా చిన్న పడవ ఎక్కాలి. నేనూ ఆ పక్కనే నిలబడ్డాను. దానిలో అరగంట సేపు ప్రయాణం చేసిన తరువాత ఒడ్డునున్న మరో పెద్ద హాలులోకి చేర్చారు. అందరం గుంపులు గుంపులుగా మా పెట్టెబేడాలతో ఆ హాలులో నిలబడ్డాం. ఇద్దరు ముగ్గురు ఆఫీసర్లు హడావుడిగా మెయిన్ గేటుకి అటూ ఇటూ చేరి పెద్ద రికార్డ్ పుస్తకాలతో నిలబడి ఒక్కొక్కరి పేరూ పిలవనారంభించారు. ఆ పేరున నుసరించి, ఒక్కొక్కరం వారి ముందుకు వచ్చి మా చేతుల్లోని కాయితాలు, పాస్‌పోర్ట్ పుస్తకం చూపించి వారు చూపించిన చోట సంతకం చేసి బయట పడాలి. నేను రాచెల్ ఛావెట్జ్ అనే పేరుతో వస్తున్నాను కాబట్టి ఆ విధంగానే సంతకం చేసి బయటకు అంటే న్యూయార్క్ నేలమీద అడుగుపెట్టాను.

ముదురు ఆకుపచ్చ రంగు పూసిన చిన్న గేటు గుండా మేము బయటకు పోవాలి. ఆ గేటుకి కొంచెం దూరంలో చాలామంది ఆత్రుతగా, ఉత్సాహంగా గేటులోకి చూస్తున్నారు. వారంతా తమ తమ బంధుమిత్రులను కలుసుకునే ఉత్సాహంలో ఉన్నవారు. నా చేతిలో ఉన్న వెదురు బుట్ట, బట్టల మూటతో బయటపడుతూనే ఫొటోలో అప్పుడెప్పుడో చూసిన అబ్రహం ముఖాన్ని గుర్తు తెచ్చుకుంటున్నాను. మధ్య మధ్య తల ఎత్తి చుట్టూ కలయ చూస్తున్నాను. అప్పుడే కొద్దికొద్దిగా చీకట్లు ముసురుకుంటున్నాయి. నాకు తెలియకుండానే కొంత భయం, బెరుకు. ఓ గోడ పక్క నిలబడ్డాను.

అబ్రహం కోటుతో అందరి తలల మీద నుండి అటూ ఇటూ చూస్తున్నాడు. మెడలో ఉన్ని స్కార్ఫ్ ఉన్నట్లుంది. గుర్తుపట్టాను. ఆ ఫొటోలోని వ్యక్తి అతనే! నేను గబుక్కున ముందుకెళ్ళలేదు. దగ్గర్లోనే ఉన్నాడు కాబట్టి ఇటు చూడకపోడు... నవ్వుకున్నాను.

నా పక్కన మరో అమ్మాయి ఉంది. ఆమె నాతో పాటు వచ్చిన ప్రయాణికురాలే! అంతా గోల గోలగా ఉంది. ఆ అమ్మాయి దగ్గరకు అబ్రహం వెళ్ళి కొంచెం గట్టిగా రాచెల్ ఛావెట్జ్ అన్నాడు. ఆ అమ్మాయి నవ్వి 'తాను కాదంది'. ఆమె పక్కనున్న బంధువులూ నవ్వి కాదన్నారు. ఆ పక్కనే నేను ఉన్నా కంగారులో పోల్చలేని స్థితి అది. మళ్ళీ వెనక్కు అటూ ఇటూ వెతుకుతూ వెళ్తున్నాడు. అతన్ని నేను గమనిస్తూనే ఉన్నాను. నేను నిలబడ్డ వైపు కొంచెం పక్కకు వచ్చి 'రాచెల్ ఛావెట్జ్' అని అరిచాడు. నేను నవ్వుతూ నాచేతిలోని బరువుతో అతని ముందుకెళ్ళి నిలబడ్డాను. వెంటనే సిగ్గుపడ్డాడు. చేతులతో మెడలోని స్కార్ఫ్ సరిచేసుకుంటూ వంగి వంగి నా వేపు చూస్తూ, ఓ క్షణం నవ్వుతూ అసలేం మాట్లాడలేకపోయాడు. నేనూ అంతే. నవ్వుతూ అటూ ఇటూ చూడ్డం మొదలెట్టాను.

"ప్రయాణం బాగా జరిగిందా?" అన్నాడు నవ్వు ఆపుకుంటూ.

"అవునన్నాను" అంతకన్నా సిగ్గుతో.

నాతో వచ్చిన ప్రయాణికులు మా వైపే చూస్తున్నారు. అది అతను గమనించాడు కాబోలు ఓ రెండు అడుగులు వెనక్కు వేశాడు. నేనూ ముందుకు కదిలాను. కోటు జేబులో దాచిన రెండు నారింజ పండ్లు తీసి బహుమతిగా నా చేతుల్లో పెట్టబోయాడు. నా చేతిలో బరువుంది. తిరిగి 'సారీ' చెబుతూ, నా చేతిలో బట్టల బుట్ట తన చేతిలోకి తీసుకున్నాడు.

మా మొదటి పరిచయం అలా జరిగింది ఆ రోజున. కొంచెం దూరం నడిచిన తరువాత స్ట్రీట్ కారుని తాను ఉంటున్న ఇంటికి మాట్లాడాడు.

(ఇక్కడ అబ్రహం గురించి కొంచెం చెప్పాలి. ఈ అబ్రహం, ఈయన అన్న చార్లీ అమెరికా చేరుకున్నది 1891లో. అప్పటిలో అమెరికా నార్త్ డకోటా లాంటి ప్రదేశంలో ఉన్న గడ్డి భూముల్ని చాలా చౌక

## హెబ్బా అవకాశాలకు గండి?

హెబ్బా పటేల్ పేరు తలుచుకోగానే ముందుగా గుర్తుకు వచ్చేది 'కుమారి 21 ఎఫ్' సినిమానే! ఆ సినిమాతో ఈ హీరోయిన్ పేరు మారుమోగిపోయింది. దాంతో చాలా మందికి హెబ్బా మంచి ఆప్షన్ అయింది. అయితే ఈమె అవకాశాలకు ఒక టాప్ హీరోయిన్ గండి కొడుతోందట! హెబ్బాకు అవకాశాలు ఇచ్చిన దర్శకనిర్మాతలకు ఫోన్లు చేసి ఆమెను తొలగించండి అంటూ ఆర్డర్ వేస్తోందట! హెబ్బాకూ, ఆ టాప్ హీరోయిన్‌కూ వ్యక్తిగతంగా మనస్పర్ధలు ఏమీ లేకపోయినా, తన అవకాశాలను హెబ్బా తన్నుకుపోతోంది అన్న అనుమానంతోనే ఆ హీరోయిన్ అలా ప్రవర్తిస్తోందట!



ధరకు అమ్ముతోంది. దాని ఉద్దేశం ఆ ప్రాంతాన్ని వ్యవసాయిక ప్రాంతంగా మార్చడం, దేశాన్ని కొంత జనాభాతో నింపడం. అందువల్ల యూరప్ దేశస్థు లంతా పుంఖాను పుంఖాలుగా ఇక్కడకు వలస వచ్చేవారు. వ్యవసాయం తెలిసుంటే మరీ మంచిది. రష్యా, ఆస్ట్రియా దేశాల్లోని కొన్ని వేల యూదు కుటుంబాల వారు అలా వలస వచ్చారు. అబ్రహం కన్నా ముందు ఆయన కజిన్ బ్రదర్స్ ఇద్దరు వచ్చి నార్త్ డకోటా అనే ప్రాంతంలో 'డెవిల్స్ లేక్' ప్రదేశంలో భూమి కొనుక్కుని పంటలు పండిస్తూ అప్పటికే స్థిరపడ్డారు.

అబ్రహం మేనకోడళ్ళు 'దోలా', 'సారా' వారి వారి భర్తలు, పిల్లలతో ఐదు సంవత్సరాల క్రితమే వచ్చి 'డెవిల్ లేక్' ప్రాంతంలో ఉంటున్నారు. ఇప్పటికి మూడునెలల క్రితం అబ్రహం అతని తల్లిదండ్రులు, చిన్న తమ్ముడు మోసెస్, అన్నయ్య చార్లెస్, అతని భార్య ఫాగా వారికి గల ఇద్దరు పిల్లలతో




డెవిల్స్ లేక్‌లో ఉన్నారు. వారికి కొంత ఆర్థిక సాయం చేసే నిమిత్తం అబ్రహం న్యూయార్క్‌లో చిన్న చిన్న కూలిపనులు చేస్తూ ఆర్థికంగా ఇంటికి సాయం చేస్తున్నాడు.)

బాగా చీకటి పడింది.

వీధుల్లోని కూడలిలో నూనెతో నింపిన దీపాలు వెలిగించారు. అదొక గుడ్డి కాంతి. ఈ న్యూయార్క్ గొప్ప పట్టణం. నా కలల యువరాజు పక్కన కూర్చుని ఆశాసౌధం నుండి బయటకు చూస్తున్నాను. ఆ వీధులు, ఎత్తయిన మేడలు, అక్కడక్కడా కనపడే మనుషులు, చిన్న చిన్న శబ్దాలు మనసుని నిలవనీయడం లేదు. మెడ తిప్పి స్ట్రీట్ కారు అద్దాల్లోంచి బయటకే చూస్తున్నాను. ఈ ప్రయాణంలో ఎంత భయపడ్డాను.... ఒకరోజా? రెండు రోజులా?? ఇరవై రోజులు. పెద్ద తుఫాను లోంచి సురక్షితమైన ప్రాంతానికి వచ్చినట్లయ్యింది. అయితే గ్రేట్ అంకుల్ అన్న మాటలు గుర్తుకొస్తున్నాయి. "అబ్రహం మంచివాడే! నాకు బాగా తెలుసు. అతన్ని చిన్నప్పటి నుంచీ ఎరుగుదును. ఈ మధ్య న్యూయార్క్‌లో ఉంటున్నాడట. ఏమన్నా మారిపోయాడో ఏమిటో?"

అబ్రహం వైపు చూశాను. నావైపు చూసీ చూడనట్టు చూస్తున్నాడు. ఏం మాట్లాడడం లేదు. నా బట్టల మూటను అప్రయత్నంగా దగ్గరకు లాక్కున్నాను. మరో అరగంటలో స్ట్రీట్ కారు అబ్రహం ఉంటున్న ఇంటి ముందు ఆగింది. అమ్మయ్య చేరుకోవలసిన స్థలానికి చేరుకున్నానని మనసులో ఓ మూల హాయిగా ఉంది. ఇరవై రోజుల సముద్ర ప్రయాణం, ఆ నల్లని బొగ్గు పొగ పీల్చవలసి రావడం, సరైన నిద్రగానీ, తిండి గానీ లేకపోవడం వల్ల నీరసంగా ఉంది. అయితే నేనెవరో ఈ అబ్రహం గారు ముందుగా తనతో ఉన్న మిత్రులకు చెప్పడం వల్ల కాబోలు, మెట్లెక్కి ఆ ఇంటి హాలులోకి ప్రవేశించగానే నాకెదురయిన వ్యక్తులందరూ మర్యాదపూర్వకంగా నవ్వుతూ పలకరించారు. నేనూ ఏదో నవ్వుతో సమాధానం ఇస్తూ ఓ పక్కన నిలబడ్డాను. పక్క గదిలోకి వెళ్ళిన అబ్రహం హాల్లోకి వచ్చాడు. పక్క గదిలో నా సామాను పెట్టుకోవలసిన పెద్ద అల్మారా చూపించాడు. ఆ తరువాత ఉన్నది వంటగది. దానికి ఆనుకునే బాత్‌రూం. ముందు గదిలో అబ్రహం పడుకునే పెద్ద మంచం, ఓ పక్క అతని బట్టల పెట్టే అవీ ఉన్నాయి. తలుపులు వేసి చాలా సేపు అయినట్లుంది. ఆ గది వేడిగా ఉన్నట్లనిపించింది. ప్రస్తుతానికి నన్ను ఆ మంచం మీదే పడుకోమన్నాడు. తాను వేరే ఏర్పాటు చేసుకుంటానన్నాడు.

ఆ ఇంటిలో అబ్రహం వంటి వారు కొద్ది మంది వేరు వేరు గదుల్లో అద్దెకుంటున్నారు. ఉదయాన్నే ఎవరి పనులకు వారెళ్ళి పోతారు. ఇల్లుగలవారు ఆ పక్కనే ఉన్న పెద్ద పోర్షన్‌లో ఉంటారట. ఉక్రెయిన్‌లో మా ఊళ్ళోని ఇంటికీ ఇక్కడకూ చాలా తేడా కనిపిస్తోంది.

మొదటి రోజు ఇది.

నాకు ఈ కొత్త వ్యక్తితోనూ, పరిచయం లేని మగవాళ్ళ గదుల్లోకి తిరగడం ఇబ్బందిగానే ఉన్నా 'ఇది తప్పదు' అని నాకు నేను సమాధానం చెప్పుకున్నాను. బాత్‌రూంలో ఫ్రెష్ అయి, బట్టలు మార్చుకున్నాను. వంటింట్లో పెద్ద గాజు జగ్‌లో మంచి నీరు ఉంది. దాని పక్కనే గ్లాసులు. నేను మంచి నీరు వంపుకుని తాగుతుంటే వెనక నుండి అబ్రహం అన్నాడు "ఈ పూట వంట లేదు. దగ్గర్లో ఉన్న షాపుకి వెళ్ళి బ్రెడ్ తెస్తాను. గూట్లో జామ్, చీజ్ ఉన్నాయి" అన్నాడు.

నేను అక్కడున్న మంచం మీద ఓ పక్కగా కూచున్నాను. కూచోడానికి వెనక్కు వాలి రెస్ట్ తీసుకోడానికి ఆ గదిలో కుర్చీలు లేవు. ఏదో బల్ల వంటిది ఉందిగానీ దాని మీద అబ్రహం కొన్ని పాత్రలు, మరో పక్క బట్టలు వంటివి పెట్టాడు. మరో పావుగంటలో బ్రెడ్, వెన్న, వేడి వేడి కాఫీ బాక్స్‌లతో వచ్చాడు. అలస్యమైందని, ఇలాంటి ఏర్పాట్లు ముందే చేయలేకపోయానని 'అపాలజీ' చెప్పాడు.

నవ్వాను. ఆ పూటకు ఏదో తిన్నాననిపించాను. నేను మంచం మీద ముసుగుపెట్టి పడుకున్నాను. పడుకుంటూనే నిద్రపట్టేసింది. అలా ఎంతసేపు పడుకున్నానో తెలియదు. ఒక రాత్రి పూట నా మీద ఏదో పాకుతున్నట్లనిపించి బల్లమీదున్న కిరోసిన్ లైటు వత్తి పెద్దది చేసి చూశాను. మంచం నిండా బొద్దింకలు, దుప్పటికి ఓ పక్క నల్లులు. గోడల మీదా ఏవేవో పురుగులు.

గది చూస్తే చాలా వేడిగా ఉంది. కిటికీలు లేవు. ఎక్కడో పైన వెంటిలేషన్ తప్ప.

అబ్రహం ఎక్కడ పడుకున్నాడో తెలియదు. ఎవరిదో సన్నగా పెడుతున్న గురక వినిపిస్తోంది. నా నిద్ర ఎగిరిపోయింది. మంచినీళ్లన్నా తాగుదామని వంటింట్లోకి వెళ్లాను. కింద రగ్గు పరుచుకుని, మరో రగ్గు కప్పుకుని నిద్రపోతున్నాడు అబ్రహం. భోజనం బల్ల మీద ఉన్న పళ్లెంలో రాత్రి తినగా వదిలేసిన వైట్ బ్రెడ్ ఉంది. అది వైట్ బ్రెడ్ అంటే నమ్మలేం! దాన్నిండా నల్లని బొద్దింకలు పూర్తిగా కప్పి ఉన్నాయి. పోనీ జగ్గులోని నీటిని కొద్దిగా గ్లాసులోకి వంపుకొని తాగాలని ఆ పక్క గదిలోకి వెళ్లాను. దాని గోడల నిండా బొద్దింకలే!

గ్లాసుని కడిగి కొద్దిగా మంచినీరు పోసుకుని తాగి, దీపం వత్తి మంచం మీదకు చేరాను.

ఇక ఆ తరువాత నిద్ర పట్టలేదు.

అప్పట్లో యూరప్ ప్రజల కలల ప్రపంచం, బంగారు భూమి, భూతల స్వర్గం ఈ అమెరికాలో మొదటిరోజు రాత్రి నా అనుభవం ఇలా ఉంది. కళ్ల మీదకు వస్తున్న నిద్రను తట్టుకుంటూ చేతిలో ఉన్న దుప్పటిలో, నా మీద పడుతున్న బొద్దింకల్నీ, ఇంకా ఏవేవో పురుగుల్నీ దూరంగా తరమడంతోనే సరిపోయింది తెల్లవార్లూ...

ఎలాగో తెల్లవారింది.

*(మిగతా వచ్చేవారం)*

## భూమిలాంటి గ్రహం దొరికింది?

విశ్వాంతరాళాన్ని జల్లెడపడుతున్న శాస్త్రవేత్తల శ్రమ ఫలించింది! భూమిలాంటి మరో గ్రహాన్ని వారు కనుగొన్నారు. కేవలం మన భూమికి 219 కాంతి సంవత్సరాల దూరంలో ఈ గ్రహం ఉన్నట్టు సమాచారం. కాంతి శూన్యంలో సెకనుకు మూడు లక్షల కిలోమీటర్ల దూరం ప్రయాణిస్తుంది. అలా కాంతి ఒక సంవత్సర కాలంలో తొమ్మిది లక్షల 50 వేల కోట్ల కిలోమీటర్లు ప్రయాణం చేస్తుంది. అలాంటి 219 కాంతి సంవత్సరాల దూరంలో మన భూమిని పోలిన గ్రహం ఉన్నట్లు కనుగొన్నారు. ఈ కొత్త గ్రహాన్ని 'కెప్లర్ 1649' అని పిలుస్తున్నారు.

భూమికంటే ఇది కొంచెం పెద్దదేనట. పైగా ఇక్కడ ఉష్ణోగ్రతలు కూడా చాలా తక్కువగా ఉంటాయట. నాసా వారి కెప్లర్ స్పేస్ టెలిస్కోప్ ద్వారా



దీన్ని కనుగొన్నారు. ఇది ప్రాణికోటి జీవించడానికి అనువుగా ఉందని కూడా అంటున్నారు. శుక్రగ్రహానికీ దీనికీ సన్నిహితత్వం ఉన్నట్టు చెబుతున్నారు. అనేక విధాలుగా ఇది వీనస్‌ను పోలి ఉందంటున్నారు. తర్వాతి తరం స్పేస్ మిషన్స్‌కు ఇది కేంద్రంగా మారుతుందని కూడా అంటున్నారు. ఆస్ట్రోనామికల్ జర్నల్‌లో ఈ వివరాలు ప్రచురించారు. దీనికి సంబంధించి వాతావరణ, జీవావరణ పరిశోధనలు చేయడానికి రంగం సిద్ధం చేసుకోవచ్చునంటున్నారు. భూమి వాతావరణం కంటే ఇక్కడ ఉపరితల ఉష్ణోగ్రత, వాతావరణం చాలా భిన్నంగా ఉంటుందట. ఇది సూర్యుడికి నలభైశాతం మాత్రమే సన్నిహితంగా ఉంటుందట. విశ్వాంతరాళంలో మనిషిని పోలిన జీవం, ఆలోచనలు చేయగల జీవాలు ఏవైనా ఉన్నాయా అనే అన్వేషణ చేసేందుకు ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన SETI (Search for Extra Terrestrial Intelligence) సంస్థ సైంటిస్టు Isabel Angelo మాట్లాడుతూ, సూర్యుడుచుట్టూ ఉన్న వాటిల్లో పోలికలు గమనిస్తే ఇది చాలా భిన్నంగా ఉందన్నారు. భూమి తరహా గ్రహం కోసం మనం చాలా రకాలైన అన్వేషణలు చేస్తున్నాం, కానీ ఈ అన్వేషణలతో పోల్చి చూస్తే ఈ గ్రహం మన భవిష్యత్ ఆవాసాన్ని అర్థం చేసుకోవడానికి బాగా ఉపయోగపడుతుందన్నారు.

నవ్య






**నవలా హృదయం-2**
వి.రాజారామమోహనరావు
**68 ప్రసిద్ధ తెలుగు నవలల విమర్శనాత్మక పరిచయాలు**
**ధర:** 290 రూపాయలు
**పేజీలు:** 408
**ప్రతులకు:** నవోదయ బుక్ హౌస్, ఆర్య సమాజ్ ఎదురుగా, కాచిగూడ క్రాస్‌రోడ్స్, హైదరాబాద్ - 27, ఫోన్: 040-24652387.

## 68 నవలల పరిచయం

ప్రతిఒక్కరూ ఆణిముత్యాల్లాంటి పుస్తకాలే చదవాలనుకుంటారు. గొప్ప గొప్ప నవలలన్నీ ఒకచోట కనిపిస్తే వివాహ భోజనంలా ఉంటుంది ఎవరికైనా. బిగినర్స్‌కి అయితే మరీనూ! ఆబగా అన్నీ చదివేయాలనిపిస్తుంది. కానీ అన్నీ కూర్చుని చదవాలంటే ఈ ఉరుకుల పరుగుల జీవితంలో అంత సమయం ఒకేసారి కేటాయించలేం. సరిగ్గా అలాంటివారు తమ కోరిక తీరేలా చదువుకోవడానికి ఉపయోగపడే పుస్తకమే ఈ 'నవలా హృదయం-2' 68 నవలల్ని సంపూర్ణంగా చదివిన గొప్ప అనుభూతి కలిగించే పుస్తకమిది.

డెబ్భైయ్యవ దశకం వరకు వచ్చిన కొన్ని సూపర్‌హిట్ నవలల పరిచయాలే ఇందులోవన్నీ. ఒకప్పటి మనుషులు ఎన్ని కష్టాలు అనుభవించారో, అజ్ఞానం, సంప్రదాయం, దారిద్ర్యం, మూర్ఖత్వం, సున్నితత్వం జాగరుకత నాటి మనుషుల్ని ఎలా ఆలోచింపజేసేదో, ఎలాంటి ప్రభావం చూపించేవో ఈ నవలా పరిచయాలు మనకు చెబుతాయి. తమకేం కావాల్లో తెలియని స్థితిలో బతికేసిన జీవితాలను కళ్ళకు కడతాయీ నవలలు. మూలకథా పరిచయం, పాత్రలు, సామాజిక ప్రయోజనం, నాటి పరిస్థితులు వంటివన్నీ ఎంతో చక్కగా వివరించారిందులో. ఈనాటి తరానికి తెలియని జీవిత చిత్రణలు, ఆనాటి సామాజిక స్థితిగతులు, ఊహలు, ఆశలు, పరిమిత జీవితం, పరిమిత ఆలోచనలు, మానవ సంబంధాలు, విశాల భావాలు కనిపిస్తాయి.

1967 నాటి 'కృష్ణాతీరం' లోని బ్రాహ్మణ వ్యవస్థ, ఆ తాలూకా మార్పులు, సంఘర్షణలను కళ్ళకు కట్టేలా పరిచయం చేశారు. రమారమీ నూరేళ్ళ చరిత్రగల చిలకమర్తివారి 'గణపతి' కూడా ఆ కోవలోదే. 1950వ దశకంలో వచ్చిన వి.డి.ప్రసాదరావుగారి మినువాక నవల యవ్వన వతులైన వితంతువుల విషాద జీవితాల దర్పణం. వారి బాధలు, బలమైన సంప్రదాయం మనుషుల్ని కట్టడి చేసిన తీరు కళ్ళకు కట్టిన నవల. పిలకా గణపతిశాస్త్రివారి విశాలనేత్రాలు, పాలగుమ్మివారి 'బ్రతికిన కాలేజీ, కొవ్వలివారి 'సిపాయి కూతురు', బలివాడ కాంతారావు ఇదేదారి, గోపీచంద్ మెరుపులు మరకలు, నోరి నరసింహశాస్త్రి 'కవిద్వయం', మునిమాణిక్యం రుక్కుతల్లి, కొడవటిగంటి అనుభవం, వట్టికోటవారి ప్రజల మనిషి, గంగు, యద్దనపూడి సెక్రటరీ, ఆరాధన... ఇలా ఒకటేమిటి పాఠకులు మెచ్చే నవలా రాజాలను ఎంతో వివరంగా పరిచయం చేశారు.

దశాబ్దాలుగా రచనలు చేస్తూ పాఠకాదరణ పొందిన రచయిత వి.రాజారామమోహనరావు. విలక్షణమైన వస్తువులతో కథా నవలా రచన చేయడంలో సిద్ధహస్తులు. 250కి పైగా కథలూ, 18 నవలలూ రాసిన ఈ పుస్తక రచయిత రచనలు ఇతరభాషల్లోకి కూడా వెళ్ళాయి. ఎన్నో అవార్డులు, బహుమతులు తన ఖాతాలో వేసుకున్నారు.

## స్వీకారాలు

**ఉత్తర రామచరితము**
**ద్విపద కావ్యము**
**తోడిశెట్టి రాములు**
**ధర:** 300 రూపాయలు
**పేజీలు:** 458
**ప్రతులకు:** రచయిత, ఇంటినెం. 4-9-357/3/1, సంజయనగర్, ఆదిలాబాద్-01
**సెల్:** 90101 07542.

**అష్టాదశ గీతామకరందములు**
**(పదునెనిమిది సంగ్రహ గీతార్థసారములు)**
సూర్య ప్రసాదరావు
**ధర:** 96 రూపాయలు, **పేజీలు:** 328
ప్రతులకు రచయిత, రిటైర్డ్ లెక్చరర్, ఇంటినెం. 5-6-18/బి, పాకబండ బజార్, ఖమ్మం-01. సెల్ 98851 56844.

**శ్రీసాయి విష్ణు సహస్రనామములు**
బ్రహ్మశ్రీ ఆనందసాయి స్వామి
**ధర:** 250 రూపాయలు, **పేజీలు:** 342
**ప్రతులకు:** శ్రీ శిరిడిసాయి ప్రేమపీఠం, ఇంటి నెం.124-133, శిల్ప లే అవుట్ ఫ్రెండ్స్ కాలనీ, చందానగర్, హైదరాబాద్-50
**సెల్:** 93964 30043.

**నమక చమకాలు**
**(అర్థతాత్పర్య విశేషాలు)**
**డా.తాడేపల్లి పతంజలి**
**ధర:** 120 రూపాయలు, **పేజీలు:** 208
ప్రతులకు గుడిపాటి శ్రీరామకృష్ణశర్మ, 17-25, ధర్మపురి కాలనీ, ఉప్పల్, హైదరాబాద్-38
ఫోన్ 94904 69300

**-లలితాత్రిపురసుందరి**




# ఫ్రాగ్రెన్స్

**'ఏమిటీ వాసన' గదిలోకి అడుగు పెడుతూనే అన్నాడు డిటెక్టివ్ శరత్.**

**'నిజమే' అన్నాడు ఇన్‌స్పెక్టర్ విజయ్. చాలా జాగ్రత్తగా గమనిస్తేగానీ వాసన గుర్తించలేం.**

**హోటల్ మేనేజర్ శరత్ పక్కనే ఉన్నాడు. 'ఇది రూమ్‌ఫ్రెషనర్ వాసనా?'**

'కాదండీ, మేం వాడే బ్రాండ్ వేరు.'

గదిని జాగ్రత్తగా గమనించాడు శరత్. వాసన శవంపైనుంచి వస్తోంది.

శవాన్ని జాగ్రత్తగా పరిశీలించాక అర్థమైంది శరత్‌కి. అమ్మాయిపై అత్యాచారం చేసినవాడి ఒంటిమీది పరిమళం అమ్మాయికి అంటుకుంది! ఇంతలో అసిస్టెంట్ రాము గదిలోకొచ్చి 'బాస్ హోటల్ గది రీతిక పేరుమీద క్రెడిట్‌కార్డ్‌తోనే బుక్ అయింది. అడ్రస్ ఇదిగో' ఇచ్చాడు రాము.

'గొంతు నులిమి చంపారని ప్రాథమిక దర్యాప్తు నివేదిక. అటాప్సీ రిపోర్టు వచ్చాకే ఏదైనా చెప్పగలం. అయితే ఈమె స్వచ్ఛందంగానే లైంగికచర్యలో పాల్గొంది' శరత్‌తో అన్నాడు డాక్టర్ ఫణి. హోటల్ రిజిస్టరులో వివరాలు చూశాడు శరత్. అమ్మాయి ఉదయం పదిగంటలకు హోటల్ రూమ్ తీసుకుంది. భర్త తరువాత వస్తాడని చెప్పింది. పన్నెండు గంటల ప్రాంతంలో ఓ నడివయసు వ్యక్తి వచ్చి వివరాలడిగి ఆ రూమ్‌కెళ్ళాడు. అతను తిరిగెళ్ళడం ఎవరూ గమనించలేదు. మర్నాడు రూమ్ క్లీనర్స్ తలుపుతీసి లోపలికెళితే శవం కనిపించింది.

'బహుశా ఉదయం అయిదు ఆరు మధ్యలో హత్య జరిగి ఉంటుంది' చెప్పాడు ఫణి.

***

'బాస్...ఆ రూమ్‌కొచ్చిన వ్యక్తిని చూసినవాళ్ళు ఇచ్చిన వివరాల ప్రకారం ఓ చిత్రపటం గీయించా' అని శరత్‌కిచ్చాడు రాము.

దాన్ని పక్కన పెట్టి, రూమ్ ఆర్డర్ల వివరాలు పరిశీలించసాగాడు శరత్.

'రాత్రి డిన్నర్ కూడా ఆర్డరిచ్చారు ఇద్దరికి. అంటే, అతడు రాత్రి కూడా ఉన్నాడు. అందరూ నిద్రిస్తుండగా తెల్లారే వెళ్ళిపోయుంటాడు' గెస్ చేశాడు శరత్.

'బాస్...రీతిక ఇంటికెళ్ళా. ఆమె మరణవార్త విని వాళ్ళు షాకయ్యారు. ముఖ్యంగా ఆమె భర్త'.

కళ్ళెగరేశాడు శరత్.

'యెస్ బాస్.. ఆమె భర్త పెద్ద వ్యాపారి. ఆమె సాఫ్ట్‌వేర్ కంపెనీలో ఉన్నతోద్యోగి'.

'భర్తని ప్రశ్నిద్దాం' అన్నాడు శరత్ లేస్తూ.

నేను అడిగాను బాస్.. అతడు ఇవాళ పొద్దున్నే, నేను వెళ్ళేముందే ఇంటికి చేరుకున్నాడు'.

'బెంగళూరులో అతని కదలికల్ని వెరిఫై చెయ్' చెప్పాడు శరత్.

ఇంతలో విజయ్ ఫోన్ మోగింది. ఫోనులో మాటలు విని 'వస్తున్నా' అన్నాడు విజయ్.

తెల్లారుజామున ఓఆర్ఆర్‌పై లారీ ఓ కారుని డీకొట్టి వెళ్ళిపోయింది' అని చెప్పివెళ్ళాడు విజయ్. అంతలో రాము వచ్చాడు.

'రీతిక వివరాలు సేకరించావా?'

'ఎస్ బాస్. ఆమె గురించి ఆఫీసులో బ్యాడ్‌లేదు. ఇద్దరు కొలీగ్స్ ఉన్నారుగానీ, వాళ్ళతో భౌతిక సాన్నిహిత్యం లేదు. భార్యాభర్తలమధ్య వాదాలున్నాయిగానీ మరీ అంత తీవ్రం కాదు' చెప్పాడు రాము.

'ఎవరా కొలీగ్స్'

'భార్గవ్, మైకేల్'.

***

'షి ఈజ్ ఎ గుడ్ గర్ల్. ఆఫీసు వ్యవహారాలే మాట్లాడేది. రెండు మూడు మార్లు డిన్నర్‌కో లంచ్‌కో వెళ్దాం అన్నాను. నవ్వుతూ తోసిపుచ్చింది. 'ఐ మిస్ హర్' భార్గవ్ మాటల్లో నిజాయితీ స్పష్టంగా తెలుస్తోంది.

'షి వజ్ ఎ స్వీట్ లేడీ. ఆమెని ముద్దుపెట్టుకున్న అనుభూతి మరవలేను. కానీ అంతకంటే ముందుకెళ్ళనీయలేదు. మిడిల్‌క్లాస్ మొరాలిటీ' పెద్దగా నవ్వాడు మైకేల్.

అతన్ని పరిశీలనగా చూశాడు శరత్.

'మీరు కాకుండా ఇంకెవరైనా ఆమె సాన్నిహిత్యం కోసం ప్రయత్నించారా?'.

'రీతిక చాలా అందగత్తె. ఆమెవెంట పడని వాళ్ళు లేరుగానీ ఆమెకు దగ్గరగా వెళ్ళింది నేనే. నాకన్నా దగ్గరగా ఆమె భర్తతప్ప మరెవరూ పోలేదు' గర్వంగా చెప్పాడు మైకేల్.

***

'నేను రాత్రి పది గంటలకు ఫోను చేశాను. ఆఫీసుపనిమీద భోపాల్ వెళ్తున్నానని చెప్పిందిగానీ, హైదరాబాద్‌లోనే హోటల్‌రూమ్‌లో ఉన్నట్టు చెప్పలేదు. ఇద్దరం కలిసే విమానాశ్రయానికి వచ్చాం. నా ఫ్లైట్ ముందు రావడంతో వెళ్ళిపోయాను. ఆమె విమానం ఎక్కలేదని నాకు తెలియదు' చెప్పాడు రీతిక భర్త రవి.

'మీకు ఎవరిమీదైనా అనుమానం ఉందా?' అడిగాడు శరత్.

తల అడ్డంగా ఊపాడు రవి.

'ఆమె హోటల్‌గది తీసుకోవటానికి మరో వ్యక్తిని భర్త అని చెప్పుకున్నట్టు మీకు తెలియదా?'

'తెలిస్తే, బ్రతకనిచ్చేవాడినా? ఇద్దరినీ చంపిపారేసేవాణ్ణి' కోపంగా అన్నాడు రవి.

అతన్ని పరిశీలనగా చూశాడు శరత్. ఓసారి ఇంటిని పరిశీలించవచ్చా? అడిగాడు. రవి తల ఊపాడు.

'బాస్...రవీ, రీతికల ఫోను వివరాలు సేకరించా. రవి చెప్పేది నిజమే. రాత్రికి అతడు ఫోను చేశాడుగానీ, పది గంటలకు కాదు, ఎనిమిదిన్నరకు!'

ఆలోచిస్తూ రామువైపు చూశాడు.

'ఆ రోజు రవి ఏ ఫ్లైట్‌కు హైదరాబాద్ చేరుకున్నాడు?' అడిగాడు శరత్.

చెప్పాడు రాము.

'బెంగళూరునుండి రాత్రి తొమ్మిదింటికి కారులో బయలుదేరితే ఉదయం ఎన్నిగంటలకు హైదరాబాద్ చేరుకోగలడు? ఎనిమిదిన్నరకు అతడు ఫోన్ చేసినప్పుడు బెంగళూరులోనే ఉన్నాడా?' అడిగాడు శరత్.

'కనుక్కుని చెప్తా బాస్' అంటూ లేచాడు రాము.

రీతిక ఫోను వివరాలు చూశాడు శరత్. ఆరోజు ఒక నెంబరుకు రెండు, మూడుమార్లు ఫోన్ చేసింది రీతిక.

శరత్ ఫోన్‌చేస్తే ఆ నెంబరు స్విచాఫ్ వస్తోంది. వెంటనే మరో నెంబరుకు చేసి, ఈ నెంబరు ఇచ్చాడు, వివరాలు ఇవ్వమని.

నిమిషాల్లో వివరాలు అందాయి. వాటి వైపు చూస్తూ లేచాడు శరత్.

**ఆ భార్యాభర్తలిద్దరూ చెరో విమానం ఎక్కడానికి కలిసి ఎయిర్‌పోర్టుకు వెళ్ళారు. భర్త బెంగళూరు విమానం ఎక్కాడు. భార్య వెనక్కు తిరిగి సిటీలోకొచ్చి హోటల్‌లో రూమ్ తీసుకుంది. తెల్లారేసరికి హత్యకు గురైంది. ఎవరో ఆమెను గొంతు నులిమి హతమార్చారు. డిటెక్టివ్ శరత్ కేసు టేకప్ చేశాడు. ఇంతకీ ఈ కేసులో హంతకుడెవరు? శరత్ అతన్ని ఎలా కనిపెట్టాడు?**

***

'అవును శరత్, వాళ్ళింట్లోవాళ్ళు మిస్సింగ్ రిపోర్టు ఇచ్చారు' రికార్డులు చూస్తూ చెప్పాడు విజయ్. 'ఓఆర్ఆర్ మీద ఓ ఏక్సిడెంట్‌లో గుర్తు తెలియని వ్యక్తి చనిపోయాడు. ఒకవేళ అతనే వీళ్ళ మనిషా? అనే నిర్ధారణ కోసం చూడటానికి రమ్మన్నాను.

ఈపాటికి వస్తూనే ఉండాలి'.

విజయ్ మాటలు పూర్తికాకముందే జవహర్ బంధువులు వచ్చారు. వారితోపాటు మార్చురీగదికి వెళ్ళాడు శరత్.

శరీరంపైన తెల్లగుడ్డ తొలగించగానే జవహర్ బంధువులు గొల్లుమన్నారు.

శరత్ కళ్ళు పెద్దవయ్యాయి. శవంపైన గుడ్డ తీయగానే అతిసన్నగా ఓ వాసన శరత్ నాసికను తాకింది. ఇది రీతిక శరీరంపైనుండి వచ్చిన వాసనే.

***

'బాస్. జవహర్ ఓ పెద్ద సాఫ్ట్‌వేర్ కంపెనీ సి.ఇ.ఓ. అతడికి, రీతిక పని చేస్తున్న కంపెనీకి మధ్య వ్యాపార లావాదేవీలున్నాయి. తన కంపెనీ తరపున రీతిక ఆరునెలలు డెప్యుటేషన్ బేసిస్‌లో జవహర్ కంపెనీలో పని చేసింది. బహుశా అప్పుడే సాన్నిహిత్యం ఏర్పడి ఉంటుంది' గబగబా చెప్పాడు రాము.

'రవి గురించి వివరాలేమైనా సేకరించావా?' అడిగాడు శరత్.

'అనుమానం లేదు బాస్. అతను బెంగళూరు లోనే ఉన్నాడు, సెక్రటరీ ధృవీకరించింది. ఆమె కూడా బెంగళూరు వెళ్ళింది' చెప్పాడు రాము.

ఇంతలో రాము అసిస్టెంట్ ఓ బాటిల్ తెచ్చి రాముకి ఇచ్చాడు.

'బాస్, ఇది జవహర్ వాడే ఫ్రాగ్రెన్స్ బ్రాండ్' శరత్‌కి అందించాడు.

శరత్ దాని వాసనచూసి తల అడ్డంగా తిప్పాడు.

***

శరీరంపై వాడే సువాసన ద్రవ్యాలను ప్రత్యేకంగా అమ్మే దుకాణాలు, సూపర్‌మార్కెట్లన్నీ తిరిగాడు శరత్. ఎక్కడా అతను ఆఘ్రాణించిన పరిమళం లేదు. దుకాణాలవాళ్ళకు ఆ ఫ్రాగ్రెన్స్ గురించి సరిగ్గా వివరించలేకపోతున్నాడు శరత్. ఓ దుకాణంలో చెప్పారు. 'మేము విదేశీబ్రాండ్స్ అమ్ముతాం సార్. చార్మినార్ పక్కసందులో ఉన్న దుకాణంలో ప్రపంచం నలుమూలల నుంచి వచ్చే అరుదైన పరిమళాలు దొరుకుతాయి. అక్కడ ప్రయత్నించండి. అయితే అన్నీ స్మగుల్డ్ గూడ్స్. పోలీసులంటే వాళ్ళేం వివరాలు చెప్పరు.

***

పెదవి విరిచాడు శరత్. 'ఇవేవీ కాదు. అది చాలా ప్రత్యేకంగా ఉంటుంది. మల్లెపూలు, తేనె, నిమ్మకాయలు కలిపితే వచ్చే ఒకలాంటి మధురమైన వగరులాంటి వాసన'.

శరత్ చెప్తుంటేనే దుకాణం యజమాని ముఖం వెలిగిపోయింది. 'ఓ.. అదా అది అతి అరుదైన బ్రాండ్. చాలా ఖరీదు. మొత్తం సౌత్ ఇండియాలో ఒకే ఒక వ్యక్తి వాడతారు దీన్ని. వారి కోసమే తెప్పిస్తాను. చూడండి' అంటూ లోపలినుండి తెచ్చిచ్చాడు.

వాసన చూస్తూనే తల ఊపాడు శరత్. 'ఎవరు దీన్ని కొనేది?' అడిగాడు.



'సిమి. సిమి అగర్వాల్' గర్వంగా చెప్పాడు దుకాణం యజమాని.

'ఆమె అడ్రస్ ఇస్తారా? ఈ బ్రాండ్ కొనవచ్చో లేదో తెలుసుకుంటాను. ఇది ఒరిజినలా? డూప్లికేటా అని నిర్ధారించుకుంటాను' కాజువల్‌గా అన్నాడు.

***

'ఎస్?' తలుపు తెరచి శరత్‌ని ప్రశ్నార్థకంగా చూసింది సిమి.

ఆమెని చూస్తుంటేనే ఐశ్వర్యంలో మునిగి తేలుతోందని అర్థమౌతోంది.

'మీరు వాడే అరుదైన ప్రత్యేక పరిమళం గురించి తెలుసుకోటానికి వచ్చాను' చెప్పాడు శరత్.

ఆమె లోపలకు రమ్మంది. శరత్, విజయ్, రాము లోపలకు వచ్చి కూర్చున్నారు.

'చెప్పండి. ఏం కావాలి మీకు?' అడిగిందామె.

'మీరు వాడే ప్రత్యేక పరిమళం, మీరుకాక ఇంకెవరైనా వాడతారా?'

'లేదు. అది నాకే ప్రత్యేకం. అందరూ వాడేది నేను వాడను. నేను వాడేది ఎవరూ వాడరు. వాడనివ్వను' దృఢంగా చెప్పిందామె.

శరత్ ఏదో అడగబోయాడు. ఇంతలో 'డార్లింగ్' అంటూ అప్పుడే స్నానంచేసి టవల్ చుట్టుకుని, తల తుడుచుకుంటూ గదిలోకి అడుగుపెట్టాడు. అప్పుడే ఒళ్ళంతా పరిమళం కొట్టుకున్నాడేమో గదినిండా ఆ ప్రత్యేక పరిమళం గుప్పుమంది.

గదిలోకి అడుగుపెట్టిన రవి వీళ్ళనిచూసి ఆగిపోయాడు. నోటమాట రాలేదు.

'రండి. కూర్చోండి. రీతికను, జవహర్‌ను ఎలా హత్యచేశారో, ఎందుకు హత్య చేశారో చెప్పండి' నవ్వుతూ మర్యాదగా అన్నాడు శరత్.

***

'తన భర్త రవికి సిమి అనే ధనవంతురాలితో సంబంధం ఉందని రీతిక తెలుసుకుంది. అతనిమీద కోపంతో జవహర్‌తో సంబంధానికి ఒప్పుకుంది. భర్త సిమితో బెంగళూరు వెళ్తున్నాడని తెలియగానే హోటల్‌లో జవహర్‌ని కలవాలని పథకం వేసింది. కానీ రవి ఎప్పటినుండో రీతికను వదిలించుకోవాలనుకుంటున్నాడు.

రీతిక హోటల్ గదికి వెళ్ళాడు. ఇద్దరూ గొడవపడ్డారు. చివరకు రాజీ పడినట్టు నటించాడు రవి. ఇద్దరూ మారిపోవాలని ఒప్పందం చేసుకున్నారు. భౌతికంగా ఏకమయ్యారు. చివరలో ఆమె గొంతు నులిమి చంపేసి ఎరగనట్టు వెళ్ళిపోయాడు. నేరం జవహర్‌పైకి పోతుందనుకున్నాడు. కానీ ఆమె కోసం వచ్చిన జవహర్ గదిలో శవం చూసి పారిపోతుంటే వెంబడించి కారులో ఎక్కించుకున్నాడు రవి. కొట్టి చంపాడు. కారుకి ఓఆర్ఆర్‌పై ఏక్సిడెంట్ చేశాడు. అప్పటికే నెంబర్‌ప్లేట్లు తీసేయటంతో కారును గుర్తించటం ఆలస్యం అయింది. వెనకే సిమి కారులో వచ్చింది. ఆ కారులో ఇద్దరూ ఎయిర్‌పోర్టు కెళ్ళి అప్పుడే విమానం దిగినట్టు నటించారు. వాళ్ళు బెంగళూరు వెళ్ళలేదు. సెక్రటరీ అబద్ధం చెప్పింది. అయితే సిమి ఇంట్లో సెంటు అతడికి ఇష్టం. ఆ సెంటు ఒళ్ళంతా దట్టంగా పట్టించాడు. రీతికను కలిసినప్పుడు అది ఆమె ఒంటికి అంటుకుంది. కారులో జవహర్‌కి పట్టింది. రవి నేరాన్ని పట్టించింది ఈ ప్రత్యేక పరిమళమే' చెప్పాడు శరత్.

**—కస్తూరి మురళీకృష్ణ**

*సెల్: 98496 17392*

# ఇదేం ప్రేమ బాబోయ్!



**ప్రేమా, పిచ్చీ ఒకటేనంటారు. ఇవి ఎప్పుడూ ఒకే రకంగా ఉండవు. పరిస్థితులకు అనుగుణంగా పలు రకాలుగా మారుతూ ఉంటాయి. అంతేకాదండోయ్....ప్రదేశాలను బట్టి కూడా ప్రేమించే పద్ధతులు మారతాయి. మనలాగా అందరూ ఓ గులాబీ పువ్వు చేతికిచ్చి తమ ప్రేమను వ్యక్తం చేయరు. రకరకాల పద్ధతుల్లో ప్రేమను వ్యక్తం చేస్తుంటారు. వాటిల్లో కొన్ని అసాధారణంగా ఉంటాయి. వాటి గురించి విన్నా, చదివినా అసలు దాన్ని ప్రేమ అంటారా? అన్న అనుమానం కూడా వస్తుంది. అలా అసాధారణ ప్రేమల గురించి....**

### ప్రేమ కుటీరాలు

కాంబోడియాలోని క్రియుంగ్ (Kreung) తెగలో కుటుంబ పెద్ద తమ కూతుళ్ళ కోసం ప్రేమ కుటీరాలు నిర్మించి ఇస్తాడు. యుక్త వయస్సు వచ్చినప్పటి నుంచీ ఈ కుటీరాలలోనే ఆడపిల్లల నివాసం. తమకు సరైన జోడీ దొరికేంత వరకూ ఆడపిల్ల ఈ కుటీరంలో ఉంటుంది. అంతే కాకుండా ఆడపిల్లలు తాము ఇష్టపడిన మగపిల్లలను ఈ కుటీరానికి తెచ్చుకోవచ్చు. వివాహం జరిగేంత వరకూ వారిద్దరూ కుటీరంలోనే గడుపుతారు. కొన్ని రోజుల తరువాత ఇద్దరిలో భేదాభిప్రాయాలు తలెత్తితే ఆడపిల్ల మగపిల్లవాడిని పొమ్మని చెప్పవచ్చు. లేదా మగపిల్లవాడే ఆ కుటీరం నుంచి వెళ్ళిపోవచ్చు. ఒక ఆడపిల్ల ఎంతమంది మగపిల్లలతోనైనా ఈ కుటీరంలో నివసించే అధికారం ఉంటుంది. ఒకసారి పెళ్ళి అయితే మాత్రం భర్తను వదిలే హక్కు ఆమెకు ఉండదు. ఇది కొద్దిగా సహజీవనానికి దగ్గరగా ఉండే ప్రక్రియ.

### ఆపిల్ ముక్క తింటే చాలు

ఆస్ట్రేలియాలోని మారుమూల ప్రాంతాలలో ఇప్పటికీ ఓ ఆచారం అమలులో ఉంది. ఆయా ప్రాంతాలలో జరిగే ఉత్సవాలు, జాతర సందర్భాలలో ఆడపిల్లలు తమ చేతి కింద ఆపిల్ ముక్క పెట్టుకుని నృత్యం చేస్తారు. ఆ సమయంలో అక్కడకు వచ్చిన పురుషులలో తనకు నచ్చిన వ్యక్తికి ఆడపిల్ల తన చేతికింద దాచుకున్న ఆపిల్ ముక్కను తినేందుకు ఇస్తుంది. ఆ వ్యక్తి కూడా ఆ అమ్మాయిని ఇష్టపడితే ఆ ఆపిల్ ముక్క తింటాడు. అలా ఆపిల్ ముక్క తింటే వారిద్దరికీ వివాహం అయినట్టే. ఇప్పుడిప్పుడే ఈ ఆచారాన్ని అక్కడి యువకులు వ్యతిరేకిస్తున్నారు. చేతుల కింద దాచుకున్న ఆపిల్ ముక్కను తినడం అనాచారంగా భావిస్తున్నారు.

### బహుభార్యత్వం చట్టబద్ధమే

షైనార్టీలలో కనిపించే ఈ ఆచారం నేపాల్ లోని ఓ తెగలో ఇప్పటికీ అమలులో ఉంది. ఈ తెగలో బహుభార్యత్వం అనేది సర్వసామాన్యం. అక్కడ భూమి ఎక్కువ. సాగుచేసే వారు తక్కువగా ఉండడంతో ఈ ఆచారం అమలులోకి వచ్చింది. ఒక వ్యక్తి ఎంతమందినైనా వివాహం చేసుకోవచ్చు. పిల్లల్ని కనవచ్చు.



### పదమూడు సంవత్సరాలకే ప్రేమ

దక్షిణ పసిఫిక్ సముద్రంలోని మాంగాయి దీవిలో నివసించే వారిలో ఓ వింత ఆచారం ఉంది. మగపిల్లలు పదమూడు సంవత్సరాల వయస్సు నుంచే తమ కన్నా పెద్ద వయస్సు స్త్రీలతో ప్రేమ వ్యవహారం కొనసాగిస్తారు. వారినుంచి ప్రేమ పాఠాలు నేర్చుకుంటారు. వారితో కలిసి శృంగారంలో పాల్గొన్నా అక్కడ నేరంగా పరిగణించరు. వివాహిత స్త్రీలు కూడా పై విధంగా మగపిల్లలకు ప్రేమ పాఠాలు నేర్పించవచ్చు. కానీ వివాహం చేసుకున్న పురుషులు స్త్రీలతో ప్రేమ వ్యవహారాలు నెరపడం నేరం.

### ఆరు సంవత్సరాలకే శృంగారం?

న్యూ గినియా (New Guinea) లోని ట్రోబ్రియాండర్ తెగలో ఓ వింత ఆచారం అమలులో ఉంది. ఆ తెగలో ఆరు సంవత్సరాల నుంచే ఆడపిల్లలు కానీ, మగపిల్లలు కానీ శృంగారంలో పాల్గొనవచ్చు. తమ జీవిత భాగస్వామిని ఎంచుకునేంత వరకూ ఈ తంతు కొనసాగుతూనే ఉంటుంది. చిన్నతనంలో ఏర్పడే ప్రేమ పటిష్ఠంగా ఉంటుంది అనేది ఇక్కడి వారి నమ్మకమట!

### భార్యలను దొంగతనం చేస్తారు

దక్షిణాఫ్రికాలోని నైజర్ వదాబి అనే తెగలో ఓ వింత ఆచారం ఉంది. పండుగలు, జాతరల సందర్భంగా పురుషులు రకరకాల వేషధారణలో ఇతరుల భార్యలను దొంగిలిస్తారు. అలా సొంతం చేసుకున్న స్త్రీని తమతో తీసుకెళ్ళే హక్కు వారికి ఉంటుంది. కొందరు సరదాకి ఈ విధంగా చేస్తే మరి కొందరు ఇతరుల భార్యలని కామించి వారిని దొంగతనం చేస్తారు. నాగరిక సమాజంలో దీనిని అక్రమ సంబంధంగా భావిస్తాం. వదాబి తెగవారు ఏ అభిప్రాయంతో చేసినా ఆ స్త్రీ అప్పటి నుంచి వారి సొంతం అవుతుంది.

ప్రేమ, ఆచారాల పేరుతో ఇలాంటి వికృత చేష్టలు ప్రపంచవ్యాప్తంగా చాలా ప్రాంతాలలో అమలులో ఉన్నాయి. కుటుంబ వ్యవస్థను విచ్ఛిన్నం చేసే ఇలాంటి వికృత ఆచారాలకు ఇవి కొన్ని మచ్చుతునకలు మాత్రమే!

—చిన్ని








రైల్వేస్టేషన్ సమీపిస్తున్నది. అప్పటి వరకు స్తిమితంగా కూర్చున్న ఆ వ్యక్తి కంగారుగా సీట్లోంచి లేచాడు. అతను ఓ బ్యాంకులో క్యాషియర్.

కర్నాటక, ఆంధ్రప్రదేశ్, తెలంగాణ... మూడు రాష్ట్రాల సరిహద్దుల్లో ఉంది ఆ రైల్వే స్టేషన్. ఆ స్టేషన్లో దిగితే ఎవరి కళ్ళైనా కప్పి, ఎవరైనా ఇట్టే మాయమైపోవచ్చు. దానికి తోడు ఆ రోజు స్టేషన్ అంతా చిమ్మ చీకటిగా ఉంది.

మూడు రాష్ట్రాల పోలీసులూ ఆ చీకట్లో

ఆ రైల్వేస్టేషన్లో కాపు కాశారు.

రైలు ఆగింది.

అతను దిగలేదు. రైలంతా అతని కోసం గాలించారు.

లేదు! దొరకలేదు!

ఏమయ్యాడతను? ఎక్కడ దాగున్నాడు?

ప్రముఖ రచయిత **ప్రభాకర్ జైని**

మరో అద్భుత సృష్టి

# లాకర్ నంబర్ 369

## సీరియల్ త్వరలో



# రాగబంధాలు

-డాక్టర్ వాణీ దేవులపల్లి

**"మీనా! మా రాధక్కయ్య అమెరికా నుంచి వచ్చిందట. హైదరాబాద్‌లో అన్నయ్య వాళ్ళింట్లో దిగిందని తెల్సింది. సర్‌ప్రైజ్ చేద్దామని ముందుగా ఫోన్ కూడా చెయ్యకుండా వచ్చిందట. మనింటికీ ఏ క్షణాన్నైనా రావచ్చు మరి" టీవీ చూడ్డంలో నిమగ్నమైన భార్యతో అప్పుడే గుర్తొచ్చినట్టు చెప్పాడు గోపాల్.**

"అవునా! ఇది నిజంగా హ్యాపీన్యూస్! కదండీ?!" మొహంనిండా ఆనందం పులుముకుని అంటున్న భార్యను చూసి, "ఇదో పిచ్చిమొద్దు. ఇంటికి ఏ చుట్టాలొచ్చినా ఎగిరిగంతేసే రకం. ఇక మా రాధక్కయ్య అయితే ఇంక దాన్ని పట్టలేం.."

మనసులోనే అనుకుని, "అవుననుకో!... కానీ ఒక్క విషయం మీనా... మన ఆర్థికపరిస్థితి తెలియక ఆవిడ "మీనా! నువ్వు చేసే కారప్పూస నోట్లో వేసుకుంటే కరిగిపోతుందే" అనో "నువ్వు చేసే కాకినాడ ఖాజాల రుచి కాకినాడవాళ్ళు చేసినా రాదు" అనో ఉబ్బేస్తే, ఆ పొగడ్తలకు కరిగిపోయి పొంగిపోయి, "ఓ... దానికేం భాగ్యం వదినగారూ.." అని ఎగిరి గంతేసి ఒళ్ళు హూనం చేసుకుంటూ తయారుచెయ్యడం కాదు. కాస్త బుర్ర ఉపయోగించు. నీతో ఇదే చిక్కు మీనా.. నీకెలా చెప్పాలో అర్థంగాదు. నా ఉద్దేశం ఏంటంటే.. కాస్త.. నువ్వు మన ఇంటి పరిస్థితి గమనించి కొన్ని వినీ విననట్టుండు. అప్పులుచేసి కొప్పులు పెట్టడం.. అప్పులోళ్ళతో మాటలుపడటం నావల్ల కాదు మీనా.. వింటున్నావా?" రిమోట్‌తో ఛానల్స్ మారుస్తూ తదేకంగా టీవీ చూడ్డంలో మునిగిపోయిన భార్య, అసలు తన మాటలు వింటోందా అని సందేహమేసిందతనికి. గోపాల్ తనన్న మాటలు మళ్ళీ రెట్టించేసరికి, తన చురుకైన కళ్ళతో తీక్షణంగా చూసిందతనివైపు మీనా. ఒక్క మాట చెప్పండి. అసలు ఆ వచ్చే ఆవిడ ఎవరు? స్వయానా మీ అక్కయ్య. మనకంటే పెద్దావిడ. విదేశాల్లో ఉండి ఎప్పుడో ఎన్నో ఏళ్ళకి ఒక్కసారి వచ్చే ఆవిడను నొప్పిస్తామా చెప్పండి. అయినా ఏ బంధువులైనా వారికి లేక మనింటికిరారు గదా! ప్రేమతో కలిసి ఉందామనేగదా వచ్చేది. అందునా తోడబుట్టిన వాళ్ళయితే కష్టం సుఖం చెప్పుకుని పుట్టింట్లో సేద దీరుదామనే వస్తారు. అయినా ఆవిడుండేది నాల్రోజులు. మహా అయితే ఓ వారం లేదా పది రోజులు. ఆ సమయంలో మన ఇబ్బందుల్ని ఆవిడకు తెలియనీయకుండా ఉంచడం మన విచక్షణపైన ఆధారపడి ఉంది. ఆ తరువాత మీ ఇష్టం" మీనా కాస్త ఘాటుగానే బదులిచ్చింది. "బాప్‌రే! ఈ మీనా ఎప్పుడూ ఇంతే! నాకు క్లాస్ తీసుకోవడమేగానీ నా అంతరంగం అర్థం చేసుకుందెప్పుడుగనుక..." తనలో తనే గొణుక్కున్నాడు గోపాల్.

ఇంతలో ఇంటిముందు కారాగిన శబ్దానికి తలెత్తి చూశాడు. అక్కడే ఆరుబయట ఆడుకుంటున్న గోపాల్ పిల్లలు కూడా ఆట మధ్యలో ఆపి, కారునే చూస్తున్నారు సంభ్రమంగా.

"అదిగో! మీనా..! రాధక్కయ్య రానే వచ్చింది.." పేపర్ మడిచి పక్కనేస్తూ ఎదురెళ్ళి నవ్వుతూ రాధను రిసీవ్ చేసుకున్నాడు గోపాల్. "ఒరేయ్! గోపీ బావున్నావురా..." తమ్ముణ్ణి ఆప్యాయంగా దగ్గరకు తీసుకుంటూ అడిగింది రాధ. అక్కడే నోట్లో వేళ్ళేసుకుని, ఇంతింత కళ్ళతో ఆశ్చర్యంగా చూస్తున్న పిల్లల్నిచూస్తూ, "నీ పిల్లలే కదరా! అప్పుడే ఎంత పెద్దయ్యారు.." అంటూ వాళ్ళని ప్రేమగా దగ్గరకు పిలిచింది. ముందు కొంత కొత్త చేసినా, గోపాల్ కూడా పిలిచేసరికి రాధ దగ్గరకొచ్చారు వాళ్ళు. "వదిన గారూ, బావున్నారా?" ఎదురొచ్చి పాదాలకు నమస్కరించి అడిగింది మీనా.

"ఆc... ఆc.... మీనా.. అబ్బ ఎన్నేళ్ళయిందే మిమ్మల్నంతా చూసి..." మీనా భుజంపట్టి లేపి ప్రేమగా అక్కున చేర్చుకుంది రాధ. "అవునొదిన గారూ!.... మూడేళ్ళపైనే అయింది మీరు ఇండియా వచ్చి..." నిష్ఠూరంగా అంది మీనా. "అందుకే గదా! ఈసారి పిల్లలకు, మీ అన్నయ్య గారికి వీలుగాకున్నా ఒక్కదాన్నే వచ్చాను" సంజాయిషీగా అంది రాధ.

ఇంతలో సామానుతో వచ్చిన డ్రైవర్‌ను చూసి, "ఒరేయ్ గోపీ డ్రైవర్‌కి ఓ వంద చిల్లరుంటే టిప్ ఇచ్చి పంపించరా! పాపం టిఫిన్‌చేసి వెళ్తాడు బయట" గోపాల్‌కు పురమాయించి, మీనాతో లోనికెళ్తున్న అక్కతో "అలాగే అక్కయ్యా" అని పైకి అంటూనే జేబులోంచి వందనోటు తీస్తూ "హూ! ఇహ షురూ..." నిట్టూరుస్తూ మనసులో అనుకున్నాడు గోపాల్. క్యాబ్ డ్రైవర్ని పంపించాక, "మీనా! బజారుకెళ్ళే పనేమైనా ఉందా? కూరలవీ సరిపోతాయి గదా! అన్నట్టు... పెరుగు ఉందా?" వంటగదిలోకొచ్చి చిన్నగా అడిగాడు గోపాల్. ఆమె సరిపోతాయన్నట్టు తలూపింది. ఇంతలో రాధ ఇల్లంతా తిరిగి కలియజూసింది. సింగిల్ బెడ్‌రూం ఇల్లు. డ్రాయింగ్ కమ్ హాల్ మధ్యన పార్టీషన్‌తో బెడ్‌రూం, కిచెన్. హాలు నానుకొని కామన్ బాత్రూం! వీడి పరిస్థితిలో ఏమీ మార్పులేదైతే!" మనసులోనే నిట్టూర్చింది రాధ. పెద్దవాడిది ప్రభుత్వోద్యోగం. భార్యకూడా ప్రైవేటు ఉద్యోగం చేస్తోంది. వాడి పరిస్థితి బాగానే ఉంది. భార్యాభర్తలిద్దరికీ చెరో కారు. పిల్లలకు స్కూటీలు ఉన్నాయి. ఇల్లు కూడా సొంతందే! పాపం వీళ్ళేమో ఇద్దరూ ప్రైవేటు

స్కూళ్ళల్లో పని చేస్తున్నా, వచ్చేజీతంతో ఇంటద్దె, కరెంటు బిల్లు, పిల్లల ఫీజులు, ఇంటిఖర్చులు పోను ఏం మిగుల్తాయి ఆకాశాన్నంటే ధరలకు" ఆలోచిస్తున్న రాధ తమ్ముడి మాటలకు ఈ లోకంలోకొచ్చింది. "అదేంటక్కయ్యా! క్యాబ్‌లో వచ్చావు. అన్నియ్యవాళ్ళ కార్లు ఖాళీ లేవా? అయినా ఆదివారమే గదా! అన్నయ్య, వదిన, పిల్లలూ వస్తే అందరం కలిసి సరదాగా ఓ రోజు గడిపేవాళ్ళం కదా!" రాధ పక్కన కూర్చుంటూ అడిగాడు గోపాల్. "అవున్రా! నేనూ అన్నాను రమ్మని. కానీ వాడికేవో పనులవల్ల రాలేకపోతున్నా అన్నాడు. ఇక కారు గురించి అంటావా, పాపం.. వాడికార్లోనే డ్రైవర్నిచ్చి వెళ్ళమన్నాడు రా... కానీ.. నేనే వద్దన్నాను. క్యాబ్ మాట్లాడమని చెప్పాను. నాకు అలవాటే గదరా ఇలాంటి ప్రయాణాలు.."

రాధక్కయ్య సంగతి నాకు తెలీదా? ఎవ్వరి గురించైనా మంచే మాట్లాడుతుంది. ఆమె పాజిటివ్ దృక్పథమే ఆమెకున్న గొప్ప అసెట్!" మనసులో అనుకున్నాడు గోపాల్. ఇంతలో మీనా తెచ్చిన కాఫీని ఆస్వాదిస్తూ చాలాసేపు మాట్లాడుకున్నారు అక్కా తమ్ముళ్ళు.

భోజనంలోకి రాధకి ఇష్టమని మామిడికాయ పప్పు, బూడిదగుమ్మడికాయ వడియాలు, చల్ల మిరపకాయలు వేయించి, దొండకాయ పూర్ణం పెట్టి, చివరగా సేమ్యా పాయసం చేసింది మీనా!

"అబ్బా! మీనా.. ఎన్నాళ్ళయిందే ఇలాంటి భోజనం.. అందులో అమృతం లాంటి నీ చేతి భోజనం తిని.." అంటూ తృప్తిగా భోం చేసింది రాధ. భోజనాలు అయ్యాక తమ్ముడు తెచ్చిన మిఠాపాన్ తింటూ హాల్లో పడక్కుర్చీలో వాలింది. కాస్సేపు అందరూ కబుర్లలో మునిగిపోయారు. పిల్లల్ని పిలిచి, అమెరికా నుంచి తాను వాళ్ళకోసం తెచ్చిన చాక్లెట్లు, బొమ్మలు, బట్టలు ఇచ్చి కాస్సేపు దగ్గర కూర్చోబెట్టుకుని వాళ్ళతో సరదాగా గడిపింది. వాళ్ళతో పాటలు పాడించుకుని, డాన్సులు చేయించుకుని ఫొటోలు తీసింది తన ఐఫోన్‌తో. సంతోషంతో విప్పారిన కోడలు, అల్లుడు మొహాలు చూసి ఎంతో మురిసిపోయింది రాధ. మీనాకు హ్యాండ్‌బ్యాగ్, గోపాల్‌కు టీ షర్టులు, పర్ఫ్యూమ్ బాటిలూ ఇచ్చింది. "ఇవన్నీ ఇప్పుడు అవసరమా అక్కయ్యా..." తీసుకుంటూనే మొహమాటంగా అన్నా, మనసులో మాత్రం, "ఒక స్మార్ట్ ఫోనో, ఓ ల్యాప్‌టాపో, కనీసం ఓ ఐపాడ్ అన్నా తేవొచ్చు గదా! అంతేలే... ఉండగానే సరా..? ఇచ్చే పెద్దమనసు ఉండొద్దూ?" నిరాశగా అనుకున్నాడు గోపాల్. అతనికెందుకో ఈ విషయంలో చాలా అసంతృప్తిగా అనిపించింది. రాధ అలా మాట్లాడుతూనే పడక్కుర్చీలోనే నిద్రలోకి జారుకుంది. "ఏవండీ! వదినగారున్నన్ని రోజులు సెలవు పెడదామనుకుంటున్నాను! అఫ్‌కోర్స్ లాస్‌ఆఫ్ పేనే అనుకోండి" నవ్వింది మీనా. ఆమెవైపు అభావంగా చూశాడు గోపాల్.



"ఇంకో విషయం.. చీరల ఆంటీ దగ్గర వదినగారికి ఖాతాలో ఒక మంచిచీర తెద్దామనుకుంటున్నాను. రెండు మూడు వాయిదాల్లో ఇస్తానని చెప్తాను" గొంతుతగ్గించి అంది మీనా. "ఇదిగో గొప్పలకు పోయి, ఖరీదైనదేం తీసుకురానక్కర్లేదు. అంత డబ్బున్నా కూడా మనకేం ల్యాప్‌టాప్‌లూ తేలేదు. మనపిల్లలకు ఓ ఐపాడో, కనీసం ఐ పాడో కూడా తీసుకురాలేదు. చూసి నేర్చుకోవాలి.." దగ్గరగావచ్చి చిన్నగా అన్నా తీవ్ర గొంతుతో అన్నాడు గోపాల్.

"అబ్బా! మీరు ఈ జన్మలో మారరండీ!" విసుక్కుంది మీనా. "చూడండీ! జీవన సంబంధాలన్నింటినీ వ్యాపారబంధాలుగా చూడకూడదండీ! ఒక్కో జీవనబంధం ఒక్కో

రాగాన్నాలపిస్తుంది. ముఖ్యంగా, రక్తసంబంధీకుల మధ్య ఉండే రాగబంధాలు పుష్పించే పరిమళాలు ప్రత్యేకమైనవీ, అమూల్యమైనవీ! వీటిని లెక్కల్లో చూడలేం. ఆమె ఎంత విలువ తెస్తే మనం అంత వరకే పెట్టాలి అనే లెక్కలు మనల్ని ఎప్పుడూ ఓ మెట్టుకిందనే నిలబెడతాయి. మా నాయనమ్మ అంటుండేవారు ఆడపడుచులంటే చేదబావులని. వారికి ఎప్పుడో ఒకసారి పసుపుకుంకుమలతో మనం పెట్టే బట్టలు నాణ్యమైనవిగా ఉంటేనే బావుంటాయి. అందుకే ఆమెకు నాణ్యమైన బట్టలే తీసుకొస్తాను. ఇకపోతే, అప్పు వాయిదాల్లో నా జీతంలోంచి మెల్లగా నేనే తీరుస్తాను లెండి! అలాగే రేపు సాంబయ్య కిరాణాకొట్లో ఖాతా రాయించి సామాను పట్టుకురండి. లిస్టు రాసిస్తాను. వదిన గారికి కారప్పూస, బూందీలడ్డూలూ, పల్లీ పట్టీలు, అరిశెలు, చక్కిలాలు చేసిస్తాను. వెళ్ళేటప్పుడు అన్నయ్యకు, పిల్లలకి పట్టుకెళ్ళడానికి.. పాపం వాళ్ళకు ఫలహారాలంటే చాలా ఇష్టం" గోపాల్‌కు మీనా చెబుతున్న ఒక్కొక్కమాటా నెత్తిమీద సుత్తితో బాదుతున్నట్టుగా అనిపించింది.

"నాకు తెలుసు. ఈ అప్పు మనం ఆర్నెల్లైనా తీర్చలేం.." పెద్దగా అనబోయి మీనా మొహం చూసి గొణిగినట్టుగా అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

రాధ వచ్చి అప్పుడే నాల్రోజులైంది. ఆమెకెంతో ఊరటగా ఉంది. మీనా, పిల్లల సమక్షంలో సమయం తెలియకుండానే గడిచిపోతోంది. గోపాల్‌కు సెలవులే అయినప్పటికీ, అడ్మిషన్ పని ఉందంటూ, స్కూలుకు వెళ్తూనే ఉన్నాడు. మీనా ఒక్కతే సెలవు పెట్టి రాధను, పిల్లల్ని తీసుకుని ఓ రోజు సినిమాకని, ఓ రోజు ఎగ్జిబిషన్‌కు, ఓ రోజు భద్రకాళి అమ్మవారి గుడికి, రామప్ప దేవాలయానికి, బంధువుల ఇళ్ళకూ తీసికెళ్ళి వదినగారు ప్రతీ సాయంత్రం ఆనందంగా గడిపేట్టు చేసింది. అదీగాక, రాధ అమెరికా నుండి వచ్చిందని తెలిసి, చూడ్డానికొచ్చే బంధువుల రాకతో, హడావిడితో చూస్తూనే ఎంతో సరదాగా వారం గడిచిపోయింది. "ఇంక వెళ్తా" అన్న రాధను మరో నాల్రోజులుండమని మీనా, పిల్లలు ఒత్తిడి చేయడంతో సంతోషంగా ఉండిపోయింది రాధ. ఆమెకు మీనా అన్నిరకాల ఫలహారాలు తయారుచేసి ప్యాక్‌చేసి ఇచ్చింది అమెరికా తీసికెళ్ళడానికి. ఇవేగాక, మామిడికాయ, మాగాయ, నీళ్ళావ, చింతకాయ పచ్చడి, నిమ్మకాయ ఊరగాయ, వడియాలు, అప్పడాలు, చల్లమిరపకాయలు కూడా

**అమెరికా అక్క వస్తోందని తెలిసి ఖర్చులభయం పట్టుకుందాతమ్ముడికి. అక్క రానేవచ్చింది. చిరుకానుకలు తప్ప తెచ్చిందేం లేదు. హూ! అంత డబ్బుంది ఎందుకు? దేనికైనా మనసుండొద్దూ అని అసంతృప్తికి గురయ్యాడు తమ్ముడు. తల్లిదండ్రులులేని లోటు తీర్చి వదినగార్ని ఘనంగా సాగనంపిందా ఇల్లాలు. చివరికి ఆ తమ్ముడు అప్పులపాలయ్యాడా? అక్క చేసిందేమిటి?**

ప్యాక్‌చేయించి పెట్టింది రాధ కోసం. తాను ఖాతాలో తెచ్చిన ఖరీదైన ఉప్పాడ పట్టుచీర, ఆమె భర్తకు ప్యాంటు, షర్టుబిట్టు పెట్టి రాధ చేతికిచ్చింది మీనా. మీనా ఆప్యాయతచూసి రాధ కళ్ళు చెమర్చాయి. "మాకు అమ్మానాన్న లేనిలోటు మా తమ్ముళ్ళు, మరదళ్ళు తీరుస్తున్నారు మీనా. ఇలాంటి తోబుట్టువులను, వాళ్ళతో అల్లుకున్న మమతానుబంధాలను కలిగి ఉండడం నిజంగా పూర్వజన్మ సుకృతమే! ఈ బంధం ఇలాగే కాపాడుకుంటూ, కొనసాగిద్దాం మీనా..!" కొంగుతో కళ్ళద్దుకుంటూ ఆర్ద్రంగా అంది రాధ.

ఆర్థిక ఇబ్బందులు, పని ఒత్తిడితో అక్క రాకను మనసారా ఆస్వాదించలేకపోయిన గోపాల్‌కు కూడా అక్క వెళ్తోందంటే దిగులుగానే అన్పించింది. ఆమెతో పూర్తి సమయం గడపలేకపోయిన తన అశక్తతకు బాధపడ్డాడు. తమ్ముణ్ణి దగ్గరకు తీసుకుని కళ్ళనీళ్ళు పెట్టుకుంది రాధ. "పొద్దస్తమానం ఆ ప్రైవేట్ స్కూల్లో గొడ్డుచాకిరీ చేస్తూ ఒళ్ళు హూనం చేసుకోకు. నీ ఆరోగ్యం కూడా చూసుకో. పిల్లల్ని బాగా చదివించు. ఏ అవసరమొచ్చినా రాధక్క ఉందని మాత్రం మరిచిపోకు" అన్నట్టు మీ ఇద్దరికీ కలిపి ఒకటే మొబైల్ ఫోన్ ఉన్నట్టుంది కదా! ఇదిగో ఈ ఫోన్ ఉంచు. ఇదేమో ఐ ప్యాడ్. ఈ పోటీ ప్రపంచంలో కాలంతో పాటు టెక్నాలజీ కూడా పిల్లలకు తెలిసి ఉండాలి. ఇందులో గేమ్స్ ఆప్స్ వేయిస్తే పిల్లలు వాడుకోవచ్చు".

గోపాల్ నిశ్చేష్టుడై చూస్తున్నాడు. అతని హృదయం సిగ్గుతో ముడుచుకుపోయింది. "ఇప్పు...డి...వన్నీ... ఎందుకు రాధక్కయ్యా...." గొంతు పూడుకుపోయి మాట పెగల్లేదతనికి.

"మీ ప్రేమ ఆప్యాయతలముందు నేనిచ్చేదే పాటిది రా.." పిల్లల్ని హత్తుకుని ముద్దు పెట్టుకుంది. ఆమె మాట్లాడుతున్నంతసేపూ ధారగా ప్రవహిస్తున్న కళ్ళు తుడుచుకుంటూనే ఉంది.

"మీనా! తల్లీ! నీ ప్రేమతో మా అమ్మను గుర్తు తెచ్చావు. పుట్టిల్లంటే కేవలం తోబుట్టువులతో బంధం మాత్రమేకాదని వారితో అల్లుకున్న బంధాలన్నీ రాగబంధాలని ఎంత చక్కగా చెప్పావమ్మా.." అంటూ మీనాను ప్రేమగా దగ్గరకు తీసుకుని గుండెలకు హత్తుకుంది. అప్పటిదాకా ఉగ్గబట్టుకున్న మీనా కళ్ళు ఒక్కసారిగా వర్షించి కట్ట తెగిన చెరువే అయింది.

"వదిన గారూ! మీకెప్పుడు రావాలనిపించినా రావొచ్చు. ఇది మీ ఇల్లు. పెళ్ళైపోగానే మీరు పరాయి అయినట్టూ, ఇక్కడ మీకు ఏ హక్కు లేనట్టూ కాదు. ఈ ఇంటి ఆడపడుచుగా మీకెప్పుడూ సర్వస్వతంత్రత, సర్వాధికారాలూ ఉంటాయి. ఈసారి అన్నయ్యను, పిల్లల్ని తీసుకొచ్చి ఓ నెలరోజులు మా ఇంట్లోనే ఉండాలి.... ఆc" కళ్ళు తుడుచుకుంటూ నవ్వుతూ అంది మీనా.

"అలాగే..." అంటూ క్యాబ్ దగ్గరకి వెళ్ళినరాధ ఒక్కక్షణం మెరుపు వేగంతో వెనక్కొచ్చి మీనా చేతిలో ఓ కవరు పెట్టి "ఇదుంచు మీనా" అంటూ బై చెప్పి వెళ్ళిపోయింది రాధ. ఈ హఠాత్పరిణామానికి నివ్వెరపోయింది మీనా. రాధ వెళ్ళాక కాస్సేపటికి తేరుకొని చేతిలో ఉన్న కవరువిప్పి చూసింది. పక్కనే ఉన్న గోపాల్ కూడా కుతూహలంతో ఆత్రంగా చూస్తున్నాడు ఏమై ఉంటుందా అని.. అందులో రెపరెపలాడుతూ వంద డాలర్ల నోట్లు... దాదాపు ముప్పై వరకూ ఉన్నాయి. వాటితోపాటే ఓ చిన్న చీటీ – "ప్రియమైన మీనా, గోపాల్‌లకు ప్రేమతో, ఆప్యాయతతో.." నీళ్ళు నిండిన కళ్ళకు ఆ పై అక్షరాలు కన్పించలేదు మీనాకు. కాస్సేపటివరకూ భార్యాభర్తలిద్దరూ తేరుకోలేకపోయారు. ముందుగా తేరుకున్న మీనా చిరునవ్వుతో ఆ కవరు భర్త చేతిలో పెట్టింది. ఆ నవ్వులో అనేక అర్థాలు ధ్వనించాయి గోపాల్‌కు. పశ్చాత్తాపంతో వాలిపోయిన అతని కళ్ళ నుండి రెండు కన్నీటిబొట్లు రాలడం మీనా దృష్టిని దాటిపోలేదు.

*సెల్: 98669 62414*



వయసు పెరుగుతున్న కొద్దీ చర్మంపై ముడతలు ఎవరికైనా సహజం. ప్రధానంగా ముఖంపై నుదురూ, కళ్ళకిందా, నోటికి ఇరువైపులా సన్నని ముడతలతో మొదలై క్రమేపీ అవి పెరుగుతూ ఉంటాయి. దీనివల్ల కొన్నిసార్లు మన చర్మం రంగును కూడా కోల్పోతుంటాం. దానికి గల కారణాలు, ఎలా వాటిని తగ్గించుకోవచ్చన్నది చూద్దాం!



# చర్మంపై ముడతలా?

### ఒత్తిడి, ఆందోళన

మనకు రోజువారీగా ఎదురయ్యే ఒత్తిడి, టెన్షన్లను ఎప్పటికప్పుడే మరిచిపోవడం మంచిది. ఎందుకంటే తీవ్రమైన ఒత్తిడి, ఆందోళన మన ముఖంమీది చర్మంపై వృద్ధాప్య ఛాయలుగా బహిర్గతం అవుతుంది. దీర్ఘకాలిక ఒత్తిడి, ఆందోళనల వల్ల శరీరంలో కార్టిసాల్, అడ్రినలిన్ వంటి ఒత్తిడి హార్మోన్లు అధికంగా విడుదలవుతాయి. ఇవి మన చర్మ ఆరోగ్యాన్ని ప్రభావితం చేస్తాయి. చర్మం సాగేలా చేసి అకాల వృద్ధాప్యానికి కారణం అవుతాయి.

### సూర్యరశ్మి

ఎండ ప్రభావం కూడా మన చర్మంపై ఉంటుంది. సూర్యరశ్మి వల్ల చర్మం నల్లగా తయారవడం, మొటిమలు రావడం, చర్మం సాగడం, బ్లాక్‌హెడ్స్ వంటి సమస్యలు వస్తాయి. అతినీలలోహిత కిరణాలు చర్మాన్ని పాడుచేస్తాయి. అందుకని బయటకి వెళ్ళేటప్పుడు సన్‌స్క్రీన్ లోషన్ రాసుకోవడం మంచిది.

### నిద్రలేమి

నిరంతరంగా నిద్రలేమి సమస్యలు చర్మంపై ముడతలతో పాటు, చర్మం సాగటానికి దారితీయవచ్చు. రాత్రి సమయంలో గాఢనిద్రవల్ల మెదడు నుంచి పెరుగుదల హార్మోన్ (గ్రోత్ హార్మోన్) అధికంగా విడుదలవుతుంది. ఈ హార్మోన్ చర్మ కణాలతోసహా శరీరంలో అన్ని కణాలను ఆరోగ్యకరంగా ఉంచుతుంది. చర్మంపై ముడతలు వీలైనంత ఆలస్యంగా రావాలంటే కంటినిండా నిద్రపోవడం మంచిది. మంచినిద్ర చర్మంపై ముడతలను ఆలస్య పరుస్తుంది.

### స్మోకింగ్

చర్మంపై ముడతలు రావడానికి స్మోకింగ్ మొదటి కారణం. సిగరెట్‌లో ఉండే నికోటిన్ పదార్థం రక్తనాళాలను సన్నబరుస్తుంది. దీనివలన చర్మం ఉపరితలం పొరకు రక్తం సరఫరా, పోషకాలు, ఆక్సిజన్ అందటం కష్టంగా మారుతుంది. చర్మం ఆరోగ్యంగా ఉండటానికి కొల్లాజన్ అవసరం. కానీ పొగతాగటం వలన కొల్లాజన్ తగ్గిపోతుంది. మితిమీరిన స్థాయిలో ఆల్కహాల్ తాగడం వలన ముఖ చర్మం రంగు మారిపోతుంది. చర్మం కండరాలు బలహీనపడతాయి. రక్తనాళాలు పగలటం లేదా సన్నని రక్తనాళాలు బహిర్గతం కావటం వంటి సమస్యలు వస్తాయి. దాంతో చర్మం ముడతలు పడుతుంది.

### డైట్

మనం తీసుకునే ఆహారం చర్మంపై ఏర్పడే ముడతల్ని, వృద్ధాప్య లక్షణాల్ని ప్రభావితం చేస్తుంది. ఆహార పదార్థాలు చర్మంలో ఉండే యవ్వన కణాలను గాయపరిచి, ఎక్కువ వయసు గలవారిలా కనపడేలా చేస్తుంది. అధిక కొవ్వు, చక్కెరలున్న ఆహారాలు, తాజాపండ్లు, కూరగాయలు తక్కువ తీసుకోవడం వంటివి అంతర్గతంగా అవయవాల పనితీరును ప్రభావితం చేస్తాయి.

### వాతావరణం

మారుతున్న వాతావరణం కూడా చర్మంపై ముడతలకు కారణం. గాలికాలుష్యం చర్మ సున్నితత్వాన్ని తగ్గిస్తుంది. చర్మాన్ని పొడిబారుస్తుంది. దుమ్ము, ధూళి చర్మంపై పేరుకుపోయి మొటిమలు రావడానికి కారణంఅవుతుంది. అంతేకాదు, చర్మం రెగ్యులర్ కలర్ పోవడానికి కాలుష్యం కారణం అవుతుంది. కేవలం వేడి వాతావరణంలోనే కాదు చల్లని వాతావరణంలో కూడా ఇలాంటి సమస్యలు వస్తాయి.

### విటమిన్స్

విటమిన్ కొరత ఉన్నవారిలో కూడా చర్మం ముడతలు వస్తాయి. కాబట్టి మంచి పోషకాహార పదార్థాలు తినటంవల్ల వృద్ధాప్య ఛాయల్ని వీలైనంత వరకు జాప్యం చేయవచ్చు. అంతేకాకుండా, యాంటీ ఆక్సిడెంట్లు అధికంగా ఉండే ఆహారాలు వృద్ధాప్యాన్ని ప్రేరేపించే కారకాలకు వ్యతిరేకంగా పోరాడతాయి. సి- విటమిన్ ఎక్కువగా ఉండే ఆహారం తీసుకుంటే చర్మంపై ముడతలను తగ్గించవచ్చు. అలాగే ఎక్కువ నీరు తాగాలి.

–విజేత

## ముడతలు తగ్గాలంటే...

- గుడ్డులోని తెల్లసొన తీసుకుని కళ్ళ అడుగున, నుదురుకు పూతలా వేయాలి. తెల్లసొనలోని పోషకాలు చర్మాన్ని బిగుతుగా మారుస్తాయి.
- రాత్రిపూట పావుకప్పు కొబ్బరినూనె తీసుకుని నాలుగైదు చుక్కల విటమిన్-ఇ నూనె కలిపి చర్మానికి రాసుకోవాలి. మునివేళ్ళతో బాగా మర్దన చేసి మర్నాడు కడిగేసుకోవాలి. ఇలా తరచూ చేస్తుంటే చర్మం కాంతిమంతంగా మారుతుంది.
- అరకప్పు చెరకురసంలో సరిపడా పసుపు కలిపి చర్మానికి పూతలా వేయాలి. కాసేపయ్యాక కడిగేస్తే మార్పు కనిపిస్తుంది.
- ఆముదంలో కొద్దిగా నిమ్మరసం కలిపి ముఖానికి రాసుకోవాలి. నిమ్మలోని సి-విటమిన్ ముడతలను నివారించడంలో చక్కగా పనిచేస్తుంది.



- బొప్పాయిగుజ్జు, అరటిపండు గుజ్జు పావుకప్పు చొప్పున తీసుకుని ముఖానికి పూతలా పూయాలి. బొప్పాయిలోని పపైన్ అనే ఎంజైమ్ మృతచర్మాన్ని తొలగిస్తుంది. దాంతో చర్మం తేటగా కనిపిస్తుంది.

# సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు 25

- కంఠంనేని స్వప్న



**కావ్య పంపిన డీటెయిల్స్ ఆధారంగా శ్రీకాంత్ పరిశోధన మొదలెట్టాడు. పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో ఎన్నో ఏళ్ళు పనిచేసిన అనుభవంతో అతనికి ఈసారి నైరా విషయంలో ఏదయినా క్లూ దొరకవచ్చనిపిస్తోంది.**

**ప్రస్తుతం అతని దగ్గర ఉన్నవి కావ్య పంపిన స్క్రీన్‌షాట్స్, నామినీగా ఉన్నతని పేరుని బట్టి వెతకగా దొరికిన ఫేస్‌బుక్, లింక్‌డ్ ఇన్ ప్రొఫైల్స్ మాత్రమే. యు.ఎస్‌లో ఉన్నప్పటి నంబర్ మాత్రమే డేటాబేస్‌లో దొరికింది. ఆ నంబర్‌కి ఫోన్ చేసి చూస్తే అది సర్వీస్‌లో లేదు.**



ఫేస్‌బుక్ అకౌంట్ అతనిదో కాదో అర్థం కావటం లేదు. ఒకే పేరుతో ఎంతోమంది ఉండి ఉండవచ్చు. ఆ అకౌంట్, అతని పేరే ఉన్న మరొక వ్యక్తిది అయి ఉండవచ్చు. లేదా ఫేక్ అకౌంట్ కావచ్చు. ఫేస్‌బుక్ అకౌంట్స్‌లో దాదాపు ఒక శాతం ఫేక్ అకౌంట్సేనట.

లింక్‌డ్ ఇన్ వివరాలను బట్టి చూస్తే డేటాబేస్‌లో కావ్య సేకరించిన వివరాలకీ, అ అకౌంట్‌కీ మాచ్ అవుతున్నప్పటికీ, యూఎస్‌లో ఉద్యోగం మానేసిన తర్వాత అతని అకౌంట్‌లో ఎటువంటి ఆక్టివిటీ కనబడటం లేదు. పైగా లింక్‌డ్ ఇన్‌ని ఉద్యోగరీత్యా అవసరమయ్యే నెట్ వర్కింగ్‌కి మాత్రమే వాడుతుంటారు. నెలకొకసారో, సంవత్సరానికొకసారో మాత్రమే అకౌంట్ ఓపెన్ చేసేవాళ్ళే ఎక్కువమంది.

ప్రస్తుతానికి ఫేస్‌బుక్ అకౌంట్ అనుమానితుడిదిగానే భావించి ముందుకు కొనసాగదల్చుకున్నాడు.

అతని పర్సనల్ డీటెయిల్స్ ఏవీ ఫేస్‌బుక్‌లో కనబడకుండా హైడ్ చేసినట్లున్నాడు. అతని ఫ్రెండ్స్ లిస్ట్ కూడా హైడ్ చేసి ఉంది. ఎటువంటి ఆధారమూ దొరకటం లేదు. ఎటువంటి వాడికైనా, ముఖ్యంగా నేరస్థులకి ఆడవాళ్ళతో స్నేహం చేయటమనే బలహీనత ఉండే అవకాశం ఉంది.

ఒక ఫేక్ అకౌంట్ క్రియేట్ చేశాడు శ్రీకాంత్. అందమైన అమ్మాయి ఫొటో ప్రొఫైల్‌కి పెట్టాడు. ఫ్రెండ్ రిక్వెస్ట్ పంపాడు.

ప్రస్తుతానికి అంతకంటే చేయగలిగిందేమీ లేదు.

## జరిగిన కథ

అక్షయ్, కావ్య, సీమ, హర్ష ఓ మల్టీ నేషనల్ కంపెనీలో పనిచేస్తుంటారు. అక్షయ్ వాళ్ళ అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోవడంతో, వారి కూతురు నైరాని తన సంరక్షణలోకి తీసుకుంటాడు అక్షయ్. ఒకరోజు నైరా కనిపించకుండా పోతుంది. పోలీస్ ఇన్వెస్టిగేషన్ మొదలవుతుంది. నైరా ఆచూకీ కోసం రకరకాలుగా ప్రయత్నిస్తుంటాడు అక్షయ్. ఆ ప్రయత్నాల్లో భాగంగా ఎంతోమంది చిన్నపిల్లలను కాపాడతాడు. ఆఫీసులో వాళ్ళందరూ లియోనియా రిసార్ట్స్‌కి వీకెండ్ టూర్‌కి వెళతారు. అక్కడ సీమ రాజేష్‌ని ముప్పతిప్పలు పెడుతుంది. ఇంతలో అక్షయ్‌ని పోలీసులు అరెస్టు చేస్తారు. అయితే అక్షయ్ చాకచక్యంగా వ్యవహరించి అక్కడి నుంచి బయటపడతాడు. కావ్యని యూఎస్ పంపిస్తున్నట్లు చెబుతాడు రాజేష్. ఎయిర్‌పోర్టులో రాజేష్‌ని చూసి ఖంగుతింటుంది కావ్య. యూఎస్ వెళ్ళాక అక్కడి టీమ్‌కి అవసరమైన సలహాలిస్తుండగా, ప్రొడక్షన్ డేటాబేస్‌లో నైరా వివరాలు కనబడతాయామెకి. వాటిని శ్రీకాంత్‌కి పంపుతుంది.

**ఆ తర్వాత...**

రిక్వెస్ట్‌ని అంగీకరిస్తే మరికొన్ని వివరాలు దొరికే అవకాశం ఉంది.

***

గంట తర్వాత అతను ఎదురు చూస్తున్న రెస్పాన్స్ వచ్చింది.

"సారీ, నా ఫియాన్సీకి నేను కమిటై ఉన్నాను. నీ రిక్వెస్ట్ ఆక్సెప్ట్ చేయలేను."

ముచ్చటేసింది శ్రీకాంత్‌కి.

ఇంత మంచివాళ్ళు కూడా ఉంటారా?

తామనుకుంటున్న వ్యక్తి ఇతను కాకపోవచ్చేమో!

మళ్ళీ తట్టిందతని పోలీస్ బుర్రకు.

కొన్ని విషయాల్లో ఎంతో నియమ నిబద్ధతలతో ఉండే నేరస్థులుంటారనీ, అంత మాత్రాన వాళ్ళు నేరం చేసుండక పోవచ్చనుకోవటం పొరబాటనీ తాను పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో శిక్షణ తీసుకుంటున్న రోజుల్లో ఇన్‌స్ట్రక్టర్ చెప్పిన విషయం.

అతని వివరాలన్నీ ప్రైవేట్‌గా పెట్టుకున్నాడు ఫేస్‌బుక్‌లో.

ఎలా? ఫేస్‌బుక్ యాజమాన్యానికి రాసి అతని డీటెయిల్స్ రాబట్టాలంటే ఎఫ్.ఐ.ఆర్. ఉండాలి. ఏ కారణంతో అతని మీద కేస్ బుక్ చేయగలడు తను? ఒకవేళ అలా చేసినా ఇదంతా చాలా టైమ్ పట్టే వ్యవహారం.

సైబర్‌క్రైమ్ డిపార్ట్‌మెంట్‌లోని జిమ్మీ అనే వ్యక్తికి అనధికారికంగా అనుమానితుడికి సంబంధించిన వివరాలు కనుక్కునే పని అప్ప చెప్పాడు శ్రీకాంత్.

***

శ్రీనివాస్ ఉప్పు!

శ్రీకాంత్‌తో మాట్లాడాక ఫోన్ పెట్టేసిన జిమ్మీ తను స్టిక్కీ నోట్ మీద రాసుకున్న పేరుకేసి చూస్తున్నాడు.

ఎక్కడ నుంచీ, ఎలా మొదలెట్టాలో ఆలోచిస్తున్నాడు.

కొత్తగా ఎం.సి.ఏ ముగించి గవర్నమెంట్ ఉద్యోగంలో చేరాడతను. చురుకైన వ్యక్తిగా పేరు సంపాదించుకున్నాడు. తోటివాళ్ళలోనూ, పై వాళ్ళలోనూ మంచి పేరుందతనికి.

'శ్రీనివాస్....' పేరు చూస్తే ఏడుపొచ్చిందతనికి.

తెలుగు మగవాళ్ళలో యాభైశాతం మంది పేరు ఇదే ఉంటుంది. పేరులో ఏముంది అనుకునే వాళ్ళు, పిల్లలకి ఏం పేరు పెట్టాలో తెలీక ఏదో ఒకటి పెట్టేసే వాళ్ళు, వెంకటేశ్వరుడి భక్తులు, పిల్లలు ఎక్కువయినప్పుడు పేర్లు చాలక ఈ పేరు పెట్టేసే వాళ్ళు... కారణం ఏదైనా తెలుగు మగవాళ్ళలో సగం మంది పేరు ఇదే. అసలు ఏదైనా నేరం చేసినప్పుడు తప్పించుకు పోవటం తెలికని పిల్లలకి ఈ పేరు పెడతారేమో తల్లిదండ్రులు.

ఫిల్టర్ చేయడం కాస్త కష్టమైన పనే!



ఫేస్‌బుక్ ప్రొఫైల్‌ని అన్నివైపుల నుండి వెతకటం మొదలెట్టాడు.

ఫ్రెండ్ రిక్వెస్ట్ ఒకటి పంపాడు.

మెసేజ్ పంపటానికి కుదరలేదు. అదికూడా ప్రైవేట్ ఆక్సెస్ పెట్టుకున్నట్లున్నాడు. ఫ్రెండ్స్ ద్వారా ప్రయత్నించటానికీ కుదరదు.

వేరే మార్గంలో వెతకదల్చుకున్నాడతను.

అతని పాత కంపెనీలో, అతను వర్క్‌చేసిన ప్రదేశంలో పనిచేసినవాళ్ళకోసం ఫేస్‌బుక్‌లో వెతకసాగాడు.

కుప్పలు తెప్పలుగా ప్రొఫైల్స్ కనబడుతున్నాయి.

వాళ్ళవి ఒకొక్కరి ఫ్రెండ్స్ లిస్ట్ వెతకసాగాడు.

వాళ్ళలో కొంతమంది ఫ్రెండ్స్ లిస్ట్‌లో శ్రీనివాస్ కనబడుతున్నాడు.

అయితే వాళ్ళని అప్రోచ్ అవటం ఎలా?

అతనికీ, వాళ్ళకీ ఉన్న రిలేషన్ ఎటువంటిది అయ్యుండవచ్చు?

తను అడిగినంత మాత్రాన తమవైపు ఉండి సహాయం చేస్తారా?

అతన్ని కాదని తమని నమ్ముతారా?

తనేదైనా అడగగానే అతనికి ఉప్పు అందించారంటే ఫేస్‌బుక్ అకౌంట్ కూడా మూసేస్తే తమకు అన్నిదారులు మూసుకుపోతాయి.

అనుకోకుండా అతనికి తమ డిపార్ట్‌మెంట్‌లో తన సీనియర్స్‌లో ఒకతను ఇది వరకు శ్రీనివాస్ చేసిన కంపెనీలో పని చేసుండటం, శ్రీనివాస్ అతనికి ఫ్రెండ్‌గా లిస్ట్ అయి ఉండటం కనబడింది.

చకచకా పావులు కదిపాడు జిమ్మీ.

శ్రీనివాస్ ఉప్పుకి అతని సీనియర్ ద్వారా ఒక లింక్ పంపాడు.

మరుసటి రోజుకి శ్రీనివాస్ దాని మీద క్లిక్ చేశాడు. మరుక్షణం అతని ఐపీ అడ్రస్ జిమ్మీ చేతికి వచ్చింది.

క్లిక్ చేశాక శ్రీనివాస్ నుంచి అతడి ఫ్రెండ్‌కి వచ్చింది మెసేజ్.

"ఏం పంపావు? ఇంటరెస్టింగ్ లింక్ అన్నావు. ఓపెన్ చేస్తే ఏమీ రావట్లేదు."

రిప్లయ్ ఇచ్చాడతని ఫ్రెండ్.

"వైరస్ అనుకుంటా! అందరికీ వెళ్ళిందా మెసేజ్. ఓపెన్ చేయకు".

ఐపీ అడ్రస్ ద్వారా అతనెక్కడున్నాడో ట్రేస్ చేశాడు జిమ్మీ.

ఆ వివరాలను శ్రీకాంత్‌కి అందచేశాడు.

"థాంక్యూ! ఇతనసలు నేరం చేశాడో లేదో తెలీదు కాబట్టే ఈ దొంగచాటు పరిశోధన. నీ సహా

## రుణాలు తీర్చేస్తోంది...

ఈ పని చేస్తోంది టాలీవుడ్ చంద మామ కాజల్ అగర్వాల్. ఇప్పుడంటే కాజల్ మంచి ఫామ్‌లో ఉంది కానీ, ఆమె మొదటి సినిమా 'లక్ష్మీకల్యాణం' అట్టర్ ఫ్లాప్. ఆ తరువాత చేసిన 'చందమామ' సినిమా కాజల్‌ని ఎక్కడికో తీసుకెళ్ళింది. ఆ సినిమా తరువాత కాజల్ వెనక్కి తిరిగి చూసుకోనక్కర్లేకుండా పోయింది. తాను ఎంత ఎత్తుకి ఎదిగినా, తనను ఈ రంగానికి పరిచయం చేసిన వారిని మాత్రం కాజల్ మరిచిపోలేదు. తనతో తొలి సినిమా చేసిన డైరెక్టర్ తేజనీ, హీరో కల్యాణ్‌రామ్‌నీ గుర్తుంచుకుంది. ఎంతోమందికి డేట్లు అడ్జస్ట్ చేయలేక 'నో' చెప్పిన కాజల్ వీరిద్దరికీ మాత్రం ఎస్ చెప్పడమే కాకుండా తేజతో సినిమా దాదాపు పూర్తి చేసేసింది. ఈ రంగానికి పరిచయం చేసిన వారి రుణాన్ని కాజల్ ఈ విధంగా తీర్చుకుంటోంది అంటున్నారు సినీ జనాలు.

యానికి చాలా థాంక్స్" చెప్పాడు శ్రీకాంత్.

"మై ప్లెజర్! మళ్ళీ ఎప్పుడు అవసరం వచ్చినా ఫోన్ చేయండి. మా సాఫ్ట్‌వేర్ వాళ్ళకి దొంగ చాటుగా హాకింగ్ చేస్తే వచ్చే కిక్కేవేరు" కుడి కన్ను వింక్ చేస్తూ అన్నాడు జిమ్మీ.

***

అప్పనపల్లి...

తూర్పుగోదావరి జిల్లాలోని ఒక చిన్న గ్రామం. రాజమండ్రికి ఎనభై అయిదు కిలోమీటర్ల దూరంలో, వైనతేయ నది ఒడ్డున ఉందా గ్రామం.

పచ్చటి పొలాలు, కొబ్బరి చెట్లు, పనసచెట్లతో స్వర్గాన్ని భూమి మీదకు తీసుకొచ్చి పెట్టినట్లుగా కళకళలాడుతోంది. ఊరికి మూడువైపులా గోదావరి నది, మరోవైపు బే ఆఫ్ బెంగాల్ ఉండటం వల్లనేమో, బహుశా రాకపోకలు కష్టమై ఇంకా నాగరికత సోకినట్లు లేదు.

పోలీస్‌జీప్‌తో సివిల్‌డ్రెస్ కోడ్‌లో ఊళ్ళోకి ప్రవేశించిన శ్రీకాంత్‌ని వింతగా చూస్తున్నారు అక్కడి జనం.

'ఊళ్ళోని వెంకటేశ్వరుడి ఆలయాన్ని సందర్శించటానికి వచ్చే పర్యాటకుడనుకునే వారేమో, పోలీస్ జీప్ తేకుండా ఉండాల్సింది' తనని తనే తిట్టుకున్నాడు శ్రీకాంత్.

ఊరంతా కలిపినా అయిదారు వేలకు మించి ఉండదు జనాభా.

తనసలు సరైన దారిలోనే వెళ్తున్నాడా!

ఇటువంటి ఊళ్ళో ఉండేవాడికి అంత పెద్ద క్రైమ్ చేయటం చేతనవుతుందా?

అంత కుగ్రామానికి కూడా 'గూగుల్ మాప్స్' డైరెక్షన్స్ కరెక్ట్‌గా చూపిస్తోంది. తను వెతుకుతున్న ప్రదేశానికి వచ్చేశాడని చూపిస్తోంది.

జీప్ ఆపి దిగాడు శ్రీకాంత్.

వెదురుతో చేసిన చిన్న గేట్, రెండడుగుల ఎత్తున వెదురుతో చేసిన ప్రహరీ ఉంది. ప్రహరీ పొడుగునా పాకించిన ఆకుపచ్చని తీగలు... వాటికున్న ఆకులు నిగనిగ మెరుస్తున్నాయి.

గేట్ తీసి లోపలికి నడిచాడు.

విశాలమైన ఆవరణ...

చామంతులు, కనకాంబరాలు, గులాబీ చెట్లతో చూడముచ్చటగా ఉంది.

కూర్చునేందుకు చెట్ల మధ్యలో ఒక చిన్న ఇనుప టేబుల్, అటూ ఇటూ రెండు కుర్చీలు వేసున్నాయి.

అదొక పెంకుటిల్లు.

విశాలంగా కనబడుతోంది.

పాతకాలపు కట్టడం అని దాని ముందున్న వరండా, పెద్దపెద్ద స్తంభాలు, నీలిరంగు కిటికీలు చూస్తే అర్థమైపోయింది.

ఈ మధ్యే సున్నం వేయించినట్లుగా ఉంది.

తలుపు తట్టాడు శ్రీకాంత్.

ఎక్కడా బెల్ సౌకర్యం కూడా ఉన్నట్లు లేదు.

రెండు నిమిషాలకి తలుపు తెరుచుకుంది.

అయిదడుగుల మీద నాలుగంగుళాలున్నాడు. మంచి రంగు. ఆరోగ్యకరమైన వాతావరణంలో ఉండటం వల్లనేమో అతని చర్మం ప్రకాశిస్తున్నట్లుగా ఉంది. నుదుటి మీద గుండ్రంగా దిద్దిన కుంకుమ. చక్కటి ప్రశాంతమైన మొహం.

నారింజ రంగు పంచెని లుంగీలా కట్టుకుని, భుజాలపైన టవల్ కప్పుకుని ఉన్నాడు.

మెడలో కొట్టవచ్చినట్లుగా కనపడుతున్న రెండు వరసల రుద్రాక్షమాల. చిరునవ్వు నవ్వాడతను శ్రీకాంత్‌ని చూసి.

"ఎవరు కావాలమ్మా?" అడిగాడు.

వెనక్కి తిరిగి చూశాడు శ్రీకాంత్ ఎవరైనా తన వెనకున్నారేమోనని.

"నిన్నేనమ్మా!" ప్లెజెంట్‌గా ఉందతని మొహం.

పుట్టగానే పెరగటం మానేసినట్లున్నాడు హైట్ చూస్తే. వయసులో కూడా తనకంటే కనీసం పది, పదిహేనేళ్ళు చిన్నవాడై ఉంటాడు. తనని పట్టుకుని 'అమ్మా' అని సంబోధిస్తాడేమిటి?

శ్రీకాంత్‌కి ఒళ్ళంతా తేళ్ళు, జెర్రులు పాకుతున్నట్లుంది.

అతని మీద వ్యతిరేకత మొదలయింది.

ఒకోసారి చిన్న సంఘటనతో ఒక మనిషి మీద అమితమైన ఇష్టం కానీ, విపరీతమైన ద్వేషం కానీ కలగవచ్చు. అప్పటివరకూ జీవితంలో ఎదురైన సంఘటనల వల్ల, మనుషుల వల్ల ఇటువంటి అభిప్రాయాలు ఏర్పడిపోతుంటాయి. కొన్నిసార్లు చివరి వరకూ ఆ వ్యక్తి మీద అటువంటి అభిప్రాయమే కొనసాగవచ్చు. లేదా మరేదైనా సంఘటన జరిగి పూర్తిగా అభిప్రాయం మారిపోనూవచ్చు.

వయసుకీ, సైజ్‌కీ మించిన మెచ్యూరిటీ ప్రదర్శిస్తూ, తనను ఆకట్టుకోవాలనీ, బుట్టలో వేయాలనీ చూస్తున్నట్లున్నాడు.

"శ్రీనివాస్ ఉప్పు అంటే..." అడిగాడు శ్రీకాంత్.

"నేనేనమ్మా!"

"చిన్న ఎంక్వయిరీ పనిమీద వచ్చాను" చెప్పాడు శ్రీకాంత్.

పైనుంచీ కిందివరకూ చూశాడు అనుమానంగా అతను.

"పోలీస్ డిపార్ట్‌మెంటా.." అడిగాడు.

"అవును" తన ఐడీకార్డ్ చూపించాడు శ్రీకాంత్.

"రామ్మా! లోపల కూర్చుని మాట్లాడుకుందాం" పిలిచాడు.

**శ్రీనివాస్... తెలుగువారిలో సగానికి సగం మంది మగవారి పేరు ఇదే. కేవలం ఫేస్‌బుక్ అకౌంట్ ఒక్కటే ఆధారం. అది నకిలీదో, అదేపేరున్న వేరొక వ్యక్తిదో తెలియదు. అతన్ని ఎలా కనిపెట్టాలి? ఆలోచిస్తున్నాడు శ్రీకాంత్. లాభం లేదనుకుని ఆ పని జిమ్మీకి అప్పచెప్పాడు. మరి జిమ్మీ ఆ శ్రీనివాస్‌ని కనిపెట్టగలిగాడా? లేదా? అసలింతకీ ఈ శ్రీనివాస్ ఎవరు?**

తనను తనే పొడిచేసుకుని చచ్చిపోవాలనిపించింది శ్రీకాంత్‌కి. ఇంకో రెండు, మూడు గంటలు ఇక్కడుంటే మర్చిపోయి చీర కట్టేసుకుంటాడేమో తను.

ఆ ఊరికీ, ఇంటి బయట వాతావరణానికీ పూర్తి వ్యతిరేకంగా ఉంది ఇల్లు. అత్యంత అధునాతనంగా అలంకరించి ఉంది.

లెదర్ సోఫాలు, కాఫీ టేబుల్, దాని మీద ఇకెబనా స్టయిల్‌లో తయారైన ఆర్టిఫీషియల్ ఫ్లవర్ అరేంజ్‌మెంట్, కింద గోధుమరంగు కార్పెట్, మోడరన్ ఆర్ట్‌లో తెలుపు, నలుపు, ఎరుపు రంగులు చిమ్మి

నట్లున్న పెయింటింగు కనబడుతోంది గోడ మీద.

కూర్చోగానే అడిగాడు అతను.

"నా అడ్రస్ మీకెలా దొరికింది?"

నవ్వాడు శ్రీకాంత్.

"మా పనే అది కదా! ప్రపంచంలో ఏ మూల నున్నా వెతికి పట్టుకోవటం"

నైరా కేస్ గురించి చెప్పటం మొదలెట్టాడు శ్రీకాంత్. చెప్తున్నంత సేపు అతని ముఖకవళికలనే గమనిస్తున్నాడు.

అతి తెలివైన వాడైనా అయ్యుండాలి లేదా అస లేమీ తెలియని వాడైనా అయి ఉండాలి. అతని మొహంలో ఎటువంటి మార్పూ లేదు. మధ్యమధ్యలో సానుభూతిగా "చ్చొచ్చొ" అంటూ విన్నాడు.

"అయ్యో పాపం.. చిన్నపిల్ల" అన్నాడు చివరగా.

"మీరు అమెరికాలో ఉద్యోగం చేశారా?" అడిగాడు శ్రీకాంత్.

"ఏడెనిమిది నెలలు చేశాను. నాకా ప్రదేశం, సాఫ్ట్‌వేర్ ఉద్యోగం నచ్చలేదు. వెనక్కి వచ్చేసి ప్రశాంతంగా ఈ ఇంట్లో ఉంటున్నాను" చెప్పాడు శ్రీనివాస్.

"నైరా తండ్రి తెలుసా?" అడిగాడు శ్రీకాంత్.

"లేదమ్మా!" ఆలోచిస్తున్నట్లుగా అన్నాడు.

"పేరడగకుండానే తెలీదనేస్తున్నారే?" అనుమానంగా చూసి అన్నాడు శ్రీకాంత్.

"అంటే నాకు తెలిసిన ఫ్రెండ్స్ ఎవరికీ నైరా అనే పేరున్న పిల్లలు లేరు" కొద్దిగా కంగారు పడ్డాడు శ్రీనివాస్.

"ఇన్స్యూరెన్స్ రికార్డ్సులో మీ పేరు బెనిఫీషియరీగా ఉంది మరి?"

"నా ఫ్రెండ్ ఒకతను ఎవరూ బంధువులు లేని వాడు, అతని ప్రాపర్టీస్‌కీ, ఇన్స్యూరెన్స్ అమౌంట్‌కీ నన్ను బెనిఫీషియరీగా పెట్టాడు. కానీ అతని కూతురు పేరు నైరా అని తెలీదమ్మా!"

"మీ ఇల్లు ఒకసారి సెర్చ్ చేయాలి" చెప్పాడు శ్రీకాంత్.

"తప్పకుండా! సెర్చ్ వారెంట్ ఉందా అమ్మా?" అడిగాడు.

చేతిలో సెర్చ్ వారెంట్ పెట్టాడు శ్రీకాంత్.

శ్రీనివాస్ అది మొత్తం చదివేలోపు ఇల్లంతా వెతికేయాలి. అదొట్టి టెంప్లేట్ మాత్రమే. ఎందుకైనా మంచిదని వెంట తెచ్చుకున్నాడు. అది తనకోసం జారీ చేసింది కాదని అతను తెలుసుకుంటే అడ్డుపడతాడు. మళ్ళీ తను వెళ్ళి వారెంట్ తెచ్చుకునేసరికి సాక్ష్యాలు తారుమారయ్యే ఛాన్స్ ఉంది.

ఎక్కడా అనుమానించదగ్గదేమీ కనబడలేదు శ్రీకాంత్‌కి.

మళ్ళీ హాల్లోకి వచ్చేసరికి కనబడిందా దృశ్యం.

రిక్లయినర్ సోఫాని వెనక్కి వాల్చుకుని, తల వెనక చేతులు పెట్టుకుని హాయిగా పడుకుని కూనిరాగం తీస్తున్నాడు శ్రీనివాస్.

శ్రీకాంత్‌ని చూసి అన్నాడు.

"సెర్చ్ వారెంట్ నాకు సంబంధించినది కాదనీ, ఏ ఫేజ్‌లో అనుమానితుడి వివరాలు ఉంటాయో నాకు తెలుసమ్మా! మీరు ముచ్చట పడుతున్నారనీ, వెతకక పోతే మీ అనుమానం పోదనీ కూర్చుండిపోయాను."

గతుక్కుమన్నాడు శ్రీకాంత్.

శ్రీనివాస్ ప్రవర్తన చాలా అసహనంగా అనిపిస్తోందతనికి. నేరం చేయకపోతే భయపడక్కర్లేదు కానీ మరీ అంత రిలాక్స్‌డ్‌గా ఉన్నట్లు ఓవరాక్షన్ చేయక్కర్లేదు.

చిన్న వాకిన్ క్లాసెట్ కనబడుతోంది ఎదురుగా.

తలుపు తెరిచే ఉంది.

వాషర్, డ్రయర్ పక్కపక్కనే పెట్టి ఉన్నాయి.

నవ్వుతూ అన్నాడు శ్రీనివాస్.

"అది కూడా వెతకాలంటే వెతకొచ్చమ్మా!"

ఒక్కక్షణం వెళ్ళిపోదామా అనిపించింది శ్రీకాంత్‌కి. మళ్ళీ ఆగి లోనికి వెళ్ళాడు.

బయటనుంచి అతను చెప్పటం వినబడుతోంది.

"ఈ ఊళ్ళో దానిని వాడే అవసరమే పడలేదింత వరకూ. పనివాళ్ళొచ్చి చక్కగా ఉతికిపెడతారు. నా ఫియాన్సీ అంటే నా మరదలు వచ్చినప్పుడు మాత్రమే వాడుతుంది వాటిని.

గుట్టలుగా బట్టలు డ్రయర్‌లో వేసి ఉన్నాయి.

డోర్ తెరిచి వేసేయబోతుండగా గులాబీరంగు స్లీప్‌వేర్ చిన్న పైజమా లాంటిది కనబడుతోంది.

దాన్ని బయటకు లాగాడు.

## మనమీదేనర్రోయ్!

సరసి





తప్పిపోయిన రాత్రి నైరా ఇటువంటిదే వేసు కుందని అక్షయ్ చెప్పిన గుర్తు.

అది తీసుకుని శ్రీనివాస్ దగ్గరకి నడిచాడు.

కళ్లు పెద్దవి చేసి చూస్తున్నాడతను.

శ్రీకాంత్ దగ్గరగా రావటం చూసి లేచి నిలబ డబోయాడు.

లాగిపెట్టి చెంప మీద గట్టిగా కొట్టాడు శ్రీకాంత్.

ఎగిరి కిందపడ్డాడు.

"పోలీస్‌వి. మా మీద నీ జులుం ఏంటి?" నోటి పక్కగా కారుతున్న రక్తం తుడుచుకుంటూ ఉక్రో షంగా అన్నాడు శ్రీనివాస్.

"అవసరానికి ప్రాంతీయవాదం, కులాలు, మతాల్ని చక్కగా వాడుకోవచ్చని నీలాంటి వాళ్ళకి కూడా అర్థమవబట్టే మన దేశం ఇలా తగలడిందిరా!" చేతులు రెండూ వెనక్కి మడిచి బేడీలు వేశాడు.

స్లీవ్‌వేర్ ఫోటో తీసి వాట్సాప్ ద్వారా అక్షయ్‌కి పంపాడు ఐడెంటిఫికేషన్ కోసం. వెంటనే ఫోన్ చేశాడు అక్షయ్.

"అది నైరాదే! దొరికిందా?" ఆత్రంగా అడుగు తున్నాడు.




"ఈజ్ షీ సేఫ్!" ఆందోళన ధ్వనిస్తోందతని గొంతులో.

"ఇంకా దొరకలేదు. లీడ్ దొరికింది. మళ్ళీ ఫోన్ చేస్తాను ఏదైనా ఇన్‌ఫర్మేషన్ దొరకగానే" చెప్పి పెట్టేశాడు శ్రీకాంత్.

కొన్ని ఫోన్‌లు చేసుకున్నాడతను అక్కడే కూర్చుని.

కాసేపటికి ఆ ఏరియా పోలీసులు చేరుకున్నారు అక్కడికి.

***

పోలీస్ మర్యాదలు జరిగేసరికి మొత్తం జరి గింది చెప్పటం మొదలెట్టాడు శ్రీనివాస్.

యు.ఎస్‌కి కొత్తగా వెళ్ళిన రోజులవి.

ఆఫీస్‌లో బ్రేక్ ఏరియాలో ఉన్న వెండింగ్ మెషీన్ ముందు నిలబడి చప్పట్లు కొడుతున్నాడు శ్రీనివాస్.

మధ్యమధ్యలో కోక్ అని అరుస్తున్నాడు.

మెషీన్ నుంచి కోక్ టిన్ పడట్లేదు.

ఆలోచించి ఈసారి చప్పట్లు కొడుతూ 'పెప్సీ' అని అరుస్తుండగా చూశాడు నైరా తండ్రి శ్రీనివాస్‌ని.

"ఏం చేస్తున్నావు?" అడిగాడు ఆశ్చర్యంగా.

"అలాచేస్తే టిన్ కింద పడుతుందటకదండీ... తాగుదామని" అమాయకంగా అన్నాడు శ్రీనివాస్.

అతని వంక జాలిగా చూసి వెండింగ్ మెషీన్‌ని ఎలా వాడాలో చూపించాడు నైరా తండ్రి. ఒక డాలర్ బిల్, క్వార్టర్ వేసి బటన్ ప్రెస్ చేయగా వచ్చిన కోక్ బాటిల్‌ని శ్రీనివాస్‌కి ఇచ్చి చెప్పాడు.

"ఇట్స్ ఆన్ మీ!"

తర్వాత హుందాగా నడుచుకుంటూ వెళ్ళిపోయా డక్కడ నుంచి.

మరోసారి ఆఫీస్ పార్టీ జరుగుతోంది.

తిన్నాక ప్లేట్, గ్లాస్ తీసుకెళ్ళి ట్రాష్‌లో వేసొ చ్చాడు శ్రీనివాస్.

ఆశ్చర్యంగా చూస్తున్నారు అందరూ.

"ఎందుకవి పడేశావు?" అడిగాడు అతని పక్కకి జరిగి నైరా తండ్రి.

"అలా వేయాలట కదండీ అమెరికాలో?" అడి గాడు తను.

ఆఫీస్‌వాళ్ళలోనే ఒక అల్లరి గాంగ్ అతన్ని ఆట పట్టించటానికి అంతా తప్పుగా గైడ్ చేస్తున్నారని అర్థమైందతనికి.

"మరీ ఇంత అమాయకంగా ఉంటే ఎలా?" తల పట్టుకున్నాడు.

అతని అమాయకత్వం చూసి జాలిపడో, తన వైపు బంధువులంటూ ఎవరూ లేకో, అమెరికాలో ఉండడంతో ఇండియాకి దూరమవుతున్నామనే భావనతోనో శ్రీనివాస్‌ని చేరదీశాడు నైరా తండ్రి.

వీకెండ్ పార్టీలనో, కొత్త తెలుగుమూవీ సీడీ దొరికిందనో, ఇండియన్ స్టోర్స్‌లో గ్రాసరీస్ మంచివి దొరికాయనో ఏదో ఒక వంకన వాళ్ళింటికి వెళ్తుండే వాడు శ్రీనివాస్. ఇవి కాక బర్త్‌డేలు, యానివర్స రీలు, పండగలు, పబ్బాలు అమెరికాలో ఉన్న కొద్ది నెలల్లో ఆ కుటుంబానికి బాగా దగ్గరయ్యాడతను.

అతనికి పెద్దన్నలాగా అన్ని విషయాల్లో సలహా లిస్తుండేవాడు నైరా తండ్రి.

తాను ఫైనాన్స్‌ని ఎలా ప్లాన్ చేస్తున్నదీ, ఒక వేళ తనకేమైనా జరిగితే కుటుంబానికి ఎటువంటి ఆర్థిక సమస్యలు తలెత్తకుండా తమ కంపెనీలోనే ఇన్స్యూరెన్స్, స్టాక్స్ వీటన్నిటిలో ఎలా ఇన్వెస్ట్ చేస్తు న్నదీ అన్నీ శ్రీనివాస్‌కి వివరించాడతను.

అంతా బాగుందనుకుంటున్న సమయంలో శ్రీని వాస్‌లో ఏదో దుర్ముహూర్తాన అసూయ ప్రవేశించింది.

తన ఊళ్ళో తనొక తోపు.

ఏదో బోడి వెండింగ్ మెషీన్‌లాంటివి ఎలా వాడాలో చూపించినంత మాత్రాన ప్రతివాళ్ళూ అతనేదో తనకి గురువయినట్లూ, అతను లేకపోతే తను బ్రతకలేడన్నట్లు మాట్లాడతారేమిటి?

ఎవరి అండా లేకుండా అంత కుగ్రామం నుంచి అమెరికా వరకు రాగలిగాడు తను. అతని కంటే తను అన్నింట్లోనూ ఎక్కువని నిరూపించుకోవాలి. అతను లేకపోతే తను అమెరికాలో బ్రతకలేక పోయేవాడా? నాన్సెన్స్!

తనేమిటో అందరికీ తెలియాలి.

శ్రీనివాస్‌లో ఉన్న మరో కోణం డబ్బు మీద విపరీతమైన మోజు! అదే అతన్ని మారుమూల కుగ్రామం నుంచీ అమెరికా వరకూ తీసుకొచ్చింది. అయితే అమెరికాలో డబ్బు చెట్లకు కాయదనీ, అక్కడ ఖర్చులకే అక్కడి సంపాదన చాలావరకూ సరిపోతుందనీ, కొన్నాళ్ళకి కానీ అర్థం కాలేదతనికి. పైగా తన కమ్యూనికేషన్‌తో ఎక్కువరోజులు అక్కడ సర్వైవ్ కాలేడని తెలుసుకున్నాడు. ఓవర్ నైట్ కోటీశ్వరుడైపోవటానికి దారులు వెతకటం మొదలెట్టాడు.

సరిగ్గా అదే సమయంలో క్రిస్‌మస్ సెలవులకి అందరూ ఊళ్ళకి వెళ్ళటంతో ప్రొడక్షన్ ఇష్యూస్ సాల్వ్ చేసే పని శ్రీనివాస్‌కి అప్పజెప్పింది కంపెనీ.

అప్పుడు తట్టిందతనికి ఐడియా.

కస్టమర్‌కి చెందిన ప్రతి ట్రాన్సాక్షన్ సెల్‌ఫోన్ల ద్వారా వాళ్ళకు అందచేసే ఫంక్షన్‌ని డిజేబుల్ చేశాడు.

చిన్న కోడ్ రాసి రన్ చేశాడు. దానితో ప్రతి కస్ట మర్ అకౌంట్ నుంచి ఒక క్వార్టర్ అంటే ఇరవై అయిదు సెంట్లు (డాలర్‌లో పావు) తన అకౌంట్ లోకి ట్రాన్స్‌ఫర్ అవుతుంది. పాతిక సెంట్లు చాలా చిన్నమొత్తం కాబట్టి ఎవరికీ సందేహం రాదు. కానీ బ్యాంక్‌కి ఉన్న డెబ్బై మిలియన్ల కస్టమర్ల నుంచి అతని అకౌంట్‌లోకి వచ్చే మొత్తం డబ్బు విలువ పదిహేడు మిలియన్ డాలర్లు. అంటే అక్షరాలా వంద కోట్ల రూపాయల పైమాటే!

కోడ్ రన్ అవుతోంది.

నరాలు తెగిపోయేంత టెన్షన్‌గా ఉందతనికి.

ఎటువంటి తేడా రాకుండా తన అకౌంట్‌లోకి డబ్బు చేరిపోవాలి.

మధ్యమధ్యలో అకౌంట్ తెరిచి చెక్ చేసుకుం టున్నాడు.

బాలన్స్ అమౌంట్ ధరల కంటే వేగంగా పెరిగి పోతోంది.

***

సరిగ్గా అప్పుడే నైరా తండ్రి ఆన్‌లైన్ ట్రాన్సాక్షన్ కోసం తన అకౌంట్ నుంచి డబ్బు ట్రాన్స్‌ఫర్ చేయ టానికి ప్రయత్నిస్తున్నాడు.

అన్ని దేశాలకు చెందిన అన్ని మిలియన్ల కస్ట మర్ల అకౌంట్లనూ శ్రీనివాస్ రాసిన కోడ్ ఆక్సెస్ చేస్తుండడంతో సర్వర్లు చాలా స్లోగా రెస్పాండ్ అవుతున్నాయి. కొన్ని ఫీచర్లు పని చేయకుండా డౌన్ అని చూపిస్తోంది.

ఎందుకని ప్రాబ్లమ్ వస్తుందో అర్థం కాలేదత నికి. అసలే క్రిస్‌మస్. శ్రీనివాస్ ఒక్కడే ఆఫీస్‌లో ఉండి ఉంటాడు... సాల్వ్ చేయగలడో లేదో! లేచి ఆఫీస్‌కి బయల్దేరాడు.

*(ముగింపు వచ్చేవారం)*

# రుచిలో రాణి బిర్యానీ

**అమెరికా అయినా, బ్రిటన్ అయినా జర్మనీ అయినా జపాన్ అయినా బిర్యానీ తినాలనిపిస్తే భారత్‌వైపు ముఖ్యంగా హైదరాబాద్‌వైపు చూడాల్సిందే! అతిథిదేవోభవ అని మన పెద్దలన్నారు. అందుకేనేమో అతిథులుగా వచ్చిన అన్ని దేశాల వారికి మన ప్రత్యేకతలను పరిచయం చేసి మెప్పించి మురిపిస్తున్నాము. రాచరికాలు పోయాయి, రాజులు లేరు అయితే ఏం? ఇప్పుడు మనదేశానికి వచ్చే విదేశీ అతిథులకు హాట్ ఫేవరేట్ బిర్యానీనే!! బిర్యానీ అన్న పదం ఉర్దూ పదం. ఇది పర్షియన్ భాష నుంచి వచ్చింది.**

## హైదరాబాదీ బిర్యానీ

నిజాం పరిపాలనా కాలంలో నగరానికి ఇరానీయులు వలస వచ్చేవారు. క్రమేణా నగరంలో వారు పలు వ్యాపారాలు ప్రారంభించారు. ప్రస్తుతం నగర వాసుల జీవితాల్లో ఎనలేని ప్రాధాన్యం సంతరించుకున్న ఇరానీచాయ్ అక్కడ నుంచి దిగుమతి చేసుకున్నదే. అసఫ్‌జాహీల కాలం నుంచి మనదేశంతో ఇరాన్‌కి సత్సంబంధాలు ఉండేవి. ఈక్రమంలో అసఫ్ జాహీలు ఇరాన్ దేశాన్ని సందర్శించే సమయంలో అక్కడ ఓసారి ఇరాన్ రాజు పొట్టేలు మాంసంతో తయారైన బిర్యానీని రుచి చూపించాడు. ఇక్కడ కూడా అలాంటి రుచులు ప్రవేశపెట్టాలని కోరడంతో ఆ దేశం నుంచి చాలామంది మన దేశానికి వ్యాపారం నిర్వహించడానికి వచ్చారు. ముందుగా మదీనా ప్రాంతంలో బిర్యానీ వంటకం ప్రారంభించారు. దాన్ని మీర్ ఉస్మాన్ అలీఖాన్ ప్రారంభించాడు. నిజాం కాలంలోనే ప్రాచుర్యం పొందిన ఈ బిర్యానీ క్రమేణా నగర విస్తరణతో పాటు దేశంలోని ప్రముఖ పర్యాటక ప్రాంతాల్లో సైతం హైదరాబాద్ బిర్యానీ రుచులను అందిస్తున్నాయి.

### 14 వేల టన్నుల బిర్యానీతో రికార్డు

బకాసురుడు బండెడు ఆహారం తినేవాడట. అతగాడికి బిర్యానీ వడ్డించాలంటే కనీసం ఈమాత్రం తయారు చేయాలేమో! ఇంత భారీగా బిర్యానీ ఎందుకు తయారు చేశారంటారా? ఢిల్లీలోని కోహినూర్ ఫుడ్స్ లిమిటెడ్ సంస్థకు రికార్డు బద్దలు కొట్టాలని సరదా పుట్టింది. ఇకనేం ఆ కంపెనీకి చెందిన అరవై మంది పాకశాస్త్ర నిపుణులు నడుం బిగించి రంగంలోకి దిగారు. వాళ్ళు గరిటెలు తిప్పగా తిప్పగా ఏకంగా 14,060 టన్నుల బిర్యానీ తయారైంది. ఈ బిర్యానీ కోసం మూడు వేల కిలోల బియ్యం, 3,650 కిలోల కూరగాయలు, 85 కిలోల మిరపకాయలు, 86 కిలోల ఉప్పు, 1200 లీటర్ల నూనె ఉపయోగించారు.

## హైదరాబాద్ దమ్ బిర్యానీ ఫేమస్

మనదేశంలో ఒక్కో రాష్ట్రంలో ఒక్కో రకం బిర్యానీ తయారు చేస్తారు. అన్నింటికన్నా హైదరాబాద్ దమ్ బిర్యానీ ఫేమస్. అందులో వేసే పదార్థాలు, వండే విధానం బట్టి బిర్యానీ రుచి మారుతుంది. ఉన్నత వర్గం, మధ్య తరగతి వర్గాలనే తారతమ్యాలు లేకుండా నగరంలో ప్రజలు నిర్వహించే ఫంక్షన్లలో బిర్యానీ లేనిదే తమ కార్యక్రమం ముగియడం లేదంటే వింతేమీ కాదు.

## బిర్యానీతో జరభద్రం

వేడుక ఏదైనా చికెన్ బిర్యానీ లేనిదే నోటితో పాటు మనసూ సంతృప్తి పడదనుకునే వారికి ఇదొక షాకింగ్ న్యూస్. మద్యం అలవాటు లేదు. కేవలం బిర్యానీ మాత్రమే ఇష్టంగా తింటాం, అనుకునే వారికి మాత్రం చేదు వార్తే. ఆల్కహాల్ ప్రభావంతో వచ్చే కాలేయ సమస్యలు అతిగా చికెన్ మటన్ బిర్యానీలు తిన్నా వస్తాయి. బిర్యానీతో పాటు తీసుకునే కూల్‌డ్రింక్స్ ప్రభావంతో ఈ కాలేయ సమస్యలు మరింత ఎక్కువవుతాయని ఓ పరిశోధనలో వెల్లడైంది. కాలేయ సమస్యలతో బాధపడేవారి సంఖ్య ప్రతీ ఏడాది 30 నుంచి 35 శాతం పెరుగుతోంది. నగరాల్లో వీరి సంఖ్య మరీ ఎక్కువగా ఉందని పరిశోధనలో తేలింది. అకస్మాత్తుగా కడుపునొప్పి రావడం, ఛాతినొప్పి, నీరసం వంటి లక్షణాలతో బాధితులు ఎక్కువగా హాస్పిటల్ మెట్లు ఎక్కుతున్నట్లు పరిశోధనలో తేలింది. ఒక్క బిర్యానీ తింటే దాదాపు 500 కేలరీలు శరీరంలో చేరతాయి. అయితే అంత భారీ మొత్తంలో కేలరీలు మనిషికి ఒకేసారి అవసరం లేదని చెబుతున్నారు పరిశోధకులు. బిర్యానీల్లో నెయ్యి, డాల్డా, వనస్పతి, మసాలా ఎక్కువగా వాడటంవల్ల ఈ సమస్యలు వస్తుంటాయని వైద్య నిపుణులు చెబుతున్నారు.



## షుగర్ తగ్గించే బిర్యానీ ఆకు

మధుమేహం చాలామంది ఎదుర్కొంటున్న సమస్య. ఈ సమస్య ఉందని నిర్ధారణ కాగానే రోగులు కలవర పడుతున్నారు. దీన్ని నయం చేసుకోవడానికి రకరకాల మందులు వేసుకుంటున్నారు. వాటితోనే కాకుండా బిర్యానీ ఆకులతోనూ షుగర్ వ్యాధిని దూరం చేసుకోవచ్చునంటున్నారు నిపుణులు. ఒక గిన్నెలోకి పది బిర్యానీ ఆకులు తీసుకుని, మూడు గ్లాసులు మంచినీళ్ళు పోసి పది నిమిషాలు మరిగించాలి. ఆ తర్వాత రెండు మూడు గంటలు ఆ నీటిని అలానే ఉంచి, అనంతరం ఆకులను తీసేసి ఆ నీటిని సగం గ్లాసు చొప్పున రోజుకు మూడుసార్లు తాగాలి. ఉదయం ఒకసారి తయారు చేసుకుని మూడు పూటలా తాగొచ్చు. ఉదయం టిఫిన్, మధ్యాహ్నా భోజనం, రాత్రి భోజనానికి ఒక గంట ముందుగా ఈ నీరు తీసుకుంటే మంచి ఫలితాలు కనిపిస్తాయి. ఇలా వరుసగా మూడు రోజులు క్రమం తప్పకుండా తాగి, రెండు వారాల తర్వాత మళ్ళీ మూడు రోజులు క్రమంగా వాడాలి. ఇలా చేయడం వల్ల షుగర్ నియంత్రణలోకి వస్తుంది. ఈ నీరు ఇన్సులిన్ ఉత్పత్తిని క్రమబద్ధం చేయడం వల్ల డయాబెటిస్ అదుపులో ఉంటుంది. కొవ్వు తగ్గి గుండె జబ్బులు రావు. కేన్సర్ కారకాలను ఎదుర్కొనే రోగ నిరోధక శక్తిని శరీరానికి అందిస్తుంది.

—సంతోషి



అవార్డు గ్రహీతలతో జగన్నాథశర్మ, రావుబాలసరస్వతీదేవి, డాక్టర్ అమృతలత, నెల్లుట్ల రమాదేవి

# మాతృదేవతలకు అమృతలత అపురూప పురస్కారాలు

**ప్రేమ పుట్టే గంగోత్రి అమ్మ హృదయం.. యావత్ ప్రపంచాన్నీ సెలయేరులా ప్రేమ ప్రవాహంలో నడిపించే త్యాగమూర్తి అమ్మ. ప్రేమించడానికే పుట్టిన కారణజన్మురాలు. ఇంటింటా దేవతైకొలువు దీరి మనల్ని తీర్చి దిద్దే పరమపావని, సకల కళా నిపుణురాలు అమ్మ. అలాంటి అమ్మలకు హైదరాబాద్‌లో "అపురూప" సత్కార సభ జరిగింది.**

ఆకాశం నిండా పరుచుకున్న అమ్మకు ప్రపంచ ప్రజలు ప్రణమిల్లే మాతృదినోత్సవ పూర్వసంధ్యలో మే 13వ తేదీ, శనివారం సాయంత్రం సకల కళా పారంగతులైన పన్నెండుమంది అమ్మలకు ఈ పురస్కారాలు అందజేశారు. వైవిధ్యభరితమైన ప్రజ్ఞాపాటవాలు ప్రదర్శిస్తూ ఇంటా బయటా రాణిస్తున్న ఈనాటి 'అమ్మ'లు ఎందరో తెలుగు విశ్వవిద్యాలయానికి తరలివచ్చి డాక్టర్ నందమూరి తారక రామారావు కళావేదికపై సందడి చేశారు.

డాక్టర్ అమృతలత-అపురూప అవార్డుల కమిటీ సారథ్యంలో ఈ అవార్డుల వ్యవస్థాపకురాలు, విద్యావేత్త, రచయిత్రి డాక్టర్ అమృతలత అధ్యక్షతన ఈ కార్యక్రమం నిర్వహించారు. ప్రముఖ రచయిత, నవ్య వీక్లీ సంపాదకులు, కళారత్న ఎ.ఎన్. జగన్నాథశర్మ ముఖ్యఅతిథిగా హాజరయ్యారు. అవార్డు గ్రహీతల పరిచయాలతో కూడిన 'అభినందన' సంచికను ఆయన ఆవిష్కరించారు. తొలి తెలుగు సినీ నేపథ్యగాయని, నటి రావు బాలసరస్వతీదేవి గౌరవ అతిథిగా, అలనాటి ప్రముఖ నటి గీతాంజలి రామకృష్ణ విశిష్ట అతిథిగా హాజరయ్యారు. వీరందరినీ డాక్టర్ అమృతలత ఘనంగా సత్కరించారు.

సాహిత్యం, సంగీతం, నృత్యం, చిత్రలేఖనం.. ముఖ్యంగా లలితకళల్లో నిష్ణాతులైన పన్నెండుమంది మహిళలకు అమృతలతతోపాటు ముఖ్య అతిథి జగన్నాథశర్మ, రావు బాలసరస్వతీదేవి, గీతాంజలీ రామకృష్ణలు 2017 'అమృతలత-అపురూప' పురస్కారాలు అంద జేశారు.

### రేడియో చిన్నక్క, ఓల్గాలకు అమృతలత అవార్డులు

నాలుగు దశాబ్దాలపాటు రేడియోలో తొలుత రమణక్కగా, తర్వాత చిన్నక్కగా శ్రోతలను అలరించి తెలుగువారి హృదయాలలో నిలిచిపోయిన రేడియో ప్రయోక్త శ్రీమతి రతన్ ప్రసాద్‌కు అమృతలత అవార్డు జీవన సాఫల్య పురస్కారం ఇచ్చి ఘనంగా సత్కరించారు. నగదు, జ్ఞాపిక, అభినందన సంచిక, పుష్పగుచ్ఛాలతో శాలువాకప్పి సత్కరించారు.

పితృస్వామిక వ్యవస్థ ఆధిపత్యంపై బాల్యంనుండే పరిశోధన చేస్తూ, అస్థిత్వ పతాక ఎగురవేసి స్త్రీవాద సాహిత్యానికి బాటలుపరిచిన శ్రీమతి ఓల్గాకు కూడా అమృతలత జీవన సాఫల్యపురస్కారం, నగదు, జ్ఞాపిక అందజేసి శాలువా కప్పి సత్కరించారు.

### 'అపురూప' పురస్కారాలు

నిష్ణాతులైన పదిమంది మహిళలకు 'అపురూప' పురస్కారాలు అందజేశారు. వారికి నగదు, జ్ఞాపిక, అభినందన సంచిక, పుష్పగుచ్ఛాలతో శాలువాకప్పి సత్కరించారు. తెలుగునాట తొలి టెక్నోక్రాట్ డాక్టర్

### హైలైట్స్ ఇవే

- అతిథులు వేదికపైకి వస్తుంటే ప్రదర్శించిన నేపథ్యగీతాలూ, సందర్భానికి తగ్గట్టు డిజిటల్ స్క్రీన్‌పై ప్రదర్శించిన విజువల్సూ అలరించాయి.
- అమ్మలకోసం, అమ్మలు చేసిన ఈ కార్యక్రమంలో సర్వం తామై కలియదిరుగుతూ ప్రతి చిన్నపనీ సమన్వయంతో చేస్తూ సభలో మాతృదినోత్సవ స్ఫూర్తి నింపారు.
- 86ఏళ్ళ పండుటాకు రావు బాలసరస్వతీదేవి ఎంతో చలాకీగా అందరికంటే ముందుగా సభకు వచ్చి ఒక ప్రత్యేక బహుమతి దక్కించుకున్నారు.
- అచ్చంగా నలభై, యాభై ఏళ్ళు దాటిన అమ్మలు... సభలో ఆటవిడుపుగా శ్రేష్ఠమైన పాటలకు నాట్యాలు చేసి ఔరా! అనిపించారు.
- డాన్సులూ మేమే చేస్తాం, పాటలూ మేమే పాడతాం, మాతృదినోత్సవనాడు ఈ వేదికను మరొకరికి మేమెలా ఇస్తాం అంటూ వ్యాఖ్యాత సభా ప్రాముఖ్యం చాటి చెప్పారు.
- ప్రతి సభలోనూ మగాళ్ళ ప్రసంగాలు వినీ వినీ విసిగిపోయా. ఇక్కడంతా ఆడవాళ్ళే. ప్రతీదీ స్త్రీలే చేయడం, వారి మాటలు, పాటలు, నృత్యాలు...ఎంతో కన్నులపండువగా ఉందీ రోజు అన్నారు ఓల్గా.
- అమృతలత ఒక బంగారు మొక్క. ఆ మొక్కకు పూచిన పువ్వులమే మేమంతా అన్నారు రేడియో చిన్నక్క.
- మేం తాకటవంశీయులం, గుర్తింపు లేనివాళ్ళం. కానీ సావిత్రీబాయిపూలే వారసత్వాన్ని మళ్ళీ ఇక్కడకు తెచ్చి దళితులకున్న ప్రత్యేకత గుర్తించి నిజాయితీగా నాకు ఈ అవార్డు ఇచ్చారు అన్నారు గోగు శ్యామల.

సోమరాజు సుశీలకు పారిశ్రామికవేత్త, విజ్ఞానశాస్త్ర, సాహితీవేత్త విభాగంలో 'అపురూప' పురస్కారం లభించింది. ఔత్సాహిక పారిశ్రామికవేత్తలకు ఆమె మార్గదర్శి, రచయిత్రిగా లబ్దప్రతిష్ఠులు.

కాగా, కూచిపూడి నృత్య విభాగంలో ప్రసిద్ధ నర్తకీమణి డా.మద్దాళి ఉషాగాయత్రి, నాటక రచనలో అత్తలూరి విజయలక్ష్మి అపురూప పురస్కారాలు అందుకున్నారు. కాలమిస్టు, వ్యాఖ్యానం, ప్రింట్ అండ్ ఎలక్ట్రానిక్ జర్నలిజం విభాగంలో సేవలకు గాను డాక్టర్ మృణాళిని, చిత్రలేఖనం విభాగంలో చిత్రకారిణి, నేషనల్ ఫ్యాషన్ టెక్నాలజీ అధ్యాపకురాలు ప్రొఫెసర్ ఆర్.లక్ష్మీరెడ్డి, లలితసంగీత విభాగంలో శ్రీమతి శశికళాస్వామి, కథారచన విభాగంలో పరిశీలనాత్మక, విశ్లేషణాత్మక రచనలు చేసిన వారణాసి నాగలక్ష్మి, మహిళావికాసం-వైద్యరంగ విభాగంలో సెక్సాలజిస్టు, సైకియాట్రిస్టు, అభ్యుదయ వాది డాక్టర్ శ్రీమతి భారతి అలియాస్ గీతాంజలి అపురూప పురస్కారాలు అందుకున్నారు.

దళిత-స్త్రీవాద సాహిత్యంలో తనదైన ప్రత్యేక స్థానం పొందిన రచయిత్రి గోగు శ్యామలకు జీవిత చరిత్రల విభాగంలో పురస్కారం లభించింది. ముస్లిం సమాజాన్ని శాసిస్తున్న సాంస్కృతిక నిర్బంధాన్ని, సామాజిక దౌష్ట్యాన్ని, రాజకీయ పీడనను చీల్చి చెండాడి జాతీయస్థాయిలో గుర్తింపు పొందిన కవయిత్రి డాక్టర్ షాజహానా కవిత్వ విభాగంలో పురస్కారం అందుకున్నారు. ప్రేక్షకుల కరతాళ ధ్వనుల మధ్య ఈ అపురూపమైన పురస్కారాల ప్రదానోత్సవం జరిగింది.

### యువ రచయిత్రికి ప్రోత్సాహక అవార్డు

బాల్యం నుండి తెలుగుపై మమకారం పెంచుకుని గొప్ప కవిత్వం రాసింది రక్షితసుమ. 'దారిలో లాంతరు' అనే కవితా సంపుటిని అతిచిన్న వయసులోనే వెలువరించి భాషపై తన ప్రేమ చాటుకున్న రక్షితసుమకు ప్రోత్సాహక అవార్డు ఇచ్చి సత్కరించారు డాక్టర్ అమృతలత.

### అన్నీ నేర్పేది అమ్మ

ఈ ప్రపంచంలో అమ్మకంటే అందమైన రూపం లేదు. అలాంటి అమ్మలగన్న అమ్మలకు శిరస్సు వంచి పాదాభివందనం చేస్తున్నానన్నారు ముఖ్య అతిథి ఎ.ఎన్.జగన్నాథశర్మ. ఇంట్లో అమ్మమాటే ప్రధానం, మాతృమూర్తే మన గురువు, అ ఆ లు, ఆప్యాయతలు, సెంటిమెంట్లు... ఇలా నిత్యజీవితంలో మనకు అన్నీ నేర్పేది అమ్మే అంటూ తన మాతృమూర్తిని గుర్తుతెచ్చుకున్నారు. సాహిత్యరంగంలో హారీపోటర్ లాంటి కమర్షియల్ రచనలు మొదలు క్లాసిక్ రచనల వరకు రచయిత్రులే రాజ్యమేలుతున్నారనీ, అందువల్ల రచయిత్రులుగా రాణిస్తున్న అమ్మలే గొప్పవారనీ, వారు లేకపోతే పత్రికలే ఉండవనీ అన్నారు.

మహామహులైన మహిళామణులకు అవార్డులు అందిస్తూ డాక్టర్ అమృతలత గొప్ప సేవలు అందిస్తున్నారన్నారు. డాక్టర్ అమృతలత స్వతహాగా రచయిత్రేకాకుండా సంగీత సాహిత్యాలు, కళలపట్ల మమకారంగల విద్యావేత్త అని కొనియాడారు జగన్నాథశర్మ.

### చాల పెద్దమ్మ

నిరాడంబరంగా ఉంటూ అమృతలత-అపురూప అవార్డులిస్తూ అమ్మలను ప్రోత్సహిస్తున్న డాక్టర్ అమృతలతను అమ్మలగన్నయమ్మ, చాల పెద్దమ్మ... అని ప్రశంసించారు గీతాంజలి రామకృష్ణ. యాభై ఏళ్ళక్రితం సీతారామకల్యాణం చిత్రంలో సీతపాత్ర చేస్తున్న తనకు ఎన్టీఆర్ స్వయంగా నుదుట తిలకం దిద్ది మేకప్ చేయడం గొప్ప అదృష్టంగా భావిస్తానన్నారామె. 'పౌరుగింటి మీనాక్షమ్మను చూశారా... వాళ్ళ ఆయనచేసే ముద్దూ ముచ్చటా విన్నారా... (సంబరాల రాంబాబు), నాగమల్లి కోనలోన... నక్కింది లేడికూన..గురిచూసి..హ..ఎరవేసి...హ... పట్టాలిమావ.....(బంగారు తిమ్మరాజు) పాటలు పాడి అలరించారు గీతాంజలి.

### హుందాతనమిచ్చిన రమాదేవి వ్యాఖ్యానం

వ్యాఖ్యాత, ప్రముఖ రచయిత్రి నెల్లుట్ల రమాదేవి ఆసక్తికరమైన వ్యాఖ్యలతో సభ నడిపించారు. బంగారానికి తావి అబ్బిన చందాన ఆమె వ్యాఖ్యానం సభకు నిండుదనమిచ్చింది. శ్రీమతి కిరణ్‌బాల ఆమెకు సహకరించారు. శ్రీమతి టి.వసంతా వివేక్ వందన సమర్పణ చేశారు.

### నవ్వులు రువ్విన స్కిట్

క్రికెట్‌మ్యాచ్‌లో గెలిచిన కెప్టెన్‌ను టీవీ వ్యాఖ్యాత అక్కడికక్కడే ఇంటర్వ్యూ చేస్తాడు. అది ఆంగ్లంలో ప్రశ్నలు, జవాబుల రూపంలో కొండొకచో మనకు అర్థంకానంత శరవేగంతో సాగిపోతుంది. సరిగ్గా దాన్నే ఒక స్కిట్టుగా మలిచి ఈ వేదికపై ప్రదర్శించి నవ్వుల పువ్వులు పూయించారు. భారత్‌పై గెలిచిన ఆస్ట్రేలియా జట్టు కెప్టెన్ పాత్రలో నెల్లుట్ల రమాదేవి, కామెంటేటర్ పాత్రలో టి.కవితా దివాకర్ స్కిట్‌ను రక్తికట్టించి అచ్చంగా లైవ్ టెలికాస్ట్‌ను తలపించారు. మనకు అర్థంకాని ఈ జు..జు..జూ భాష లానే భవిష్యత్తులో తెలుగు కూడా మారిపోతుందేమో అని డాక్టర్ అమృతలత స్కిట్ చివరిలో చేసిన వ్యాఖ్య అందరినీ ఆలోచింపజేసింది.

—రామ్మోహన్

### నీరుపోసి సాకమని చెట్టు అడుగుతుందా?



ఒక చెట్టు చిగురాకులు వేస్తే ఒక అందం, పుష్పిస్తే ఒక సుగంధం మనల్ని ఆకర్షిస్తాయి. కాయలూ, పళ్ళూ అందించినప్పుడు పరిపూర్ణత్వంతో నీడనిస్తుంది చెట్టు. మనమే స్వయంగా ఈ విషయం గుర్తించి ఆ చెట్టుకు నీరుపోసి పోషించాలే తప్ప 'నన్ను గుర్తించండోయ్' అని ఏ చెట్టూ ఎప్పుడూ తననుతాను మార్కెట్ చేసుకోదు. కళాకారులు, సంఘసేవాతత్పరుల నైజమూ అంతే! మనమే వారిని గుర్తించి గౌరవించాలి.

ఏ రంగంలో చూసినా మహిళలకు గుర్తింపు, ప్రాతినిధ్యం ఉండటంలేదు. అందుకే నిష్ణాతులైన మహిళలను సత్కరించాలన్న ఉద్దేశంతో అవార్డుల కోసం అప్లికేషన్ పెట్టుకునే అవసరం ఎవరికీ లేకుండా వివిధ రంగాలవారిని గుర్తించి అమృతలత- అపురూప అవార్డుల కమిటీ సారథ్యంలో సగౌరవంగా ఈ అవార్డులు అందజేస్తున్నాం. ఏడేళ్ళుగా 12 మందికి అమృతలత అవార్డులు, ఐదేళ్ళుగా యాభైమందికి అపురూప పురస్కారాలు అందజేశాం. అమృతలత అవార్డుకింద ఒక్కొక్కరికీ పాతికవేల 116 నగదు, అపురూప పురస్కారంగా ఒక్కొక్కరికీ 10,116 అందజేస్తున్నాం. అవార్డు ప్రదాతలుగా వితరణశీలురు, బంధుమిత్రులు, కుటుంబ సభ్యులు ఈ కార్యక్రమ నిర్వహణకు ఎంతగానో దోహదపడుతున్నారు.

—డా.అమృతలత


అమృతలత జీవితసాఫల్య పురస్కారాలు అందుకుంటున్న రతన్‌ప్రసాద్, ఓల్గా




మే 24 నుంచి
మే 30 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)**

విద్యా విషయాలు, స్థలమార్పులు, కుటుంబ వ్యవహారాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో విలువైన పత్రాలు కోల్పోయే ప్రమాదం ఉంది. విద్యా విషయాలకు అవసరమైన నిధులు సకాలంలో అందక ఇబ్బంది పడతారు. 26, 27 తేదీల్లో కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు అనుకూలం. స్టేషనరీ, ఏజెన్సీ, విద్యారంగాలవారికి ప్రోత్సాహకరం. 28, 29 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు నిదానం పాటించాలి. ఇల్లు, స్థలం మార్పిడి, బదిలీలకు అనుకూల సమయం. 30న చిన్నారులు, ప్రియతముల రాకతో ఇల్లు సందడిగా ఉంటుంది. వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు.



**వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, విద్యా విషయాలు, కుటుంబ వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ఆర్థిక వ్యవహారాల్లో కీలక నిర్ణయాలు వాయిదా వేయండి. వ్యక్తిగత సౌకర్యాల కోసం ఖర్చు చేస్తారు. 26, 27 తేదీల్లో డిపాజిట్లపై మంచి ప్రతిఫలం అందుకుంటారు. ఆర్థిక వ్యవహారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. 28, 29 తేదీల్లో చర్చలు, ప్రయాణాల్లో నిదానం పాటించాలి. విద్యార్థులు లక్ష్యసాధనకు అధికంగా శ్రమించాలి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు తగిన సమయం కాదు. 30న కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. ఇంటికి అవసరమైన వస్తువుల రవాణాకు అనుకూలం.



**మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)**

ఆర్థికపరమైన నిర్ణయాలు, బ్యాంకు లావాదేవీలు, చర్చలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో రాజకీయ, సినీ రంగాల వారు కీలక నిర్ణయాలు వాయిదా వేయడం మంచిది. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలపై ఒక నిర్ణయానికి వస్తారు. 26, 27 తేదీల్లో అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక విషయాల్లో తొందరపాటు తగదు. 28, 29 తేదీల్లో పెట్టుబడులు, పొదుపు పథకాల్లో నిదానం అవసరం. ఖర్చులు అంచనాలు మించుతాయి. విలువైన వస్తువుల గురించి ఆరాతీస్తారు. 30న ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది. విలువైన పత్రాలు అందుకుంటారు.



**కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)**

ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, పెట్టుబడులపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధ, గురువారాల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 26, 27 తేదీల్లో సినీ, రాజకీయ రంగాలవారికి ప్రోత్సాహకరం. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు సంబంధించిన అంశాలు కలవరపెడతాయి. 28, 29 తేదీల్లో కొత్త వ్యూహాలు రచిస్తారు. కీలక నిర్ణయాలు వాయిదా వేయండి. మీ ఆలోచనలు సమీక్షించుకుంటారు. 30న పెట్టుబడులు, పొదుపు పథకాలు లాభిస్తాయి. కొత్త ఆదాయ మార్గాల అన్వేషణ ఫలిస్తుంది.



**సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)**

వేడుకలు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, పెట్టుబడులకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. వేడుకల్లో పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 26, 27 తేదీల్లో బృంద కార్యక్రమాలు ఉల్లాసం కలిగిస్తాయి. బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులకు ఆటంకాలు ఎదురవుతాయి. 28, 29 తేదీల్లో విద్య, దూర ప్రయాణాలకు అనుకూలం. బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. 30న బోధన, న్యాయ, పరిశోధన, శాస్త్ర, సాంకేతిక రంగాలవారికి శుభప్రదం. ఒక సందేశం ఆనందం కలిగిస్తుంది.



**కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)**

ప్రముఖులతో సమావేశాలు, పెట్టుబడులు, ఆర్థిక సంస్థలతో లావాదేవీలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 26, 27 తేదీల్లో ఆర్థిక విషయాల్లో పెద్దల సహకారం అందుకుంటారు. వృత్తిపరమైన సమావేశాల్లో జాగ్రత్త అవసరం. 28. 29 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. సమావేశాల్లో తొందరపాటు తగదు. బృందకార్యక్రమాల్లో పాల్గొంటారు. 30న బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. సినీ రాజకీయాలు, ఉన్నత విద్యా రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం.



**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు, సమావేశాలు, ప్రముఖుల కలయికపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో పెట్టుబడులకు సంబంధించిన సమాచారం అందుకుంటారు. బంధుమిత్రుల ఆరోగ్యం కలవరపెడుతుంది. 26, 27 తేదీల్లో వృత్తిపరమైన అంచనాలు ఫలిస్తాయి. పెద్దలతో చర్చలు లాభిస్తాయి. రాజకీయ, సినీ రంగాల వారు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 28, 29 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకర ఫలితాలు అందుకుంటారు. ఉన్నత పదవుల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 30న సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం.



**వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, వేడుకలు, వృత్తిపరమైన సమావేశాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో స్పెక్యులేషన్లలో నష్టం సంభవం. ప్రియతముల కోసం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 26, 27 తేదీల్లో రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక విషయాల్లో అంచనాలు ఫలిస్తాయి. 28, 29 తేదీల్లో సమావేశాలు, చర్చల్లో లక్ష్యాలు సాధిస్తారు. సంకల్పం నెరవేరుతుంది. వేడుకల్లో పాల్గొంటారు. 30న వృత్తి, వ్యాపారాల్లో వ్యూహాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు.



**ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)**

క్రయవిక్రయాలు, వేడుకలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో విందు వినోదాల్లో ఖర్చులు అధికం. భాగస్వామి సహకారంతో వృత్తిపరమైన లక్ష్యాలు సాధిస్తారు. 26, 27 తేదీల్లో ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. 28, 29 తేదీల్లో రుణప్రయత్నాలు ఫలిస్తాయి. సంస్మరణల్లో పాల్గొంటారు. క్రయవిక్రయాలకు అనుకూలం. 30న సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. బృందకార్యక్రమాల్లో గతస్మృతులు నెమరు వేసుకుంటారు.



**మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)**

వేడుకలు, భాగస్వామ్యాలు, పెట్టుబడులు, స్పెక్యులేషన్లపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు 26, 27 తేదీల్లో విందు వినోదాల్లో పాల్గొంటారు. సన్నిహితుల ఆరోగ్యం మెరుగవుతుంది. కృషి రంగంలో శ్రమాధిక్యం తప్పకపోవచ్చు. 28, 29 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. వేడుకలు, సమావేశాలు ఉల్లాసం కలిగిస్తాయి. 30న పెట్టుబడులు లాభిస్తాయి. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు.



**కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)**

విద్యా విషయాలు, వృత్తి, వ్యాపారాలు, వేడుకలకు ఈ వారం ప్రాధాన్యమిస్తారు బుధ, గురువారాల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. విద్యాసంస్థల్లో ప్రవేశానికి అనుకూలం. 26, 27 తేదీల్లో సృజనాత్మకంగా వ్యవహరించి కృషి రంగంలో లక్ష్యాలు సాధిస్తారు. చిన్నారులు, ప్రియతముల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. విందుల్లో పాల్గొంటారు. 28, 29 తేదీల్లో ఆరోగ్యంపట్ల శ్రద్ధ చూపించాలి. వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యసాధనకు అధికంగా శ్రమించాలి. విందులు, వేడుకల్లో పాల్గొంటారు. 30న భాగస్వామి సహకారంతో వృత్తి వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు.



**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)**

విద్య, వృత్తి, వ్యాపారాలు, వివాహాది శుభకార్యాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రయాణాలు, చర్చల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. 26, 27 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారికి శుభప్రదం. కుటుంబ సభ్యుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. మార్పులు, చేర్పులు అసౌకర్యం కలిగిస్తాయి. 28, 29 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల పట్ల శ్రద్ధ చూపుతారు. పొదుపు పథకాల్లో ఆచితూచి వ్యవహరించాలి. ప్రేమానుబంధాలు బలపడతాయి. 30న వృత్తి, వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు.



## కూతుళ్ళు ఎలా అంటే అలా!




ఈ మాట చెప్పింది అలనాటి అందాల తార శ్రీదేవి. ఇటీవలి కాలంలో శ్రీదేవి కూతురు జాహ్నవి సినీరంగ ప్రవేశం గురించి పుంఖాను పుంఖాలుగా వార్తలు వస్తున్నాయి. జాహ్నవి సినీరంగ ప్రవేశానికి రంగం సిద్ధమైపోయిందనీ, రేపోమాపో ఆ పిల్ల సినిమా మొదలవుతుందన్న వార్తలు బాగానే షికారు చేశాయి. ఆ మధ్య కూతురి సినీరంగ ప్రవేశం విషయంలో శ్రీదేవి, ఆమె భర్త గొడవ పడ్డారన్న వార్త కూడా వినవచ్చింది. అయితే ఇవన్నీ కేవలం గాలివార్తలేననీ అంటోంది శ్రీదేవి. తన కూతుళ్ళిద్దరూ తమ కెరీర్‌ను ఎలా నిర్ణయించుకుంటారో వారిష్టం అంటోంది. వాళ్ళు ఎలా చెబితే అలా వింటాను తప్ప తన అభిప్రాయాలూ, నిర్ణయాలూ వారిమీద రుద్దనని స్పష్టం చేసింది.



## అభిమానంతో అవస్థలు!

సినీతారలకు అభిమానుల అభిమానమే కొండంత అండ. వారి అండ ఉన్నంత వరకూ తారల సినీ జీవితానికి ఎలాంటి ఢోకా ఉండదు. కానీ కొన్ని సార్లు అభిమానం హద్దులు దాటి ఎక్కడలేని ఇబ్బందులూ తెచ్చి పెడుతుంది. కోలీవుడ్ హీరో విజయ్ కూడా అలాంటి ఇబ్బందినే ఎదుర్కొంటున్నాడు. ఇటీవల విజయ్‌కి సంబంధించి ఓ ఫోటో సోషల్ మీడియాలో హల్‌చల్ చేస్తోంది. విజయ్ త్రిశూలం మీద కాలు పెట్టి ఉన్న ఫోటో అది. ఫోజులో ఏ లోపమూ లేదు. కానీ విజయ్ బూట్లు వేసుకొని త్రిశూలం పట్టుకోవడమే వివాదానికి కారణమైంది. కాళ్ళకి బూట్లు వేసుకొని త్రిశూలం చేత పట్టడం అంటే హిందువుల మనోభావాలు దెబ్బ తీయడమే అంటూ అతగాడి మీద కేసు నమోదైంది. ఇప్పుడదే ఆ హీరోగారి మెడకు చుట్టుకుని ముప్పతిప్పలు పెడుతోందట!




## అమ్మాయిని రికమెండ్ చేస్తున్న అమీర్‌ఖాన్!

సినిమాల మీద తప్ప అమ్మాయిల మీద పెద్దగా దృష్టిపెట్టని అమీర్‌ఖాన్ ఇప్పుడు ఓ అమ్మాయి అంటే ప్రత్యేక శ్రద్ధ చూపిస్తున్నాడని అంటున్నారు బాలీవుడ్ జనాలు. 'దంగల్' సినిమాలో ఫాతిమాసనాషేక్ అమీర్ ఖాన్‌కి పెద్దకూతురిగా నటించింది. ఇప్పుడీ అమ్మాయి విషయంలోనే అమీర్ అత్యుత్సాహం చూపిస్తున్నాడు అంటున్నారు సినీ జనాలు. ఆ అమ్మాయికీ, అమీర్‌కీ మధ్య ఏదో నడుస్తోందన్న పుకార్లు కూడా షికారు చేస్తున్నాయి. ఈ పుకార్ల కారణంగానే అమీర్‌కీ, ఆయన భార్యకీ మధ్య మనస్పర్థలు కూడా వచ్చాయట! అయితే ఇవన్నీ కేవలం గాలివార్తలేననీ, తాను ఎవరినీ రికమెండ్ చేయలేదనీ అమీర్ స్పష్టం చేస్తున్నాడు. అసలు తనకు అలాంటి అలవాటు కూడా లేదన్నది అతగాడి వాదన. అమీర్ ఎన్ని నీతులు వల్లించినా బాలీవుడ్ జనాలు నమ్మడం లేదట!

## వర్మ పైత్యానికి పరాకాష్ఠ!

ఏదో ఒక వివాదాన్ని పట్టుకుని సినిమా తీస్తానని అత్యుత్సాహం చూపడం రాం గోపాల్ వర్మకేమీ కొత్తకాదు. ఆయన మాటలను ఎంజాయ్ చేయడం ఆయన అభిమానులకూ కొత్త కాదు. కొత్త ఏమిటంటే వర్మ పైత్యం పరాకాష్ఠకు చేరుకోవడమే! మహాత్మా గాంధీని హత్య చేసిన గాడ్సే జీవితం మీద సినిమా తీస్తానని ప్రకటించాడు. వాస్తవానికి గాడ్సే అంటే భారతీయులు ఇప్పటికీ మండిపడుతూనే ఉన్నారు. అలాంటి వ్యక్తి జీవితాన్ని సినిమా తీస్తాననడం పైత్యం కాక మరేమిటి? అంటున్నారు సినీ జనాలు. ఇటీవలి కాలంలో రాము సినిమాలంటే ఓ జోక్‌గా మారిపోతున్నాయి. ఆయన సినిమాల్లో కంటెంట్ తగ్గిపోయిందని ఆయన అభిమానులు సైతం ఆవేదన చెందుతుంటే రాము మాత్రం అలాంటివి లైట్ తీసుకొని తన మానాన తను సినిమాలు ఎనౌన్స్ చేసుకుంటూ పోతున్నాడు. రాము తన ధోరణి మార్చుకోకపోతే చివరకి ఆయన అభిమానులు సైతం ఆయనకు విరోధులుగా మారే ప్రమాదం ఉందని సినీ జనాలు హెచ్చరిస్తున్నారు.



## ఆ సినిమా ఇద్దరూ కలిసి చేస్తారా?

ఒక సినిమాకి హీరోహీరోయిన్లు అనుకున్న వెంటనే ఆ పెయిర్ ఫిక్స్ అయిపోతుంది. కానీ వారిద్దరూ కలిసి సినిమా చేస్తారా?అన్న అనుమానం ఎవరికీ రాదు. కాకపోతే ఓ సినిమా విషయంలో మాత్రం ఈ అనుమానాన్ని చాలా మంది వ్యక్తం చేస్తున్నారు. ఇంతకీ సంగతేమిటంటే.... ప్రభుదేవా, నయనతార కలిసి ఓ సినిమా చేయబోతున్నారన్న వార్త సోషల్ మీడియాలో బాగా హల్‌చల్ చేస్తోంది. ఈ విషయంలో ఇటు నయనతార కానీ, అటు ప్రభుదేవా కానీ ఖండించడం లేదు. సినీజనాలకే వీరిద్దరూ కలిసి సినిమా చేస్తారా? అన్న అనుమానం వస్తోందట!





నీలాంబరి టు శివగామి

# నా మాటే శాసనం

'నీలాంబరి'లో కళ్ళతోనే నిప్పులు కురిపించినా....'శివగామి'గా రాజనీతికి శిరస్సు వంచినా... అది రమ్యకృష్ణకే చెల్లింది. పేరులోనే రమ్యతను నింపుకున్న రమ్యకృష్ణ కెరీర్‌లో ఎన్నో ఎత్తుపల్లాలు....ఎన్నో ఆటుపోట్లు. మూడు దశాబ్దాల సినీ జీవితంలో తనని శిఖరాగ్రాన నిలిపింది మాత్రం 'శివగామి' పాత్రేనంటున్న రమ్యకృష్ణతో.....

### నీలాంబరి టు శివగామి ఎలా అనిపిస్తోంది?

నీలాంబరి కన్నా ముందు చాలా మంచి పాత్రలు చేశాను. హీరోయిన్‌గా కొనసాగుతూ విలనీగా చేసింది బహుశా నేనొక్కదాన్నేనేమో! ఆ క్యారెక్టర్ ఒప్పుకున్నప్పుడు నా సన్నిహితులు కంగారు పడ్డారు. నన్ను విలనీగా ప్రేక్షకులు అంగీకరించరేమో అన్నది ఒక అనుమానం అయితే, ఆ సినిమాలో నా క్యారెక్టర్ మొదటి సగంలోనూ, చివరిలోనూ కనిపిస్తుంది. నా పాత్రకు ఇంపార్టెన్స్ ఉండదేమో అని వాళ్ళు భయపడ్డారు. కానీ ఆ పాత్రను ఛాలెంజ్‌గా తీసుకొని చేశాను. ఎంత పేరు వచ్చిందో అందరికీ తెలిసిందే! ఇక 'బాహుబలి' నన్ను శిఖరాగ్రాన నిలబెట్టింది అంటున్నారు అందరూ. ఇది నూటికి నూరుపాళ్ళు నిజం. ఈ పాత్రకు వచ్చినంత పేరు బహుశా భవిష్యత్తులో నేను చేసే పాత్రలకు రాకపోవచ్చు. అలాగని నా సినీప్రయాణం ఇక్కడితో ఆపను. మంచి సినిమా అనుకున్నది తప్పకుండా చేస్తాను. పై రెండు పాత్రలు ఎప్పటికైనా నా కెరీర్‌లో మైలురాళ్ళుగా నిలిచిపోతాయి.

### కథ విన్నప్పుడే మీ పాత్రకు ఇంత రెస్పాన్స్ వస్తుందని ఊహించారా?

మామూలుగా కథ వినే సమయంలో నేను చిన్నపాటి కునుకు తీస్తాను. అది నాకు తెలియకుండానే జరిగిపోతుంది. రాజమౌళిగారు కథ చెబుతుంటే మాత్రం నిద్ర రాలేదు. సుమారు రెండు గంటల పాటు అలా కథ వింటూ ఉండిపోయాను. నా పాత్ర ఛాలెంజ్‌గా అనిపించింది. రెండో ఆలోచన లేకుండా ఓకే చెప్పేశాను. ఆ పాత్ర చేస్తున్నప్పుడు ఎవ్వరూ నాకు గుర్తుకు వచ్చేవారు కాదు. పాత్ర ఒక్కటే గుర్తుండేది. నా మీద అంత గాఢమైన ముద్ర వేసింది ఆ పాత్ర.

### నీలాంబరి, శివగామి రెండింటిలో కోపం, పొగరు ఏ పాత్రలో ఎక్కువ అని ఫీలయ్యారు?

రెండు పాత్రల్ని ఒకదానితో మరొకటి పోల్చడం కుదరదు. రెండింటిలోనూ కోపం, పొగరు ఎక్కువే! నీలాంబరిలో కోపం, పొగరు మాత్రమే కనిపిస్తుంది. శివగామిలో ఓ రాజమాత కనిపిస్తుంది. కోపం, పొగరు, ప్రేమాభిమానాలు అన్నీ ఉంటాయి. నీలాంబరి చేసినప్పుడు కన్నా శివగామి చేసేటప్పుడే ఎక్కువ కష్టంగా అనిపించింది. అన్ని భావాలను ఒకేసారి చూపించడం అంటే కొద్దిగా కష్టమే! ఇప్పుడు అందరూ చాలా బాగా చేశావు అని మెచ్చుకుంటుంటే ఆ కష్టాన్ని మరచిపోయాను.

### సుదీర్ఘ సినీప్రయాణంలో మీకు బాగా నచ్చిన పాత్ర?

ఏ పాత్ర అయినా, సినిమా అయినా నచ్చకపోతే చేయను. సినిమా ఒప్పుకున్న తరువాత ఆ పాత్రకు నూటికి నూరుశాతం న్యాయం చేయడానికి ప్రయత్నిస్తాను. అన్ని

పాత్రలలోకెల్లా నీలాంబరి, శివగామి పాత్రలు బాగా నచ్చాయి.

**మిమ్మల్ని ముందు ఐరన్‌లెగ్ అన్నారు. ఆ తరువాత గోల్డెన్ లెగ్ అన్నారు. ఇప్పుడు లక్కీస్టార్ అంటున్నారు. ఇవన్నీ వింటూంటే ఎలా అనిపిస్తుంది?**

ఏ నటికైనా గుర్తింపు వచ్చేది ఆయా చిత్రాల జయాపజయాల మీదే! నా కెరీర్‌లో మొదటి ఏడు సంవత్సరాలు సక్సెస్ అన్న పదానికి దూరంగానే ఉన్నాను. ఆ తరువాతే విజయం తలుపు తట్టింది. రాఘవేంద్రరావుగారి వల్లే నాకు మొదటి సక్సెస్ వచ్చింది. అప్పటి నుంచీ ఇప్పటి వరకూ అపజయం అన్నది దాదాపు ఎరుగను.

**దాదాపు ఐదు సంవత్సరాలు ఒక సినిమా కోసం పనిచేయడం ఎలా అనిపించింది?**

ఇంతకాలం పనిచేయడం వలన సినిమాతోనూ, యూనిట్‌తోనూ విడదీయరాని బంధం ఏర్పడింది. సినిమా పూర్తి అయినప్పుడు సొంత ఇంటిని వదిలి ఎక్కడికో వెడుతున్న బాధ కలిగింది. కాకపోతే నేను పూర్తిగా ఐదు సంవత్సరాలు ఈ సినిమాకి మాత్రమే పనిచేయలేదు. మధ్య మధ్య ఇతర భాషలలో నేను ఒప్పుకున్న సినిమాలు పూర్తి చేశాను. ఈ సినిమా కారణంగా వ్యక్తిగత జీవితానికి ఎలాంటి ఇబ్బందీ ఎదురు కాలేదు.

**సినిమా రషెస్ చూసినప్పుడు కన్నీరు తెప్పించిన సన్నివేశం?**

పూర్తి సినిమాను ఎప్పుడూ చూడలేదు. ఎమోషనల్‌గా ఫీలయ్యే సన్నివేశాలు, బాధ కలిగించేవి సినిమాలో చాలానే ఉన్నాయి.. 'బాహుబలి-2'లో కట్టప్ప వచ్చి నాకు నిజం చెప్పే సన్నివేశం తెర మీద చూసినప్పుడు కన్నీరు వచ్చింది. అది చాలా ఎమోషనల్ సన్నివేశం.



**ఈ సినిమాలో 'నా మాటే శాసనం' అని అంటారు కదా? ఇంట్లో కూడా రమ్యకృష్ణ అలాగే ఉంటుందా?**

దాదాపు అలాగే ఉంటుంది. కృష్ణవంశీ గారు ఇంటి విషయాలన్నీ నాకే వదిలేశారు. ఏ నిర్ణయం అయినా నాదే ఫైనల్! నా నిర్ణయం, నా మాటా శాసనం కిందే భావిస్తారు.

**మీ కన్నా ముందు ఈ పాత్ర శ్రీదేవి దగ్గరకు వెళ్ళిన సంగతి తెలుసా?**

నా కన్నా ముందు ఈ పాత్రకు ఓ సీనియర్ నటిని అనుకున్నారు అన్న సంగతి తెలుసు. కానీ శ్రీదేవిని అనుకున్నారన్న సంగతి తెలియదు. ఇప్పుడు వస్తున్న వార్తల ద్వారా తెలుసుకున్నాను.

**భవిష్యత్తులో శివగామిలాంటి పాత్ర వస్తే చేస్తారా?**

అలాంటి పాత్ర వస్తుందా? రాదా? అన్నది చెప్పలేను. ఎప్పుడూ ఒకేలాంటి పాత్రలంటే చూసే వారికి బోర్ కొడుతుంది. ఇకముందు అలాంటి సినిమా చేయనేమో!

**గ్లామర్ పాత్రలు చేస్తున్న సమయంలోనే అమ్మవారి పాత్రలు చేశారు కదా? కెరీర్‌కి ఇబ్బంది అవుతుందేమో అనిపించలేదా?**

నటి అన్నాక ఏ పాత్ర అయినా చేయాలి. కేవలం గ్లామర్ పాత్రలు మాత్రమే చేస్తానని అనడం సరికాదు. నా కెరీర్ చూస్తే ఆ విషయం అర్థమవుతుంది. నేను అన్ని రకాల పాత్రలూ చేశాను. ఇక అమ్మవారి పాత్రలంటే... అప్పట్లో వాటిని ఓ ఛాలెంజ్‌గా తీసుకుని చేశాను. ఆ టైంలో రమ్యకృష్ణ అమ్మవారి పాత్రలు చేయలేదు అని కొందరు అన్నారు. కానీ నామీద నాకు నమ్మకం ఉంది. అందుకే వాటిని చేసి ప్రేక్షకులను మెప్పించాను.

**కొందరు నటీమణులు సినీరంగంలోనూ వేధింపులున్నాయి అంటూ బయటపడుతున్నారు కదా? నిజంగా వేధింపులు ఉన్నాయా?**

ఏ రంగంలోనైనా వేధింపులు తప్పవేమో! పనిపరంగా కావచ్చు, మరే విషయంలోనైనా కావచ్చు. వాటి గురించి పట్టించుకోకుండా మన పని మనం చేసుకుంటూ పోతే, కెరీర్‌లో పైకి రాగలుగుతాం.

**హీరోయిన్‌గా చేశారు. క్యారెక్టర్ ఆర్టిస్టుగా చేస్తున్నారు? అప్పటికీ, ఇప్పటికీ ఈ రంగంలో వస్తున్న, వచ్చిన మార్పుల గురించి...?**



ముఖ్యమైన మార్పు టెక్నాలజీ. బాగా డెవలప్ అయింది. హీరోయిన్‌గా నాకు ఎన్ని మంచి పాత్రలు లభించాయో, ఇప్పుడూ అంతే! వెరైటీ పాత్రలు లభిస్తున్నాయి. చాలా కొద్ది మందికి లభించే అదృష్టం ఇది. ఆ భగవంతుని దయ నా మీద ఉన్నందువలనే ఈరోజు ఈ స్థాయిలో ఉన్నానని నమ్ముతాను.

**భగవంతుడంటే భక్తి ఎక్కువేనట కదా?**

ఆయన్ని నమ్మనివారూ, కొలవనివారూ తక్కువగా ఉంటారు. నా వరకూ నాకు భగవంతుడంటే భక్తీ, నమ్మకం ఎక్కువే!

**డ్రీమ్‌రోల్ లాంటివి ఉన్నాయా?**

అలాంటివి ఏమీ లేవు. నేను నీలాంబరి, శివగామి లాంటి పాత్రలు చేస్తానని అస్సలు ఊహించలేదు. అనుకోకుండా రెండు మంచి పవర్‌ఫుల్ క్యారెక్టర్లు చేసే అవకాశం దొరికింది. వాటిని మించి పాత్రలు ఉంటాయని నా మటుకు నేను అనుకోవడం లేదు.

**సినిమాల గురించి ఇంట్లో చర్చిస్తారా?**

అంత సమయం నాకూ, నా భర్తకూ ఉండదు. ఎప్పుడో తప్ప మా మధ్య సినిమాల టాపిక్ రాదు.

**దాదాపు 150 సినిమాల్లో నటించిన అనుభవం ఉంది కదా? దర్శకత్వం వైపు వెళ్ళే ఉద్దేశం ఉందా?**

ప్రస్తుతానికి అయితే లేదు. భవిష్యత్తులో ఆ ఆలోచన వస్తుందేమో! ఇప్పుడే చెప్పడం కష్టం కదా!

–స్పందనారెడ్డి

ఇంటర్వ్యూ

**అగ్రశ్రేణి హీరోలతో స్టెప్పులేసి ప్రేక్షకులను అలరించిన గ్లామర్ హీరోయిన్ రాధ. హిందీతో పాటు దక్షిణాది భాషల్లో 130కి పైగా చిత్రాల్లో నటించారు. హీరోయిన్‌ను సెక్స్ సింబల్‌గా చూపించడం ఈ మధ్య పరిపాటైందని వాపోతున్నారామె. సెక్స్, హింస పాలు తగ్గించేందుకు దర్శకనిర్మాతలు, ప్రభుత్వం ప్రయత్నించాలంటున్న రాధ ఇంటర్వ్యూ....**



# నావన్నీ గ్లామర్ పాత్రలే! -రాధ

మా నాన్నగారు కుంజాన్‌నాయర్. అమ్మ కల్లార సరసమ్మ. మేం ముగ్గురు అక్కాచెల్లెళ్ళం. మాకు ఇద్దరు తమ్ముళ్ళు. పెద్దక్క భ్రమరాంబిక. రెండో అక్క మల్లిక. నేను ఉదయచంద్రిక. అమ్మానాన్న నాకు పెట్టిన పేరు అదే. తమ్ముళ్ళు అర్జున్, సురేష్.

నాన్నగారు శ్రీశైలంలో ఇంజనీరుగా పనిచేసేవారు. నేను పుట్టింది అక్కడే. కేరళరాష్ట్రం తిరువనంతపురంజిల్లా కల్లారగ్రామంలో టెన్త్‌వరకు చదివి ప్రైవేటుగా బీకాం చేశాను.

స్కూల్లో గురువు శశిమాస్టర్ వద్ద భరతనాట్యం నేర్చుకుని ఎన్నో ప్రదర్శనలు ఇచ్చేదాన్ని. ఫ్యాన్సీడ్రెస్ పోటీల్లో, డ్రామాలో నటించేదాన్ని. అలా చదువుకునే రోజుల్లోనే నాకో గుర్తింపు లభించింది. అమ్మ నన్ను బాల్యం నుండి ప్రోత్సహించేది. ఉద్యోగరీత్యా నాన్న పట్టించుకోకపోయినా, వద్దు అని చెప్పేవారుకాదు. సినిమాలు బాగా చూసేదాన్ని. దాంతో సినిమాల్లో నటించాలనే కోరిక నాలో ప్రవేశించింది. అక్క అంబిక సినిమా రంగంలో ఉండటంవల్ల నాకు అవకాశం లభించింది. ఒకసారి అక్కతో షూటింగ్‌కి వెళ్ళినప్పుడు భారతీరాజాగారు నన్ను చూశారు. మా అమ్మగారిని సంప్రదించారు. అక్క ఎలాగో నటి. అందుకే నేనుకూడా నటించడానికి అమ్మ అంగీకరించింది.

భారతీరాజాగారు పరిశ్రమకు ఎవర్ని పరిచయం చేసినా వాళ్ళపేర్లు 'ఆర్'తో ఆరంభిస్తారు. రాధిక, రేవతి, రేఖ.... ఇలా ఆయన లక్కీ అక్షరం 'ఆర్'. అందుకే ఉదయచంద్రికగా ఉన్న నా పేరును రాధగా మార్చారు భారతీరాజా.

### తమిళచిత్రంతో తెరపైకి

భారతీరాజాగారి దర్శకత్వంలో 'అలైగల్‌వోయ్ వదిల్లై' తమిళచిత్రం ద్వారా 1981లో సినిమా పరిశ్రమకు పరిచయమయ్యాను. ఇందులో నా నటనకు ప్రేక్షకులు బ్రహ్మరథం పట్టారు. ఈ సూపర్‌హిట్ చిత్రంలో కార్తీక్, కమల్‌హాసన్, మాధవి, స్వప్న, సిల్క్‌స్మిత తదితరులు నటించారు. తెలుగులో కార్తీక్, ముచ్చెర్ల అరుణతో 'సీతాకోకచిలుక'గా రీమేక్ చేశారు. తర్వాత నేను ఆయన దర్శకత్వంలో నటించిన 'టిక్ టిక్ టిక్' తమిళచిత్రం కూడా హిట్ కావడంతో దాన్ని అదేపేరుతో తెలుగులోకి డబ్ చేశారు. అలా డబ్బింగ్ చిత్రంతో తెలుగులో నా సినీజైత్రయాత్ర ఆరంభమైంది.

### తెలుగులో

తెలుగులో నా తొలి చిత్రం 'మిస్టర్ విజయ్'. శోభన్‌బాబు, నేను చేశాం. కోదండరామిరెడ్డి దర్శకులు. రెండోచిత్రం నేను, అక్కినేని నాగేశ్వరరావుగారు నటించిన 'వసంతగీతం'. కానీ నా రెండో చిత్రమే ముందుగా విడుదల కావడం విశేషమన్నమాట. దీనికి సింగీతం శ్రీనివాసరావుగారు దర్శకులు, ఇలా 1984లో ఈ రెండు చిత్రాలు విడుదలయ్యాయి. ఇక ఆ తర్వాత తెలుగులో వరుసగా అవకాశాలొచ్చాయి.

### మెగాస్టార్‌తో 16 చిత్రాలు

మెగాస్టార్ చిరంజీవితో 16 చిత్రాల్లో హీరోయిన్‌గా నటించాను. కోదండరామిరెడ్డిగారి దర్శకత్వంలో కొండవీటి దొంగ, జేబుదొంగ, రక్తసింధూరం, మరణమృదంగం, రాక్షసుడు, దొంగ, గూండా, రాఘవేంద్రరావుగారి దర్శకత్వంలో అడవిదొంగ, బి.గోపాల్ దర్శకత్వంలో స్టేట్‌రౌడీ, రవిరాజా పినిసెట్టి దర్శకత్వంలో యముడికి మొగుడు, దాసరిగారి లంకేశ్వరుడు, తాతినేని ప్రసాద్‌గారి నాగు...ఇలా చిరంజీవిగారితో నటించడం నా అదృష్టం. అవన్నీ దాదాపు శతదినోత్సవ చిత్రాలే.

### హిందీ చిత్రం

1983లో సూపర్‌స్టార్ కృష్ణ, జయసుధ, నేను నటించిన 'శక్తి' చిత్రాన్ని 'హిందీలో 'కామ్యాబ్'గా రీమేక్ చేశారు. హిందీలో జితేంద్ర, షబానాఆజ్మీ, నేను చేశాం. ఈ రెండు చిత్రాలకు రాఘవేంద్రరావుగారే దర్శకులు. హిందీలో ఇదే నా తొలిచిత్రం.

అనిల్‌కపూర్, మాధురీదీక్షిత్ నటించిన 'లేజాబ్' చిత్రాన్ని తెలుగులో టూటౌన్ రౌడీగా దాసరిగారు రీమేక్ చేశారు. నేను వెంకటేష్‌గారు చేశాం. డింగ్ డాంగ్ డింగ్...డింగ్ డాంగ్ డింగ్...అనే పాట సన్నివేశంలో నేను వేసిన స్టెప్పులకు అద్భుతమైన రెస్పాన్స్ వచ్చింది. నేను ఎక్కడికెళ్ళినా అభిమానులు గుర్తు

చేస్తూ ఉంటారు. 1989లో ఈ చిత్రం విడుదలైంది.

మలయాళంలో నా తొలి చిత్రం 'మర్చురి' ప్రేమ్‌నజీర్, మధు, శ్రీవిద్య నటించారు.

నేను, శివాజీగణేశన్, సత్యరాజ్, ముచ్చెర్ల అరుణ తదితరులు నటించిన అద్భుతమైన తమిళ చిత్రం 'ముదల్ మరియాదై'. సూపర్‌డూపర్ హిట్ చిత్రం. దాదాపు రెండేళ్ళు థియేటర్లలో ప్రదర్శితమైంది. భారతీరాజా దర్శకులు. 1985లో తెలుగులో 'ఆత్మ బంధువు'గా దీనిని డబ్ చేశారు.

## సూపర్‌స్టార్ కృష్ణతో

సూపర్‌స్టార్ కృష్ణగారితో పలు చిత్రాలు చేశాను. రాఘవేంద్రరావుగారి దర్శకత్వంలో అగ్నిపర్వతం, భారతీరాజాగారి దర్శకత్వంలో జమదగ్ని చిత్రాల్లో కృష్ణగారితో నటించడం నా నట జీవితంలో ఒక మలుపు. అదేవిధంగా బాలకృష్ణతో 'నిప్పులాంటి మనిషి', ముద్దుల కృష్ణయ్య, రాముడు-భీముడు, కృష్ణం రాజుగారితో రావణబ్రహ్మ, మోహన్‌బాబుగారితో వింత మొగుడు చిత్రాలు నా నట జీవితంలో మైలురాళ్ళు.

ఇలా నేను తెలుగులో ఎందరో అగ్రనటులతో నటించాను. తమిళ, కన్నడ, మలయాళ చిత్రాల్లో శివాజీగణేశన్, మోహన్‌లాల్, రజనీకాంత్, విజయ కాంత్, సత్యరాజ్, కార్తీక్, రవిచంద్రన్, డాక్టర్ విష్ణు వర్ధన్ లాంటి బిగ్‌షాట్స్‌తో నటించాను. ఇలా అంద రితో నటించడం ఏ ఒక్క హీరోయిన్‌కీ సాధ్యంకాని పని. ఆ అవకాశం నాకు లభించింది.

## ఎన్టీఆర్‌తో

నటరత్న ఎన్.టి.రామారావుగారి దర్శకత్వంలో 'చండశాసనుడు' చిత్రంలో శారద, జయమాలిని, అన్నపూర్ణ, సత్యనారాయణ, రావుగోపాలరావు తది తరులతో నటించాను. అదేవిధంగా అక్కినేనిగారితో రెండు చిత్రాలు చేశాను. ఎన్టీఆర్, ఏఎన్నార్ కుమా రులు బాలకృష్ణ, నాగార్జునలతోనూ నటించాను.

## సావిత్రి ఒక ధర్మదేవత

సీరియస్ పాత్రలకు మారుపేరు మహానటి సావిత్రి. ఆవిడ కట్టూబొట్టూ చూడటమేగానీ ఆవి డతో కలిసి నటించలేకపోయాననే బాధ నా మన సులో మిగిలిపోయింది. ఇది నా దురదృష్టం. జీవిత చరమాంకంలో ఆమెపడిన బాధలు నన్ను కలచి వేశాయి. అంతగొప్ప నటి మరొకరు లేరని ఖచ్చి తంగా చెప్పగలను. ఆవిడ ఒక ధర్మదేవత. లేదు అనేమాట ఆవిడ నోటివెంట రాలేదు. చేయిచాచిన వారికి కాదనకుండా దానాలు చేశారు. ఇది నిజం.

## సీరియస్ పాత్రలు చెయ్యలేదు

నటనలో నేనెప్పుడూ చిన్నదాన్నే. ఆ దృష్టితోనే నటనలో ఎన్నో జాగ్రత్తలు, ప్రత్యేకశ్రద్ధ పాటించే దాన్ని. నేను వేసిన స్టెప్స్ చాలా బాగుంటాయని అభిమానులు అంటుంటారు. షూటింగ్ సమయంలో గ్యాప్ వస్తే సమయం వృథా చెయ్యకుండా నాతోటి నటులు ఎలా నటిస్తున్నారు? దర్శకులు వారికి ఎలా తర్ఫీదు ఇస్తున్నారు? అనే విషయాలు నిశి తంగా పరిశీలించేదాన్ని. వాళ్ళ హావభావాలు, మేన రిజమ్స్ గమనించి ఆకళించుకునేదాన్ని.

నా చిత్రాలన్నీ విజయవంతమైనవే. కాకపోతే నేను సీరియస్ పాత్రలు మాత్రం చెయ్యలేదు. నా పాత్రలన్నీ గ్లామర్ పాత్రలే. ప్రతి చిత్రాన్నీ అదే తొలి చిత్రంగా భావించి జాగ్రత్తగా నటించేదాన్ని. నిజం చెప్పాలంటే, నాతోటి నటీనటులు, దర్శకనిర్మా తలు, ప్రేక్షకులే నన్నీస్థాయిలో నిలబెట్టారు. వాళ్ళు నాకు అందించిన సహకారం ఎన్నటికీ మరువలే నిది. అందుకే తెలుగు చిత్ర పరిశ్రమను నేను ఎన్న టికీ మరువలేను.

## కాకినాడలో వీరాభిమాని

కాకినాడలో సత్యనారాయణ అని నాకో వీరాభి మాని ఉన్నారు. నా అభిమానసంఘం ఏర్పాటు చేసి ఆ పరిసర జిల్లాలకు నన్ను పిలుస్తూ ఉండేవారు. ఇప్పటికీ వాట్సాప్‌లో రోజూ ఉదయం 'గుడ్‌మార్నింగ్' మెసేజ్ పంపిస్తారు. అలాంటి మంచి అభిమానుల్ని సంపాదించుకున్నందుకు గర్వపడతాను.

సినిమా పరిశ్రమ సాఫీగా సాగిపోవడం అంటే, ముఖ్యంగా దర్శక నిర్మాతలు నటులకు తగిన పాత్రలు, మంచిపాత్రలు ఇవ్వడమే. నటుడు ఏ పాత్రకు న్యాయం చేయగలరో తెలుసుకుని నటింప జేయడమే ఆనాటి దర్శక నిర్మాతల ప్రత్యేకతగా ఉండేది. హాస్యం, పొగరు, రౌద్రం, గ్లామర్...ఇలా వారికి తగినట్టు నటుల్ని తీర్చిదిద్దేవారు. ఎవరు ఏవిధంగా నటించగలరో కనిపెట్టి వ్యక్తిగతంగా ఆర్టి స్టుల్లో ఉండే గొప్పతనం వెలికితీసేవారు.

చేందుకు ప్రభుత్వం, దర్శకనిర్మాతలు ప్రయత్నిం చాలి. యువతరం బలహీనతల్ని దుర్వినియోగం చెయ్యకూడదు. బాహుబలి రూపంలో సినిమా స్వర్ణ యుగం మళ్ళీ విజృంభిస్తుందని గట్టిగా నమ్ముతు న్నాను. మా అక్క అంబిక పర్‌ఫెక్ట్ బ్యూటిఫుల్ ఇండియన్ ఉమన్. నాకు చాలా నచ్చిన హీరోయిన్. నేను ఫీల్డులోకి వచ్చినప్పుడు జయప్రద, రేఖలను ఎంతో అభిమానించేదాన్ని. ఇప్పుడుకూడా.

## అక్కినేని చమత్కారం

అక్కినేని నాగేశ్వరరావు ఎంతో చమత్కారి. 2013లో 60వ సౌత్ ఫిలిమ్ అవార్డుల ఫంక్షన్‌కి వెళ్ళినప్పుడు, 'ఏయ్ రాధా, కొంచెం ఫ్యాట్ అయి నట్టున్నావ్. ఒక పనిచెయ్. రోజూ పొద్దున్నే ఓ పది హేనుసార్లు కూర్చుని మళ్ళీ నిలబడుతూ ఉండు ఎవరి సపోర్టూ లేకుండా. అప్పుడు ఆనాటి స్లిమ్‌నెస్ వస్తుంది' అన్నారు. ఆయన చెప్పినట్టే చేశాను. నిజంగానే నాలో భలే మార్పు వచ్చింది. ఆయన చమత్కారంగా అన్నాగానీ ఆయన చెప్పినదాంట్లో ఎంతో నిజం ఉంటుంది. అదే ఆయన గొప్పతనం.

## కుటుంబం

నా భర్తగారి పేరు రాజశేఖరన్ నాయర్. మాకు ఇద్దరు అమ్మాయిలు, ఒక అబ్బాయి. పెద్దమ్మాయి కార్తీకనాయర్, రెండో అమ్మాయి తులసీనాయర్. అబ్బాయి విఘ్నేష్‌నాయర్. ఇప్పుడు మా అమ్మాయి


కుటుంబసభ్యులతో....

## హీరోహీరోయిన్లు ఇలా ఉండాలి

యువతరానికి ప్రేరణ కలిగించే చిత్రాలు రావాలి. నటీనటులు అలాంటి చిత్రాలే ఒప్పుకోవాలి. హీరో అంటే త్యాగమూర్తిగా, హీరోయిన్ అంటే భారతీయ సంస్కృతికి ప్రతిబింబంగా ఉండాలి. సినిమా అంటే అమ్మాయిలపై చెడుభావం రేకెత్తిం చేలా ఉండకూడదు. నిర్మాతలు, దర్శకులు తలుచు కుంటే అద్భుతమైన చిత్రాలు నిర్మించగలరు. పాత చిత్రాల్ని సింహావలోకనం చేసుకుంటే తప్పక మార్పు వస్తుంది. సినిమాల్లో సెక్స్, హింస ఎంత తగ్గిస్తే అంత మంచిది. హీరోయిన్‌ను సెక్స్ సింబల్‌గా చూపించడం ఈ మధ్య పరిపాటైంది. వీటిని తగ్గిం

కార్తీక సినిమాల్లో నటిస్తోంది. షూటింగ్స్‌లో నేను ఎప్పుడూ ఒకే టైమింగ్స్ మెయిన్‌టైన్ చేసేదాన్ని. మా అమ్మాయికీ అదే నేర్పిస్తున్నాను. అందుకే అప్పుడప్పుడు అమ్మాయి వెంట వెళతాను. 'మనం మంచివాళ్ళమైతే మిగతావాళ్ళు కూడా మంచివాళ్ళే' అనేదే నా పాలసీ. ఉత్తమనటిగా తమిళనాడు ప్రభుత్వ కలైమామణి అవార్డు, సినిమా ఎక్స్‌ప్రెస్ అవార్డు, ఫిలింఫేర్ అవార్డు, సౌత్ ఫిలిమ్ అవార్డు సహా ఎన్నో అవార్డులు పొందాను.

—కె.హరనాథ్

సెల్: 97035 42598

